అపరాధ పరిశోధన అనుబంధం—80

# తెలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తెల్లచీర దెయ్యం
రచన: వసుంధర

## నాగరాణి
రచన: వాణిశ్రీ

## నిశాచరుడు
రచన: టెంపోరావ్

## పురికోరిన పుత్తరం
రచన : సికిందర్

పొగమంచు — ఎనిమిదవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 80**
ఆగస్టు, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# తెల్లచీర దెయ్యం!

వసుంధర

"రాత్రి నేను దెయ్యాన్ని చూశాను" అన్నాడు ప్రతాప్.

ఆ మాట అంటున్నప్పుడు మాటతో పాటు శరీరం కూడా వణికిందతనికి.

సూర్యం అతనివంకే పరిశీలనగా చూసి "అసలేం జరిగిందో చెప్పు!" అన్నాడు.

"సరిగ్గా రాత్రి పన్నెండు గంటలకు...." అని చెప్పబోయి ఆగాడు ప్రతాప్. జరిగింది గుర్తుకు వచ్చిందేమో అతడి కళ్ళలో భయం స్పష్టంగా కనబడింది.

"త్వరగా చెప్పు" విసుగ్గా అన్నాడు సూర్యం.

ప్రతాప్ త్వరగా చెప్పలేకపోయాడు. కాని అతడు చెప్పినదాంట్లో సారాంశం:

నిన్నరాత్రి గదిలో ప్రతాప్ ఒక్కడూ పడుకుని వున్నాడు. ఒక రాత్రివేళ కిటికీ తలుపులు దబదబా బాదిన శబ్దం వినబడింది. ప్రతాప్ ఉలిక్కిపడి లేచాడు.

కిటికీ తలుపులు అలా బాదబడుతూనే వున్నాయి. ఎవరదీ అని అరిచాడు ప్రతాప్. సమాధానం రాలేదు కానీ కిటికీ దగ్గర చప్పుడు మాత్రం కొద్దిక్షణాలపాటు ఆగి మళ్ళీ ప్రారంభమైంది.

ప్రతాప్‌కు పూర్తిగా నిద్రమత్తు వదలలేదు. చేయి చాపి అందుబాటులో వున్న స్విచ్ నొక్కాడు. గదంతా ప్రకాశవంతమైంది. అప్పుడతనికి కిటికీకి అవతల వున్న ఆకారం ఒకటి కిటికీ అద్దాల్లోంచి కనబడింది. నల్లగా వుందది. ముఖం స్పష్టంగా తెలియడంలేదు. చేతులకు వాడిగోళ్ళున్నాయి. తలమీద ఓ రెండు కొమ్ములు. ఆ ఆకారం తలుపులపై బాదుతూంటే ఆ చేతుల కదలిక అత్యంత భయంకరంగా వుంది.

ప్రతాప్ ఒక్కక్షణం మాత్రం ఆ ఆకారాన్ని చూసి వెంటనే భయంతో కళ్ళు మూసుకున్నాడు. కొంత సేపటికి శబ్దం ఆగిపోయింది. ప్రతాప్ ధైర్యం తెచ్చుకుని కళ్ళు తెరిచి కిటికీవంక ఓరగా చూశాడు. అక్కడ ఆకారం లేదు. కానీ ప్రతాప్ లైటు ఆర్పలేదు. అతనికి ఓ పట్టాన నిద్రరాలేదు. ఆ ఆకారం దయ్యమని అతడు భావిస్తున్నాడు.

"నువ్వు ధైర్యంచేసి కిటికీ దగ్గరకు వెళ్ళి తలుపులు తీసి చూడాల్సింది. దయ్యం అసలు కథ బయటపడేది" అన్నాడు సూర్యం.

"దూరాన్నించి చూశాను కాబట్టి గుండె వేగంగా కొట్టుకోవడంతో సరిపోయింది. అదే దగ్గర్నుంచైతే గుండె కొట్టుకోవాల్సిన అవసరమే ఉండేదికాదు" అన్నాడు ప్రతాప్.

"చాలా బాగుంది. నా దగ్గరంటే అన్నావు కానీ

ఈ దయ్యం సంగతిం కెవరికీ చెప్పకు. నిన్నెవరైనా ఆట పట్టించగలరు" అన్నాడు సూర్యం.

"అయితే నా కథను నువ్వు నమ్మడంలేదా?" అన్నాడు ప్రతాప్.

"కథల నెవరైనా విని ఆనందిస్తారు కాని నమ్ముతారా?" అన్నాడు సూర్యం.

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఈ రోజు నాకో సాయం చేయాలి" అన్నాడు ప్రతాప్.

"అడుగు—"

"ఈ రాత్రికి నువ్వు నా గదిలో సాయం పడుకోవాలి" అన్నాడు ప్రతాప్.

"ఏడిసినట్లుంది. మామూలుగా అయితే ఒప్పుకునే వాణ్ణేమో కాని ఇంత చచ్చు కారణానికి మాత్రం నా సాయం కావాలంటే ఒప్పుకోను...." అని ప్రతాప్ ముఖం చూసి ఆగిపోయాడు సూర్యం. అతడి ముఖం అత్యంత దయనీయంగా వున్నది. "ప్రతాప్ నువ్వు నిజంగా భయపడుతున్నావా?" అన్నాడు.

"నిన్న జరిగినలాంటి సంఘటన ఈ రోజు కూడా జరిగితే నేనేమైపోతానోనని భయంగా వుంది."

సూర్యం జాలిగా నవ్వి "నువ్విదివరలో ఎన్నడూ హాస్టల్లో ఉండలేదా?" అన్నాడు.

"లేదు—ఏం?"

"హాస్టల్లో ఇలాంటివి సర్వసాధారణం. కాస్త లోకువగా కనిపించేవాళ్ళను ఏడ్పించటంకోసం యిలాంటి ట్రిక్కులు వేస్తుంటారు. లేకపోతే ఈ రోజుల్లో ఇంకా దయ్యాలేమిటి?" అన్నాడు సూర్యం.

"నువ్వు దయ్యాన్ని చూడలేదు కాబట్టి అలా అంటు

న్నావు. చూసాను కాబట్టి నాకు గుండె దడగా ఉంది" అన్నాడు ప్రతాప్.

"నా అనుభవం ఒకటి చెప్పనా?" అన్నాడు సూర్యం. చెప్పమనకుండానే అతడు చెప్పసాగాడు కూడా.

సూర్యం చదువుకునే రోజుల్లో కొత్తగా హాస్టల్లో చేరినప్పుడక్కడ భూతం వుందని కొందరు సీనియర్సు భయపెట్టారుట. సూర్యం పెంకిమనిషి కావడంవల్ల ఆ విషయాన్ని పట్టించుకోలేదు. ఒకరోజు అతను తన గదికి వెళ్ళేసరికి గదిలో వస్తువులన్నీ తలక్రిందులు చేసి ఉన్నాయి. మంచం, పెట్టె, జోళ్ళు, పుస్తకాలు.... ఒకటేమిటి.... మొత్తం అన్నీ తలక్రిందులై వున్నాయి.

సూర్యానికది ఎవరో కొంటెతనంతో చేసిన పనయుం టుందని అనుమానం వచ్చి వస్తువులన్నీ మళ్ళీ యధా ప్రకారంగా సర్దేశాడు. కాసేపటికి ఇద్దరు సీనియర్సు అతడి గదిలోకి వచ్చి పలకరించారు. సూర్యం వాళ్ళతో మామూలుగానే మాట్లాడాడు. వాళ్ళు కాసేపు అతడితో అవీ ఇవీ మాట్లాడి భూతం ప్రసక్తి తెచ్చారు.

"భూతాల గొడవొద్దు. నాకు వాటిమీద నమ్మకం లేదు" అన్నాడు సూర్యం.

"అయితే దాని చేష్టలేమీ నీకు అనుభవంలోకి రాలేదా?" అన్నాడు ఓ సీనియర్.

"లేదు" అన్నాడు సూర్యం.

"దాని చేష్టలు చాలా విచిత్రంగా వుంటాయి. ఒకో సారి అది గదిలోని వస్తువులన్నీ తలక్రిందులుచేసి పోతూం టుంది. అలాంటి అనుభం ఏదైనా జరిగిందా నీకు" అన్నాడింకో సీనియర్.

"ఇంతవరకూ లేదు" అన్నాడు సూర్యం.

సీనియర్సిద్దరూ గదిని పరీక్షించి "వాటం చూస్తూంటే ఈ గదిని ఇప్పుడే సర్దినట్లుంది. అబద్ధం చెప్పకు. మహాత్ముడనికి దాస్తున్నావుగాని భూతం నీ గదిలోని వస్తువుల్ని తలకిందులు చేస్తే యిప్పుడే సర్దావు కదూ" అన్నాడు.

"పదిరోజుల్నించి ఈ గదిలో నేను పూచికపుల్ల కూడా కదల్చలేదు" అన్నాడు సూర్యం.

సీనియర్స్ ముఖంలో రవంత నిరుత్సాహం కనబడింది. వాళ్ళు క్షుణ్ణంగా గదంతా పరిశీలించి అలమారా పైన వున్న ఇత్తడి చెంబొకటి తీసి "ఇత్తడిచెంబు నెవరైనా అల్మారా పైన పెడతారా—ఇది తప్పండా భూతం పనే" అన్నారు.

సూర్యం ఆ చెంబునిందాక చూసుకోలేదు. అయినా చలించకుండా అతను "నేను ఇత్తడిచెంబును వాడను. అందుకే అదక్కడ నేనే పెట్టాను" అన్నాడు.

సీనియర్సిద్దరూ ముఖముఖాలు చూసుకుని "నువ్వు చాలా ఘటికుడివి. ఇదే పధకంతో ఇప్పటికి పదిమందిని వాడలగొట్టాం మేము. ఇందాకా నీ రూము కూడా చిందరవందర చేశాం" అని ఒప్పేసుకుని అతణ్ణి కూడా తమలో ఒకడిగా చేసుకున్నారు.

"చదువుకునే రోజుల్లోనే బ్రహ్మచారులకంత తీరుబడి వుంటే ఇంక ఉద్యోగం చేసే బ్రహ్మచారుల మాట చెప్పాలా?" అని తన కధ ముగించాడు సూర్యం.

అది వ్యాపారదృష్టితో ఓ పాతికమంది బ్రహ్మచారులుండడానికి కట్టించబడ్డ భవనం. దానికి రెండంతస్థులున్నాయి. పైన పన్నెండు, క్రింద పదమూడు పోర్షన్సున్నాయి. అందులో వుండే వాళ్ళందరూ కూడా ఉద్యోగస్థులే. ఊరికి కాస్త చివర ఉన్నప్పటికీ-అక్క-

ణించి బస్సు సదుపాయాలుండడంవల్ల చాలామంది ఆ ఇంట్లో వుండడానికి ఇష్టపడతారు. ఎందుకంటే నూటయాభై రూపాయల అద్దెకు అన్ని వసతులుండే ఇళ్ళు దొరకవు. అదీకాక పెళ్ళైనవారు కూడా ఏదైనా ఇల్లు దొరికే వరకూ ఆ ఇంట్లోనే భార్యతో వుండవచ్చు. దంపతులా ఇళ్ళలో వుండడానికి ఇంటి యజమాని పెద్దగా అభ్యంతరంలేదు కానీ అంతమంది బ్రహ్మచారుల మధ్య ఎక్కువ రోజులు తన భార్యనుంచడానికి ఏ భర్త కూడా యిష్టపడడు.

ఇంటి యజమాని ఒకప్పుడు బ్రహ్మచారిగా వుండి ఇల్లు దొరక్క అవసపడ్డాడుట. అందుకని ఆయన బ్రహ్మచారులకోసమని ఈ యిల్లు ప్రత్యేకంగా కట్టించి ఫస్టు ప్రిఫరెన్సు వాళ్ళకే యిస్తాడు. ఇంట్లోవున్న బ్రహ్మచారులకు పెళ్ళైతే అక్కడ దంపతుల్నుండనిస్తాడు తప్పితే— దంపతులా యిల్లు వెతుక్కుంటూ వస్తే రానివ్వడు. అందుకాయన చెప్పే ఇంకో కారణం "బ్రహ్మచారి యిల్లు శుభ్రంగా వుంచడు. అందువల్ల ఇంటికేమీ నష్టంలేదు. గృహిణి యిల్లు నీటుగా సర్దాలనుకుంటుంది. అదే ఇంటిని పాడుచేస్తుంది. అల్మారా తయారుచేయించడమో, గోడకు మేకులు కొట్టడమో లాంటి మార్పులు గృహిణుల కారణంగానే జరుగుతాయి."

ఇలాంటి ఇంట్లో నిన్నరాత్రి ఓ దెయ్యం వెలసి ప్రతాప్‌ని భయపెట్టింది. సూర్యం దాన్ని ఎవరో ఆడిన ఆటగా కొట్టిపారేశాడు.

"నీ మాటలు నాకు ధైర్యాన్నిస్తున్నాయి" అన్నాడు ప్రతాప్.

# 2

"సుబ్బారావ్ నువ్వు నాకో సాయం చేయాలి!" అన్నాడు ప్రతాప్.

"ఏమిటది?" అన్నాడు సుబ్బారావు.

"ఈ రాత్రికి నువ్వు నా గదిలో సాయం పడుకోవాలి."

"ఎందుకు?" అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యంగా.

"ఓ దెయ్యం నన్ను భయపెడుతోంది" అన్నాడు ప్రతాప్.

"దెయ్యమా?" అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యంగా.

"అవును...." దీనంగా అన్నాడు ప్రతాప్.

"సూర్యం నీకు బాగా స్నేహితుడు. అతన్నడగక నన్నడిగావేం?"

"సూర్యం దెయ్యాన్ని నమ్మడు. ఎవరో నన్నేడిపించాలని చేస్తున్న కొంటెపని ఇది అని కొట్టిపారేశాడు" అన్నాడు ప్రతాప్.

"బాగుంది నా అభిప్రాయమూ అదే!" అన్నాడు సుబ్బారావు.

"నిన్న సూర్యం అలా అంటే నేను ధైర్యం తెచ్చుకున్నాను. కానీ రాత్రి పన్నెండు గంటలకు మొన్నటి అనుభవమే మళ్ళీ జరిగింది...." అంటూ తన అనుభవాన్ని వివరించి చెప్పాడు ప్రతాప్.

సుబ్బారావు ఆశ్చర్యంగా అంతా విని "ఇక్కడ దయ్యమా? నమ్మలేను" అన్నాడు.

"నువ్వు నమ్మలేనంటున్నావు. సూర్యం అయితే నమ్మననే అంటున్నాడు. రాత్రి పన్నెండయ్యేసరికి నా వళ్ళంతా ఎక్కడలేని వణుకు వచ్చేస్తోంది. ఎక్కడలేని

భయమూ నన్నావహిస్తోంది. ఆ దయ్యం ఎవరో నన్నెందుకిలా పట్టి పీడిస్తోందో తెలియడంలేదు...." అన్నాడు ప్రతాప్.

"అయితే నన్నేం చేయమంటావ్ ?"

"నాకు సాయం పడుకో."

"ఉండు. ముకుందరావుని పిలుస్తాను. ఈ భవనంలో అతను చాలా ఏళ్ళుగా వుంటున్నాడు. అతడి ఎరుకలో ఎప్పుడైనా యిలాంటి అనుభవం వచ్చిందేమో కనుక్కుందాం" అన్నాడు సుబ్బారావు.

"పిలవడమెందుకూ మనమే ముకుందరావు దగ్గరకు వెడదాం" అన్నాడు ప్రతాప్.

ఇద్దరూ కలిసి ముకుందరావు దగ్గరకు వెళ్ళారు. ముకుందరావు వీళ్ళ కథవిని ఏదో ఆలోచించి "అన్నట్లు నువ్వుండేది పదమూడో నంబరు గది కదూ" అన్నాడు.

"అవును-ఏం?" అన్నాడు ప్రతాప్ కంగారుగా.

"నీకుముందు అందులో జోసెఫ్ ఉండేవాడు. ఆ గదిలోకి రోజూ కామిని పిశాచి వచ్చి గాజులు గలగలలాడించేదట. దాని బాధ భరించలేకనే అతనా గది వదిలిపెట్టి వెళ్ళిపోయాడు" అన్నాడు ముకుందరావు.

"నీకు గాజుల గలగల వినబడుతుందా?" అనడిగాడు సుబ్బారావు.

"భయంతో శబ్దాలంతగా గుర్తులేదు నాకు. కానీ మీరు అడుగుతూంటే అనుమానంగానే వుంది. కిటికీ తలుపులు బాదినప్పుడు గాజులు గలగలమన్నట్లే వుంది" అన్నాడు ప్రతాప్.

"నువ్వు మాత్రం జోసెఫ్‌లా చేయకు. ధైర్యంగా వుండు" అన్నాడు ముకుందరావు.

"ధైర్యంగా వుండాలనే వుంటోంది. కానీ గడియారంలో టైము పన్నెండయ్యేసరికి నా సర్వశక్తులూ నశించి పోతున్నాయి. శరీరం వణికిపోతోంది" అన్నాడు ప్రతాప్.

"అయినా ఆ సమానూ టైము చూసుకోవడమెందుకు? రాత్రి తొమ్మిదింటికే ముసుగుతన్ని పడుకో—తెల్లవారేదాకా ముసుగు తీయకు...." అన్నాడు ముకుందరావు.

"వెధవ దెయ్యం ఊరుకోవడంలేదుకదా తలుపులు దబదబ బాదుతోంది" అన్నాడు ప్రతాప్.

"నీది చాలా అదృష్టం....జోసెఫ్‌కైతే...." అంటూ జోసెఫ్‌ని ఓరచూపులతో ఎలా కవ్వించేదో, అప్పుడప్పుడు పళ్ళు బైటపెట్టి ఎలా బెదిరించేదో వివరించి చెప్పాడు ముకుందరావు.

"చెప్పొద్దు. ప్లీజ్" అన్నాడు ప్రతాప్.

"ధైర్యంగా వుంటే ఏమీ ప్రమాదముండదు. పిరికివాళ్ళనే దెయ్యాలేడిపిస్తాయి" అన్నాడు ముకుందరావు.

"నన్నేమన్నా ఫరవాలేదు. దయతో ఈ ఒక్కరాత్రి నన్ను కాపాడండి. నాకు సాయముండండి" అన్నాడు ప్రతాప్ ఇద్దర్నీ ఉద్దేశించి. ముకుందరావు చెప్పిన కథ విన్నాక అతడి భయం ఇంకా పెరిగినట్లుంది.

## 3

ఆ భవంతిలో పాతికగదులు కాక ఓ పెద్ద హాలుంది.

ఆ హాల్లో ఓ వంటవాడుంటున్నాడు. అతడి పేరు సుబ్బయ్య. పదేళ్ళుగా అక్కడ పనిచేస్తున్నాడు సుబ్బయ్య. భవంతిలోని వారందరికీ ఏం కావాలంటే అవి కలిపిపెడుతూంటాడు సుబ్బయ్య. అతడూ, అతడి భార్యా

ముగ్గురుపిల్లలూ ఆ హాల్లోనే వుంటున్నారు.

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు ముకుందరావు, సుబ్బారావు, ప్రతాప్ కలిసే భోంచేశారు. భోజనాలయ్యాక ముగ్గురూ కలిసి ప్రతాప్ గదికి వెళ్ళారు.

"నమ్మకం ఒకందుకు మంచిదే కానీ—దానివల్ల చాలా నష్టాలు కూడా ఉన్నాయి" అన్నాడు ముకుందరావు.

"ఏం?" అన్నాడు ప్రతాప్.

"ఒకడు దేవుణ్ణి నమ్మాడనుకో ప్రాణం సుఖంగా వుంటుంది. ఏ బాధలు వచ్చినా వాడు చలించడు. అంతా దేవుడికి వదిలి నిశ్చింతగా ఉండగల్గుతాడు. నమ్మకం అలాంటిది. నువ్వు దెయ్యాన్ని నమ్మావు. అనుక్షణం దాని గురించి భ్రాంతిపడి సుఖశాంతులు కోల్పోతున్నావు" అన్నాడు ముకుందరావు.

"అయితే నేను భ్రాంతిపడుతున్నానంటావా? మరి జోసెఫ్ సంగతేమిటి?" అన్నాడు ప్రతాప్.

"మీ నమ్మకమే మీకా భ్రాంతిని కలిగిస్తూ వుండి వుంటుంది. ఉదాహరణకు జోసెఫ్ సంగతి తీసుకో. అతడి గదిలో దెయ్యాన్ని చూడ్డంకోసం నేనొక్కణ్ణే వరుసగా నాలుగు రాత్రులున్నాను. అది నా కంట బడలేదు. కారణమేమిటంటావ్?"

"జోకులేయడానికి మనుషులు వెర్రివెధవల్ని ఎన్నుకున్నట్లే, దెయ్యాలు కూడా భయస్థుల్ని ఎన్నుకుంటాయేమో" అన్నాడు సుబ్బారావు.

"అయినా నువ్వు దైవభక్తుడివి కదా—నీకు దెయ్యాల భయమేమిటి?" అన్నాడు ముకుందరావు. అతడా గదిలో వున్న దేవుడిబొమ్మలను పరీక్షగా చూస్తున్నాడు.

"ఎన్ని బొమ్మలుంటే ఏం లాభం? ఆంజనేయుడి

బొమ్మ లేదుగదా!" అన్నాడు ప్రతాప్ దిగులుగా.

"సరే—ఇది కూడా నమ్ముతున్నావూ! హిందువులకి ఆంజనేయుడి గురించి తెలుస్తుంది. మరా దెయ్యం ఏ ముస్లిమ్‌దో అయితే....?" అన్నాడు ముకుందరావు.

"ఓ పని చేయి. ఈ రోజుకా దయ్యం ఏ మతందో తెలుసుకుందుకు ప్రయత్నించు. దాన్నిబట్టి నివారణోపాయం ఆలోచిద్దాం" అన్నాడు సుబ్బారావు.

"దెయ్యం గురించి తల్చుకుంటేనే ప్రాణం పోయేలా వుంటే పలకరించి మతం తెలుసుకోమంటున్నావ్! పలకరించే ధైర్యముంటే ఈ బాధంతా ఎందుకు?" అన్నాడు ప్రతాప్.

"దెయ్యాలు లేవని నీ మనసును నమ్మించు. నీకే బాధా వుండదు" అన్నాడు ముకుందరావు.

క్రమంగా టైము పన్నెండు దాటింది. మాటల్లో ఎవరికీ టైము తెలియలేదు. టైము పన్నెండుంపావయ్యేక "ఇప్పటికేనా ధైర్యం వచ్చిందా? మమ్మల్నిక్కడే పడుకోమంటావా?" అన్నాడు ముకుందరావు.

"ఇంక ఫరవాలేదు. మీరు వెళ్ళండి" అన్నాడు ప్రతాప్ బింకంగా.

ముకుందరావు, సుబ్బారావు బైటకు వెళ్ళారు. ప్రతాప్ తలుపులు వేసుకుని మంచంవైపు నడిచాడు. కిటికీ దగ్గర ఏదో ఆకారం కదలినట్లయింది. మనసుకోమూల ధైర్యం చెప్పుకుంటూ, చూడకూడదనుకుంటూనే అటు చూశాడు ప్రతాప్.

వాడిగోళ్ళున్న రెండు చేతులు కిటికీ అద్దాల వెనుక భయంకరంగా కదులుతున్నాయి. ప్రతాప్‌కి భయంతో నోట మాట రాలేదు. అతడికి ముందడుగు కూడా పడలేదు.

కానీ అతడు కిటికీవైపు చూడకుండా కళ్ళు మూసు కున్నాడు గట్టిగా!

అంతలోనే ఒక విచిత్రమైన అరుపు వినబడింది. అదికూడా కిటికీ దగ్గర్నుంచే వచ్చింది.అప్రయత్నంగా ప్రతాప్ కిటికీ వంక చూశాడు.

అక్కడి ఆకారం అతడివంక భయంకరంగా చూస్తోంది. అది కిటికీలోంచి గదిలోకి రానున్నదని అతడికి అర్థమై పోయింది.

ప్రతాప్ కెవ్వుమని అరిచి ఒక్క ఉదుటున గుమ్మం దగ్గరకుచేరి తలుపులు తీసుకుని బైటకు వచ్చాడు. అతడి చెవులకు దూరంగా ముకుందరావు కంఠం వినబడింది. ఒక్క అంగలో అతనటు చేరాడు.

అతను చేరుకున్నది భోజనాల హాలు! అక్కడ ముకుందరావు, సుబ్బారావు, వంటవాడు సుబ్బయ్య కలిసి ఏవో మాట్లాడుకుంటున్నారు. ముందు సుబ్బయ్యే ప్రతాప్‌ని పలకరించి "ఏం జరిగింది బాబూ అలా కంగా రుగా వున్నారు" అన్నాడు.

ప్రతాప్ ఎంతో కష్టంమీద ప్రయత్నించి "దెయ్యం!" అని మాత్రం అనగలిగాడు.

దెయ్యం అన్న పదం వింటూనే సుబ్బయ్య ఉలిక్కి పడి "అయ్యబాబోయ్ మళ్ళీ వచ్చిందా అది!" అన్నాడు. ఆ మాట వింటూనే అతడు వణికిపోసాగాడు.

ముకుందరావు ఆశ్చర్యంగా అతడివంక చూసి "నీకూ తెలుసా దెయ్యం కథ!" అన్నాడు.

"రెండేళ్ళ క్రితం చూశాను బాబూ!" అన్నాడు సుబ్బయ్య.

ఓ రాత్రి పడుకొంటే ఎవరో చప్పట్లు చరిచినట్లయిం

దిట. మెలకువొచ్చి చూస్తే ఓ అందమైన ఆడపిల్ల జుట్టు విరబోసుకుని, తెల్లచీర కట్టుకుని తనకు కాస్త దూరంలో నిలబడి వుందట. సుబ్బయ్యను చూసి నవ్విందట. సుబ్బయ్య అనుమానం వచ్చి కాళ్ళవైపు చూశాట్ట. అవి వెనక్కి తిరిగి ఉన్నాయట. అప్పుడు తనకు కలిగిన భయం ఇంతా అంతా కాదుట. అతికష్టంమీద ప్రయత్నించి "ఆంజనేయా!" అని పెద్దగా కేకపెట్టాట్ట. దెయ్యం నాలిక బైటకుపెట్టి భయంకరంగా వెక్కిరించి మాయమైపోయిందిట. ఈ కథ తెల్సుకోడానికే భయంకరంగా వుండడం వల్ల సుబ్బయ్య మరింకెవరికీ చెప్పలేదుట.

"మళ్ళీ కనబడలేదా నీకా దెయ్యం?" అనడిగాడు ముకుందరావు.

"లేదండి" అన్నాడు సుబ్బయ్య.

"నేను చూసిన దెయ్యం ముఖం నల్లగా భయంకరంగా వుంది" అన్నాడు ప్రతాప్.

"అయ్య బాబోయ్ రెండు దయ్యాలన్నమాట!" అన్నాడు సుబ్బయ్య.

"రెండని ఎందుకనుకోవాలి? ఒకే దయ్యం యెన్ని వేషాలైనా మార్చగలదు గదా!" అన్నాడు సుబ్బారావు.

"నేనింక ఆ గదిలోకి వెళ్ళను" అన్నాడు ప్రతాప్.

"ఎవరైనా లోకువకట్టి నిన్నేడిపిస్తున్నారేమో?" అన్నాడు సుబ్బారావు.

"ఈ రాత్రితో అన్ని సందేహాలూ తీరిపోతాయి. ఆ దెయ్యం మనిషీ, జంతువూ కాని ఒక కంఠంతో అరిచింది. అది చాలా విచిత్రమైన అరుపు. నేను దెయ్యం అని భ్రాంతిపడుతూనైనా వుండాలి. నిజంగా దెయ్య

మైనా అయుండాలి—తప్పితే అది మనిషికి సాధ్యమయ్యే పనికాదు. ఆ అరుపు ఏదో మానవాతీతశక్తి. అందులో నాకింకేమీ సందేహంలేదు" అన్నాడు ప్రతాప్ నమ్మకంగా.

"అయితే ఏం చేద్దాం?" అన్నాడు ముకుందరావు.

"నేను మీ గదిలో పడుకుంటాను...." అన్నాడు ప్రతాప్.

ప్రతాప్ గదికి తాళం కూడా ముకుందరావే వేశాడు. ముగ్గురూ సుబ్బారావు గదిలో పడుకున్నారు.

## 4

"టైము పన్నెండయుండాలి" అన్నాడు ప్రతాప్.

"ఏం?" అన్నాడు ముకుందరావు.

"ఆ టైమయ్యేసరికి నాకు తెలియకుండానే నా నరాల్లో సంచలనం పుట్టుకొస్తోంది. వళ్ళంతా వణుకుతోంది" అన్నాడు ప్రతాప్.

సుబ్బారావు వాచీ చూసి "నువ్వు చెప్పింది కరెక్టే!" అన్నాడు.

ప్రతాప్ నిజంగా వణుకుతున్నాడు. అతణ్ణి భయం నరనరాలా ఆవహించినట్టుంది.

"దెయ్యం వస్తుందంటావా?" అన్నాడు ముకుందరావు.

"రాకపోతే సంతోషిస్తాను. కానీ వస్తుందేమోనని భయంగా వుంది" అన్నాడు. ప్రతాప్ మాటలో వణుకు స్పష్టంగా తెలుస్తోంది.

"మేమున్నామని రాదేమో?" అన్నాడు సుబ్బారావు.

"ఏదో కారణంగా రాకపోతే చాలు...." అని ఇంకా ఏదో అనబోతూ ఆగిపోయాడు ప్రతాప్. అతడి

కళ్ళు ఒక్కసారిగా పెద్దవయ్యాయి—"అదిగో దెయ్యం వచ్చింది...." అన్నాడు. ఆ తర్వాత అతడిగొంతు పెగల లేదు. మనిషిలో వణుకు ఇంకా పెరిగింది.

ముకుందరావు, సుబ్బారావు అటూ ఇటూ చూసి "ఎక్కడ?" అనడిగారు.

"అదిగో - ఆ కిటికీ దగ్గర" అన్నాడు.

"నాకేం కనిపించడంలేదు" అన్నాడు ముకుందరావు.

"నాకూ కనిపించడంలేదు" అన్నాడు సుబ్బారావు.

"అదిగో అ భయంకరమైన చేతులు చూడండి. చెవులు బద్దలయ్యే ఆ శబ్దాన్ని వినండి" అసహనంగా అరిచాడు ప్రతాప్.

"శబ్దమా?" ఆశ్చర్యంగా అన్నాడు ముకుందరావు. "ప్రశాంతంగా వున్న ఆ గదిలో శబ్దమంటూ వేమిటి?"

"నువ్వేదో భ్రాంతి పడుతున్నావ్ ప్రతాప్!" అన్నాడు సుబ్బారావు.

"దెయ్యం నాకు స్పష్టంగా కనబడుతోంది. అది చేసే శబ్దం కర్ణకఠోరంగా వినబడుతోంది. మీ కేమీ కనబడ లేదు, వినబడలేదు—అంటూంటే ఆ భయం పెరుగు తోంది" అన్నాడు ప్రతాప్.

"కిటికీ దగ్గరకు వెళ్ళి తలుపు తీస్తాను" అన్నాడు సుబ్బారావు.

"వద్దు. మీ ఇద్దరికీ కాక నాకు మాత్రమే కనబడే ఆ దెయ్యం లోపలకు ప్రవేశించి నా మీదెక్కి కూర్చునా్న కూర్చోగలదు" అంటూ అరిచాడు ప్రతాప్. అతడు కిటికీ వైపు చూడడంలేదు.

"అది దెయ్యమే అయితే దాన్ని కిటికీ తలుపులడ్డ గలవా?" అంటూ సుబ్బారావు కిటికీ దగ్గరకు వెళ్ళి

తలుపులు తెరిచాడు. ముకుందరావు కూడా అతన్ని సమీపించి "ఇక్కడేమీ లేదే" అన్నాడు.

"రోజూ ఇంతసేపే వుంటుంది. ఈ రోజు కూడా తన పని కానిచ్చుకుని వెళ్ళిపోయింది. అసలు విషయం నాకీ రోజు తెలిసిపోయింది. అది నా మీద మాత్రమే పగ బట్టింది. అందుకే నా కొక్కడికే కనిపించింది" అన్నాడు ప్రతాప్. మాట్లాడుతూంటే అతడిలో ఆయాసం స్పష్టంగా తెలుస్తోంది.

"నువ్వెవరైనా సైకాలజిస్టును సంప్రదించటం మంచిది. ఏదో భ్రమలో వున్నావని నా అనుమానం. నీ మీద పగవున్న బంధువులెవరైనా ఇటీవల చచ్చిపోయేరా?" అడిగాడు ముకుందరావు.

"నిస్సందేహంగా ఇది దయ్యమేనని తేలింది కదా— రేపు ఇందుకుపాయం ఆలోచించాలి. లక్ష్మీనారాయణను కలుసుకుంటాను. అన్ని వివరాలూ నేను సరిగా చెప్పలేనేమోనని భయంగా వుంది. మీ రిద్దరూ కాస్త నాకు పక్కనుండాలి" అన్నాడు ప్రతాప్.

"తప్పకుండా!" అన్నారిద్దరూ.

# 5

"నువ్వు చెప్పింది నిజమే అయితే అది దెయ్యం అనడంలో సందేహం లేదు" అన్నాడు లక్ష్మీనారాయణ.

లక్ష్మీనారాయణకూ, ప్రతాప్ కూ స్నేహముండడానికి కారణం దైవభక్తే! ఇద్దరూ భజనల దగ్గర కలుసూంటారు. ఎటొచ్చీ లక్ష్మీనారాయణ ఏ దేవుడి గురించి ప్రచారం చేయడు. తను పాపాలు చేస్తున్నాననీ, వాటిని మానడం కష్టమనీ గ్రహించి వాటి పరిహారానికి సులభమైన పద్ధతి దేవుణ్ని భజించడం అని నమ్మినవాడు.

అతడికి అన్నిరకాల గురలవాట్లూ వున్నాయి. దేవుణ్ని మాత్రం ఎన్నడూ కేళన చేయడు.

"ఏం చేయాలో పాలుపోవడంలేదు నాకు!" అన్నాడు ప్రతాప్ దీనంగా.

"మా అమ్మగారు నాకు రెండ్రోజుల క్రితం పోస్టులో కొంత కుంకం పంపించారు. అది పార్వతీదేవికి పూజచేసిన కుంకమట. అది దగ్గరుంటే ఏ దుష్టశక్తులూ పీడించవుట. దగ్గరకు రాలేవుట. ఇలాంటి వాటిమీద నీకు నమ్మక ముందంటే కొంత నీకూ యివ్వగలను" అన్నాడు లక్ష్మీనారాయణ.

"నాకు చాలా నమ్మకం. తప్పకుండా ఇయ్యి" అన్నాడు ప్రతాప్.

"అలాగే యిస్తాను. కానీ ఈ కుంకం నీ దగ్గరున్నప్పుడు నువ్వు చాలా పవిత్రంగా ఉండాలి. ఏమైనా శంకలు తీర్చుకోవలసి వస్తే కుంకాన్ని వేరేవుంచి శంక తీరాక స్నానంచేసి మరీ కుంకాన్ని దగ్గరుంచుకోవాలి. రాత్రి పడుకోబోయేముందు కుంకాన్ని తలగడ క్రింద వుంచుకుని ఎనిమిదిసార్లు ఆంజనేయ నామం స్మరించి నిద్రపోతే ఏ బాధా వుండదు."

"అయితే ఇప్పుడు నేను స్నానం చేయవలసిన అవసరం వుంది. బాత్రూం ఉపయోగించుకోవచ్చా" అన్నాడు ప్రతాప్.

"నిస్సందేహనంగా!" అన్నాడు లక్ష్మీనారాయణ.

ప్రతాప్ లక్ష్మీనారాయణ యింట్లోనే స్నానంచేసి అతడి దగ్గర ఓ ఇస్త్రీ లుంగీ అడిగి కట్టుకున్నాడు. అత డిచ్చిన కుంకాన్ని తీసుకుని తన గదికి వెళ్ళి జాగ్రత్తగా భద్రపరిచాక బట్టలు మార్చుకుని లుంగీ తీసుకుని మళ్ళీ

లక్ష్మీనారాయణ కిచ్చేశాడు.

"కుంకం పని చేస్తుందంటావా?" అనడిగాడు సుబ్బారావు.

"అలాంటి ప్రశ్నలు నా ఎదురుగా వేయవద్దు" అన్నాడు ప్రతాప్.

## 6

"అతడి గదిలో ఇప్పుడు కుంకముంది" అన్నాడు ముకుందరావు.

"అది నేనే ఇచ్చాను" అన్నాడు లక్ష్మీనారాయణ.

"అంటే ఈ రోజుకు దెయ్యం ప్రతాప్‌ని బాధించదు" అన్నాడు సూర్యం.

"నీ అయిడియా ఏమిటో పూర్తిగా చెప్పు" అన్నాడు సుబ్బారావు.

"రోజురోజుకూ ప్రతాప్ నమ్మకం పెరిగిపోతోంది. అది దెయ్యమేనన్న నమ్మకం అతడిలో నానాటికీ పాతుకు పోవాలి" అన్నాడు సూర్యం.

"అందువల్ల ప్రయోజనం?" అన్నాడు ముకుందరావు.

"ప్రతాప్ వ్యవహారం భవనంలో చాలామందికి కాల క్షేపంగా వుంది. అయితే నేనిది కేవలం కాలక్షేపం కోసం చేయడంలేదు. ప్రతాప్ తను ఓ మనిషిని దైవంగా నమ్మి ఆ దైవం గురించి విపరీతంగా ప్రచారం చేస్తున్నాడు. ఆ ప్రత్యక్షదైవం మీద అతడికున్న నమ్మకమూ, ఇతరుల కతడి ప్రచారంమీద వుండే ఆసక్తినీ పోగొడితే- నేను కొంత ప్రజా సేవ చేసినవాడిని అవుతాను. కుంకంకోసం లక్ష్మీనారాయణ దగ్గరకు వచ్చేడంటే- ప్రతాప్‌లో చాలా వరకూ నేను కోరిన మార్పు వస్తోందన్నమాట! కానీ ఇంకా ఈ అణుయుగంలో దెయ్యాల్ని నమ్మేవాళ్ళూ

దాన్ని దేవుడికుంకంతో పారద్రోలవచ్చు ననుకునేవాళ్ళూ వుండడం దురదృష్టం" అన్నాడు సూర్యం.

"ఎవరి నమ్మకాలు వాళ్ళవి. కానీ ఈ నీ ఆట మాకందరకీ నుంచి వినోదాన్నిస్తోంది. అందుకే అంతా నీకు సహకరిస్తున్నాం" అన్నాడు లక్ష్మీనారాయణ.

"ఎదుటిమనిషి బలహీనత నాధారంగా చేసుకొని మనిషి మనిషిని హింసించడం అన్యాయమని ఒకప్పుడనుకునేవాణ్ని. కానీ ఎందుకో ప్రతాప్ మీద అసహ్యమే తప్ప జాలి కలగడంలేదు నాకు" అన్నాడు సూర్యం.

"కానీ నువ్వాడే చెయ్యం ఆట నిజంగానే అద్భుతం. నీ కాళ్ళు ఏ జింకవో అనిపిస్తున్నాయి. క్షణాలమీద మాయం కాగలుతున్నాయి. నువ్వరిచిన అరుపు మానవాతీతమైనదని ప్రతాప్ అంటున్నాడు" అన్నాడు ముకుందరావు.

"అదంతా నమ్మకం కలిగించే భ్రాంతి. నిన్న చప్పుడు వినిపించి కూడా వినిపించలేదనీ, నన్ను చూసి కూడా చూడలేదనీ మీరాడిన నటనమాత్రం అద్భుతం కాదా?" అన్నాడు సూర్యం.

"కానీ మనమిది యిలా ఎంతకాలం కొనసాగిస్తాం?" అన్నాడు సుబ్బారావు.

"ఆరంభమే కానీ అంతం నాకూ తెలియడంలేదు. చూద్దాం. న్యూటన్సు లా ప్రకారం ఏదైనా సరే అలా ఆగకుండా నడిచిపోదు. ఎక్కడో అక్కడ ఆగాలి. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఫ్రిక్షన్ లేనిదెక్కడ?" అన్నాడు సూర్యం.

# 7

"నీ కుంకం మహిమ అద్భుతం" అన్నాడు ప్రతాప్. అతడి ముఖంలో కొత్తకాంతి, కళ్ళలో కొత్త మెరుపు కన బడుతున్నాయి.

లక్ష్మీనారాయణ గదిలో చాలామంది వున్నారు. అందరూ ప్రతాప్‌ని రకరకాల ప్రశ్నలు వేసి జవాబు చెప్పించుకుని ఆనందిస్తున్నారు. తను వారందరి వేళా కోళానికీ గురవుతున్నట్లు ప్రతాప్ గ్రహించలేదు.

"ఇన్నాళ్ళకు నా సమస్యకు పరిష్కారం దొరికింది" అని ఆగి...."అన్నట్లు కొంత కుంకం సుబ్బయ్యకూ కూడా ఇయ్యి. నీ వెయ్యం కథ విని వాడు భయపడుతున్నాడు. కుంకం సంగతి చెప్పగానే వాడికి కలిగిన ఆనందమింతా అంతా కాదు" అన్నాడు ప్రతాప్.

సూర్యం ఫక్కుమని నవ్వాడు. లక్ష్మీనారాయణ కూడా నవ్వాపుకోలేకపోయాడు- "నా దగ్గర ఎంతో కుంకం లేదు. మళ్ళీ మా అమ్మకు రాసి తెప్పించాలి" అన్నాడతను నవ్వుతూనే.

"అన్నట్లు నువ్వు నమ్మే ప్రత్యక్షదైవమెవడో వుండాలి. వాడి పేరేమిటి?" అన్నాడు సూర్యం.

"శివశివా-ఆయన్ను వాడు అనకూడదు" అని చెవులు మూసుకున్నాను ప్రతాప్-"ఆయనకు పేరేమిటి? ఏ దేవుడి పేరైనా ఆయనదే. ఎటొచ్చీ ఈ కలియుగంలో వ్యవహార నామం సదానందస్వామి."

"వాణ్ణెందుకు కోరలేదు నువ్వు రక్షించమని!"

"ఇంత చిన్నవ్యవహారానికి ఆయన జోక్యమా?" అన్నాడు ప్రతాప్ బాధగా.

"అయితే దీన్ని నువ్వు చిన్నవ్యవహారంగా భావిస్తు

న్నావా?" అన్నాడు సూర్యం.

"అవును" అన్నాడు ప్రతాప్ ధైర్యంగా. కుంకం అతడికి చాలా ధైర్యాన్నిచ్చింది.

"కుంకం రాకముందు కూడా ఇలాగే అనుకున్నావా?" అన్నాడు సూర్యం.

"నువ్వు నా స్నేహితుడివి. భక్తి విలువ నీకు తెలియదు. భక్తుడు భగవంతుణ్ణి యాచించాల్సిన అవసరంలేదు. ఆయనే భక్తుడి అవసరం తెలుసుకుని సాయపడతాడు. ఇంత కాలం లేనిది—లక్ష్మీనారాయణకు రెండ్రోజుల క్రితమే వాళ్ళమ్మగారి దగ్గర్నుంచి కుంకం ఎలా అందిందనుకున్నావ్! అది సదానందస్వామి మహిమే! ఆయనే నా కష్టం గమనించి అది ఆ విధంగా నా కందజేశారు" అన్నాడు ప్రతాప్.

"అలాగైతే అసలా అయ్యమే రాకుండా చేయొచ్చుగా" అన్నాడు సూర్యం.

"ఈ సృష్టిలో ఏది అర్థమైందని మనం భగవంతుడి లీలలకు అర్థాలు వెతుకుతాం!" అన్నాడు ప్రతాప్.

"నీ అసాధ్యం కూలా?" అనుకున్నాడు సూర్యం. పైకిమాత్రం "అయితే నీకు కుంకం దొరకడం సదానంద స్వామి మహిమేనంటావ్" అన్నాడు.

"ముమ్మాటికీ అంటాను. అలా అని ఈ విషయం స్వామివారికి ఉత్తరం కూడా రాసిపారేశాను. స్వామి వారి ఆశ్రమంనుంచి వచ్చే పత్రికలో ఈ మహిమ వచ్చే నెల్లో పడవచ్చు కూడా" అన్నాడు.

"అయితే స్వామివారు ప్రచారం చేసుకునే మహిమ లెలాంటివో నాకర్థమైపోయింది. బహుశా మీ అందరికీ కూడా అర్థమవుతుంది" అన్నాడు సూర్యం.

లక్ష్మీనారాయణ తప్ప అక్కడ చేరిన అందరూ నవ్వారు.

"సదానందస్వామి పేరు చెప్పి నవ్వకండి. మీకు అశుభం జరగ్గలదు!" అన్నాడు ప్రతాప్.

"మా అశుభం సంగతలాఉంచు? మళ్ళీ ఈసారెప్పుడైనా దెయ్యం వస్తే వాళ్ళ దగ్గరికీ వీళ్ళ దగ్గరికీ పరుగులెట్టకు. ఆ స్వామి సాయం అడిగిచూడు. అప్పుడు తెలుస్తుంది ఆయన పస!" అన్నాడు సూర్యం.

"మళ్ళీ దెయ్యమెందుకొస్తుంది?" అన్నాడు ప్రతాప్.

"అసలెవరి దగ్గరికీ రాని దెయ్యం నీ దగ్గరికే యెందుకొచ్చింది? అదెందుకో నీ మీద పగబట్టింది. నువ్వు కుంకాలు సంపాదిస్తే దానికి విరుగుడు ఏదో ఒకటి సంపాదించకపోదు" అన్నాడు సూర్యం.

ప్రతాప్ ముఖంలో మళ్ళీ భయం చోటుచేసుకోసాగింది.

# 8

కిటికీ అవతల నిలబడి ఒకసారి తన ముసుగు సవరించుకున్నాడు సూర్యం. నెమ్మదిగా గదిలోకి తొంగిచూశాడు.

ప్రతాప్ గదిలో లైటు వెలుగుతోంది. అతను మంచంమీద పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. కళ్ళు మూసుకుని ఏదో మంత్రం జపిస్తున్నట్లున్నాడు.

సూర్యం నెమ్మదిగా కిటికీమీద చేతివ్రేళ్ళతో తమాషాగా చప్పుడు చేశాడు.

ప్రతాప్ ఉలిక్కిపడి కళ్ళు తెరిచి కిటికీ వంక చూసి దిగ్భ్రాంతుడయ్యాడు.

సూర్యం వికటంగా నవ్వి తమాషాగా చేతులు అద్దం ముందు కదిపాడు.

ప్రతాప్ మంచం దిగి "ఆంజనేయా! ఆంజనేయా" అంటూ అరిచాడు.

సూర్యం మళ్ళీ వికటంగా నవ్వి తలుపులు బాదాడు.

ప్రతాప్ చటుక్కున గోడ దగ్గరకు వెళ్ళి అక్కడ తగిలించి వున్న సదానందస్వామి పటం అందుకున్నాడు. ఆ పటం అందుకోగానే అతడికి వెయ్యి ఏనుగుబలం వచ్చి నట్లుంది. ఆ పటాన్ని కిటికీవైపే చూపిస్తూ "ముందడుగు వేయకు. సదానందస్వామి నిన్ను భస్మం చేసేస్తాడు" అంటూ హెచ్చరికగా అరిచాడు. కానీ అతడి చేతులూ, ఆ చేతిలోని పటమూ కూడా వణుకుతున్నాయి.

సూర్యం ఈ సారి సన్నగా, భయంకరంగా నవ్వాడు.

ప్రతాప్ మళ్ళీ పటం చూపిస్తూ "ముందుకు రాకు. భస్మమైపోతావు" అని హెచ్చరించాడు.

సూర్యం ఈ పర్యాయం మళ్ళీ తలుపులు బాదాడు. బోల్టు సరిగ్గా లేవేమో ఓ తలుపు లోపలకి తెరుచుకుంది. సూర్యం ధైర్యంచేసి తన చేయి కిటికీలోంచి గదిలోకి పెట్టి భయంకరంగా ఊగించాడు.

ప్రతాప్ చేతిలోని పటం జారిపోయింది. "ఈ.... ఊ....వ్వా...." అంటూ భయంకరంగా పెద్దకేక పెట్టి గుమ్మంవైపు పరుగెత్తాడు.

అది చావుకేకలా వుంది తప్పితే మామూలుగా లేదు.

సూర్యం చటుక్కున రెండడుగులు వెనక్కువేసి ముసుగు తీసేసి—చేతికున్న గ్లోవ్స్ ఊడదీసి రెండంగల్లో భవనం ముందువైపు చేరుకుని మరో రెండుక్షణాల్లో లోపలకు వెళ్ళాడు.

సరిగ్గా అప్పటికి అయిదారుగురు ప్రతాప్ చుట్టూ వున్నారు' ప్రతాప్ నోట మాటలేకుండా నేలమీద

పడివున్నాడు. అయితే అతడు మూర్ఛపోలేదు. వెర్రి చూపులు చూస్తున్నాడు.

"ఏం జరిగింది?" అన్నాడు సూర్యం.

"మనిషి బాగా భయపడ్డాడు. ఏం జరిగిందో చెప్ప లేకపోతున్నాడు" అన్నాడు సుబ్బారావు.

ఇంకో పదినిముషాలకు ప్రతాప్ మామూలు మని షయ్యాడు-"ఆ దెయ్యం సామాన్యమైనది కాదు. అది నన్ను చంపేస్తుంది. కుంకానికి లొంగలేదు. సదానంద స్వామి పటంచూసి భయపడలేదు" అన్నాడు.

"ఈ రోజు మళ్ళీ వచ్చిందా?" అన్నాడు లక్ష్మీ నారాయణ.

"రావడమేమిటి? నేను సదానందస్వామి పటం చూపి బెదిరించినా లొంగకుండా గదిలో కూడా ప్రవేశించ బోయింది. ఈ వేళ్టితో నా పని సరేనని అనుకున్నా నసలు. కానీ అదృష్టం బాగుండి బైటపడగలిగాను. అయితే యిలా ఎన్నాళ్ళు?" అన్నాడు ప్రతాప్.

"నన్ను క్షమించు ప్రతాప్" అన్నాడు లక్ష్మీనారా యణ "నా కుంకం కారణంగా నీ గదిలోకి దెయ్యం రాలే దంటే నాకే ఆశ్చర్యం వేసింది. అందుకే ఈ రోజు నీకు తెలీకుండా అది దొంగిలించాను. నువ్వు గమనించావో లేదో—నీ తలగడ క్రింద కుంకం పొట్లం వుండివుండదు."

ప్రతాప్ ఆశ్చర్యంగా "నువ్వు కుంకం తీశావా? అందుకే దెయ్యం రాగలిగిందన్నమాట. కానీ అది సదా నందస్వామి పటానిక్కూడా భయపడలేదు. నీ కుంక మొక్కటే నాకు విముక్తి నిస్తుందనుకుంటాను" అన్నాడు.

"సదానందుడు మనిషి. వాడు దెయ్యాన్నేమి చేయ గలడు? కుంకం సంగతి నాకు తెలియదు" అన్నాడు

సూర్యం.

"ఇప్పుడా చర్చలేమీ వద్దు. ఇతను మనిషి బాగా భయపడ్డాడు. ఇతనికేవరైనా సాయముండాలి" అన్నాడు ముకుందరావు.

"నేనింక ఆ గదిలోకి వెళ్ళను. రాత్రి పన్నెండు కాబోతూంటే చచ్చేటంత భయంవేస్తోంది. ఇంకోసారి ఆ దెయ్యం కనబడితే చచ్చిపోతానేమోనని అనుమానం" అన్నాడు ప్రతాప్.

సూర్యం కాస్త కంగారుపడి "దెయ్యాన్ని చూసి చచ్చిపోవడమేమిటి? ఇంతవరకూ అది నీ మీద ఉరకలేదు గదా! నిన్ను మారాన్నించే భయపెడుతోందిగదా!" అన్నాడు.

"ఏది ఏమైనా నేను పిరికివాణ్ని. దెయ్యం నా మీద ఉరకక్కర్లేదు. ఆఖరికది నాకు కనబడనుకూడా అక్కర్లేదు. కనబడుతుందేమోనన్న ఊహకే ప్రాణం పోయేలా గుంది" అన్నాడు ప్రతాప్.

అతడారోజు యింటికి తాళంవేసి ప్రసాద్ అనే అతడి గదిలో నిద్రపోయాడు.

మిగతా మిత్రులు మాత్రం సూర్యం చుట్టూ చేరి, "ఇంక నీ ఆట ఆపాలి. లేకపోతే ప్రతాప్ నిజంగానే చచ్చిపోవచ్చు" అన్నారు.

"మీకలాంటి అనుమానం వుంటే అతడికి నిజం చెప్పేయండి" అన్నాడు సూర్యం.

"అదికాదు-ఇందాకా అతను గదిలోంచి బైటకు వచ్చినప్పుడు నువ్వు చూడలేను. మనిషి చాలా భయంకరంగా డెక్కుతున్నాడు. అప్పుడే చచ్చిపోతాడని అనుకున్నాం" అన్నాడు ముకుందరావు.

"నేను లోపల్నుంచి చూసినది విన్నారంటే మీకు నవ్వాగదు. సినిమాల్లోలాగ అతను నాకు సదానందుడి పటం చూపించి-ముందుకు రాకు భస్మమైపోతావ్ అంటూ బెదిరించాడు. నాకు నవ్వాపుకోవడం చాలా కష్టమైంది" అన్నాడు సూర్యం.

"పిల్లికి చెలగాటం. ఎలక్కి ప్రాణసంకటం" అంటూనే నవ్వాడు సుబ్బారావు.

# 9

"కుంకంలో నిజంగా మాహాత్మ్యముంది. పడుకునే ముందే జాగ్రత్తగా చూసుకుంటున్నాను. అదుండగా భూతప్రేత పిశాచాలు రాలేవనుకుంటాను. ఏటొచ్చి నా మీద దయుంచి మీలో ఎవ్వరూ కూడా ఆ కుంకాన్ని అపహరించడానికి ప్రయత్నించకండి" అన్నాడు ప్రతాప్. నాలుగురోజులుగా దెయ్యం రాకపోవడంవల్లనేమో అతడి ముఖంలోకి మళ్ళీ కొత్తకాంతి వస్తోంది.

లక్ష్మీనారాయణ దిగులుగా ముఖంపెట్టి "నీకు చెప్పడం మరిచాను. ఆ కుంకం ప్రభావం ఎల్లకాలమూ ఉండదుట. ఓ వారంరోజులకు క్రమంగా దాని శక్తి క్షీణిస్తుందట. దాన్ని శక్తిమంతం చేయడానికి మళ్ళీ పార్వతీదేవి పటం ముందుంచి ఏవో మంత్రాలు చదవాలిట" అన్నాడు.

"ఆ మంత్రాలు నీకు తెలుసా?" ఆత్రుతగా అడిగాడు ప్రతాప్.

"ఈ కుంకం ప్రాముఖ్యత నాకిప్పుడే బాగా తెలిసింది. అది అపహరించగానే నీ గదిలోకి దెయ్యం రావడంలో వెంటనే అమ్మకు త్తరం రాశాను. ఒకటి రెండు రోజుల్లో జవాబు రావచ్చు. మరికాస్త కుంకం పంపమని కూడా

రాశాను" అన్నాను లక్ష్మీనారాయణ.

ప్రతాప్ ముఖం పాలిపోయింది. కుంకం తయారై వారం రోజులేం ఖర్మ! పోస్టులో ప్రయాణం వగైరాలన్నీ లెక్కకడితే అప్పుడే పదిరోజులు దాటివుంటుంది.

ఆ రాత్రి ప్రతాప్ గది కిటికీ దగ్గరకు మళ్ళీ దెయ్యం వచ్చింది. శబ్దం వింటూనే ప్రతాప్ వులిక్కిపడి లేచి దెయ్యాన్ని చూసి ఓ గావుకేక పెట్టి గదిలోంచి బయట పడి స్పృహతప్పి పడిపోయాడు. అతడి కేక విని భవనం లోని చాలామంది జనం పరుగెత్తుకుని వచ్చారు. అతడి పరిస్థితి చూసి కంగారుపడి ఒకడు వెళ్ళి డాక్టర్ని కూడా పిల్చుకువచ్చాడు.

డాక్టర్ ప్రతాప్‌ని పరీక్షించి "ఏదో పెద్ద షాక్ తిన్నాడు. గుండె కూడా బలహీనంగా కొట్టుకుంటోంది" అన్నాడు.

"బాగా ప్రమాదమంటారా?" అనడిగాడు ముకుంద రావు..

"ప్రస్తుతానికి ప్రమాదమేమీ లేదు. కానీ యితడికి షాక్‌లు తట్టుకునే శక్తి ఉన్నట్టులేదు. అనుకోని సంఘ టన ఏదైనా హఠాత్తుగా జరిగితే ఇతడు గుండె ఆగి మర ణించినా ఆశ్చర్యంలేదు" అన్నాడు డాక్టర్.

ప్రతాప్ కథ తెలిసినవారంతా ఎంతగానో భయ పడ్డారు. అందరికంటే ఎక్కువగా కలవరపడ్డవాడు సూర్యం. వేడుకకు ప్రారంభించిన ఆట మనిషి చావుకి దారితీయడం అతడి కిష్టంలేదు. అయినా ప్రతాప్ మరీ యింత బలహీన మనస్కుడని అతడనుకోలేదు. ఇప్పుడు వ్యవహారం చాలా దూరం వచ్చింది. ఏదో ఉపాయం చూసి ఇందులోంచి గట్టెక్కాలి.

డాక్టరు వెళ్ళిపోయాక సూర్యం తన మిత్ర బృందాన్ని సమావేశపరిచి "పరిస్థితి ప్రమాదకరంగా వుంది. ఇంక లాభంలేదు. మీరు నిజం చెప్పేయండి" అన్నాడు.

"అంటే-నువ్వే యివన్నీ చేస్తున్నావని చెప్పేయమంటావా? అందువల్ల నీ కెదురయ్యే ఇబ్బందుల గురించి ఆలోచించావా?" అన్నాడు ముకుందరావు.

"నా కారణంగా ఒక మనిషి ప్రాణాలు కోల్పోయే స్థితికి వచ్చాడు. అతడి ప్రాణాలు రక్షించడంకోసం నాకు చెడ్డ పేరు వచ్చినా బాధపడను నేను" అన్నాడు సూర్యం.

ప్రతాప్ ఆ రాత్రి డాక్టర్ ఇచ్చిన ఇంజక్షన్‌తో సుఖంగా నిద్రపోయాడు. మర్నాడతను నిద్ర లేవగానే సుబ్బారావతన్ని పలకరించి "రాత్రి చాలా హడావుడి చేశావు. బ్రతుకుతావనుకోలేదు" అన్నాడు.

"చచ్చిపోయినా బాగుండేది-దెయ్యం నన్ను రోజు రోజుకీ కాస్తకాస్త చంపుతోంది. అది చాలా నరక యాతనగా వుంది నాకు" అన్నాడు ప్రతాప్.

"అయితే అది దెయ్యమని ఇప్పటికీ నమ్ముతున్నావా?"

"నమ్మాటికీ....అందుకు ఎన్నో రుజువులున్నాయి. అందులో కొన్నిట్లో నువ్వు కూడా సాక్షివి."

సుబ్బారావు నవ్వి "నీకీ పరిస్థితి ఎదురౌతుందని తెలియక మేము చేసినదానికి నువ్వు మమ్మల్నందర్నీ క్షమించాలి. ఇదంతా మేమంతా కలిసి ఆడుతున్న నాటకం. నువ్వు దెయ్యమని భ్రమిస్తున్నది దెయ్యంకాదు. మనిషే!" అన్నాడు.

ప్రతాప్ నమ్మలేనట్లు ముఖంపెట్టి "ఎవరా మనిషి?" అన్నాడు.

"సూర్యం!" అన్నాడు సుబ్బారావు.

"ఇంపాసిబుల్. నేను నమ్మను" అన్నాడు ప్రతాప్-"దెయ్యం కనబడ్డ కొన్నిక్షణాల్లో సూర్యన్ని చూడడం ఎన్నోసార్లు జరిగింది నాకు. అంత తక్కువ వ్యవధిలో అతడలా నాటక మాడగలగడం సాధ్యంకాదు. అదీ కాక నేను విన్న దెయ్యపు కేకలు మనుష్యసంబంధ మైనవి కావు."

"నువ్విలా అంటే నేనేం చెప్పగలను. నేను నిజమే చెబుతున్నాను" అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు ఎంత చెప్పినా నమ్మలేదు ప్రతాప్. ఆ తర్వాత ముకుందరావు, లక్ష్మీనారాయణ....ఒక్కొక్కరే అతడికి ఎన్నో వివరాలిచ్చి నమ్మించడానికి ప్రయత్నించారు. ఒక్కొక్కరే చెబుతూంటే అతడికి క్రమంగా కొంత నమ్మకం కుదిరింది.

"ఇంతమంది చెబుతుంటే నమ్మక ఏం చేయను? కానీ ఇలా జరిగే అవకాశమున్నదా అనిపిస్తోంది నాకు. అందులోనూ సూర్యం అంటే నాకెంతో గౌరవముండి. వన్నత డిలా ఆటపట్టిస్తాడనుకోను" అన్నాడు ప్రతాప్.

"నువ్వు సదానందుడి గురించి ప్రచారం చేస్తున్నావని అతడికి చిరాకు. నీ సదానందుడు నిన్నెంతవరకూ రక్షిస్తాడో చూద్దామనే అతడీపని చేశాడు. కొంతవరకూ అతడికి మేమూ సహకరించాం. ఢంకంతో సహా అన్నీ మేమాడిన నాటకాలే!" అన్నాడు లక్ష్మీనారాయణ.

"నువ్వూ సదానందుడి భక్తుడివే కదా!" అన్నాడు ప్రతాప్.

"ఈ సంఘటనతో నా కళ్ళు తెరుచుకున్నాయి. నే నింక భజనకు రావడం మానేస్తాను" అన్నాడు

లక్ష్మీనారాయణ.

"నా కొక్కటే అనుమానంగా వుంది. నా మీద జాలిపడి మీరంతా నేరాన్ని సూర్యం మీద నెట్టేస్తున్నారా లేక అతడు నిజంగానే దెయ్యంగా నటిస్తున్నాడా? అన్నాడు ప్రతాప్.

"అందుకు నీ కొక్కటే ఋజువు. ఈ రాత్రి కూడా సూర్యం నిన్ను బెదిరించడానికి వస్తాడు. అప్పుడు ధైర్యం చేసి కిటికీ తలుపులు తెరిచిచూడు. అతడి బండారం బైటపడుతుంది" అన్నాడు సుబ్బారావు.

"అలాగే చేస్తాను!" అన్నాడు ప్రతాప్.

## 10

రాత్రి పన్నెండు గంటలయింది.

ప్రతాప్ నరాల్లో సంచలనం ప్రారంభమైంది. వళ్ళంతా వణుకుతోంది. గదిలో లైటు వెలుగుతోంది. అతడు ఒక క్షణం కిటికీవంక చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంటున్నాడు. కిటికీవంక కూడా తిన్నగా చూడలేకపోతున్నాడు. ఎటో చూస్తూ-క్రమంగా దొంగలా తన చూపును కిటికీవైపు మార్చి అటుచూసిన వెంటనే కళ్ళు మూసేసుకుంటున్నాడు.

సరిగ్గా పన్నెండుగంటల అయిదునిముషాలకు అతడు కిటికీవంక చూసి కళ్ళు మూసుకునేలోగా అక్కడ అతనికి దెయ్యం కనబడింది.

తలుపులు బాదిన చప్పుడు. ఒక వికటాట్టహాసం. విచిత్రమైన అరుపు. భయంకరంగా చేతులు కదలిక.... ఒకదాని తర్వాత ఒకటిగా జరిగిపోయాయి.

ప్రతాప్ మంచం దిగి కిటికీవరకూ వెళ్ళాలనుకున్నాడు. కానీ అతడికాళ్ళు సహకరించలేదు. భయంతో అతడి

శరీరం గడ్డకట్టుకుపోయింది.

అక్కడున్నది నిజంగా దెయ్యమా-లేక సూర్యమా?

తను వెళ్ళి కిటికీతలుపులు తీస్తే—దెయ్యం మీదపడితే!

కానీ తను ధైర్యంచేయాలి. ఆ దెయ్యం సూర్యమేనని అంతా అంటున్నారు. ఆ మాటల్లోని నిజం తెలుసుకోవడానికిదే సమయం. ఏమైనా తను లేచి తీరాలి....ఏదో ఒకటి అవుతుంది. ఈ రోజుతో తనేనా అంతం కావాలి. ఈ దెయ్యం కథైనా అంతం కావాలి.

అయితే ఒక అనుమానం ప్రతాప్ని పీడిస్తూనే వుంది. భవనంలో యెవ్వరూ కూడా దెయ్యాన్ని నమ్మడంలేదు. అది తన భ్రమ అని అనుకుంటున్నారు. అందుకే వాళ్ళు సూర్యం గురించి కల్పించి చెప్పారు. కిటికీదగ్గర తనకు కనబడుతున్న దెయ్యం తనకు తప్ప మరెవ్వరికీ కనబడదు. అందుకే తనది భ్రమ అని వారంతా భ్రమపడి సూర్యం కథ కల్పించారు. ఇప్పుడు తను ధైర్యంచేసి ముందడుగు వేస్తే....

దెయ్యం యింకా అక్కడ ఆడుతూనేవుంది.

ప్రతాప్లో భయం పెరిగింది "సూర్యం-వెళ్ళిపో.... సూర్యం.... వెళ్ళిపో!" అనరిచాడతను. అక్కడున్నది సూర్యమేనని తను నమ్మేపక్షంలో తనే కిటికీ సమీపించవచ్చుగదా. ఆ ఆలోచన కూడా రావడంలేదతనికి.

"సూర్యం....ప్లీజ్. నువ్వు వెళ్ళిపో.... నేను చచ్చిపోతాను.... వెళ్ళిపో సూర్యం!" అంటూ అతడు కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

మరుక్షణంలోనే అతడికి తలుపు తట్టిన శబ్దం వినిపించింది "ప్రతాప్ ప్రతాప్!" అంటున్నారెవరో.

ప్రతాప్ కిటికీ వంక చూశాను. అక్కడ దెయ్యం లేదు.

అతడు లేచి వెళ్ళి తలుపులు తీశాడు. ఎదురుగా ముకుంద రావు, సుబ్బారావు, సూర్యం వున్నారు. సూర్యాన్ని చూస్తూనే ప్రతాప్ కెవ్వుమని అరిచాడు.

"ఏం జరిగింది?" అన్నాడు ముకుందరావు.

"మీరిప్పుడెక్కణ్నించి వస్తున్నారు?" అన్నాడు ప్రతాప్.

"నిద్రపట్టక బైట కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం ముగ్గురమూ. నీ గదిలోంచి సూర్యం అని పెద్దగా కేకలు వినబడుతుంటే ఏమిటోనని పరుగెత్తుకు వచ్చాం" అన్నాడు సుబ్బారావు.

"సందేహంలేదు. అది మనిషి కాదు. దెయ్యమే!" అన్నాడు ప్రతాప్.

"అసలేం జరిగింది?" అన్నాడు సూర్యం.

ప్రతాప్ నెమ్మదిగా జరిగింది చెప్పాడు.

"మరి నువ్వు కిటికీదగ్గరకు వచ్చి చూడాల్సింది. అది నేనేనని తెలిసేది!" అన్నాడు సూర్యం.

"ఇంపాసిబుల్! కిటికీదగ్గర అది మాయమైన మరుక్షణంలో నువ్వు నా గదిగుమ్మం దగ్గరున్నావు" అన్నాడు ప్రతాప్.

సూర్యం దిగులుగా ముఖం పెట్టి "నేనేం చేయను? నీ భ్రమను తొలగించడంకోసం నేరం నా మీదనే మోపుకోవాలనుకున్నాను. కానీ అది సాధ్యం కావడం లేదు. నిన్ను దెయ్యంబారి నుండి ఎలా రక్షించేది?" అన్నాడు సూర్యం.

ప్రతాప్ బాధగా సూర్యంవంక చూసి "దేవుడున్నా

డనీ తమ తప్పులు కాస్తాడనీ నమ్మి ఆ స్త్రీకులెన్ని తప్పు లైనా చేస్తారు. మానవత్వాన్ని నమ్మే నాస్తికుడు ఏ తప్పూ చేయడు. చేసినా ఒక్క తప్పుతోనే తన్ను తాను దిద్దుకుంటాడు. సూర్యం-నేను ఆస్తికుణ్ని. దుర్మార్గుణ్ని. నేనెన్నో తప్పులు చేశాను. చేస్తున్నాను. నన్ని దెయ్యం వదలదు. నా కోసం మీరంతా చేసిన సహాయం నన్ను సిగ్గుపడేలా చేస్తోంది. నేను మీ కేమవుతానని మీరంతా నా గురించి ఇంతలా ఆలోచిస్తున్నారు. నాది భ్రమ అను కుని రకరకాల నమ్మకాలతో, అబద్ధాలతో నాకు మన శ్శాంతి కలిగించడానికి యత్నిస్తున్నారు మీరు. కానీ దెయ్యం నన్ను పీడిస్తున్న మాట నిజం! అది భ్రమ కాదు" అన్నాడు.

నవ్వాలో ఏడవాలో తెలియలేదు సూర్యానికి. అతడా రోజున తానెవ్వరో ప్రతాప్‌కి తెలియబర్చాలనే కిటికీ దగ్గరకు వచ్చాడు. ప్రతాప్ ధైర్యం చేసి కిటికీ తలుపులు తెరుస్తాడనీ-అప్పుడు తను ముసుగుతీసి అసలు సంగతి చెప్పేద్దామని అనుకున్నాను. అయితే తన్ను చూసి మంచం కూడా దిగకుండా "సూర్యం-వెళ్ళిపో...." అని అరిచే ప్రతాప్‌ని చూస్తూంటే అతడి ఉద్దేశ్యం మారిపోయింది. రెండు అంగల్లో వెనుకనుంచి ముందుకు వచ్చి ప్రతాప్ ముమ్మందగ్గర నిలబడగల తన శక్తిని మానవాతీతశక్తిగా భావించే ప్రతాప్‌కు తను నిజం ఎందుకు చెప్పాలి? అతని భ్రమను భ్రమగానే ఉండనిస్తే కలిగే నష్టం ఏముంది?

మరోసారి ఇలాంటి షాక్ తగిలితే ప్రతాప్ చచ్చి పోతాడని డాక్టర్ అన్నాడు. అలాగని ప్రతాప్‌కు షాక్ తగలకుండా చూడడం ఎలా?

తను సూర్యమో, దెయ్యమో తెలుసుకోలేని పరిస్థితిలో అతడీపూట దెయ్యం వచ్చినప్పుడు కాస్త ధైర్యంగానే వ్యవహరించాడు. ఇలాగే వ్యవహరించగలిగితే ఇకముందు అతడికే ప్రమాదమూ వుండదు.

"మిస్టర్ ప్రతాప్! నువ్వు చెప్పేదాన్నిబట్టిచూస్తూంటే ఆ దెయ్యం నీ భ్రమకాక నిజంగానే ఉన్నట్లయితే దాని వుద్దేశ్యం నిన్ను భయపెట్టడమే కానీ-చంపడం కాదు. నువ్వు భయపడకపోతే అది నిన్నేమీ చేయదు. నువ్వు ధైర్యంగా వుండు. అసలు కిటికీవైపు చూడకు. ధైర్యం చిక్కపట్టుకుని ఏం జరుగుతుందో చూస్తూండు" అన్నాడు సూర్యం.

"ఇలాంటివి ఒకరికి సలహా ఇవ్వడం సులభం. స్వానుభవంలోకి వస్తే తట్టుకోవడం కష్టం" అన్నాడు ముకుందరావు.

"నువ్వు చెప్పింది నిజమే. కానీ ఈ దెయ్యం బాధ తప్పించుకోవడానికి మొండిధైర్యం తెచ్చుకోవడం మినహా మరో ఉపాయం కనబడడంలేదు. కానీ నేను మొండి ధైర్యం ఎలా తెచ్చుకోగలను? మీరంతా కలిసి అది దెయ్యం కాదనీ-సూర్యమేననీ చెప్పినా కిటికీవరకూ వెళ్ళలేకపోయాన్నేను. రాత్రి పన్నెండయ్యేసరికి నా శరీరంలో వింతమార్పులు వస్తున్నాయి. నా శరీరం నా అదుపులో ఉండడంలేదు. ఏం చేయడానికీ అశక్తుణ్ణవుతున్నాను. ఇది నా మానసిక బలహీనతో—దెయ్యం ప్రభావమో తెలియడంలేదు" అన్నాడు ప్రతాప్.

అతని మాట విని భారంగా నిట్టూర్చాడు సూర్యం.

# 11

ప్రతాప్ మంచంమీద పద్మాసనం వేసుకుని ఆంజనేయ స్తోత్రం చేస్తున్నాడు. ఆ సమయంలో గదిలో ఒక్క-సారిగా అలారం మ్రోగింది. ప్రతాప్ ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

టైము సరిగ్గా పన్నెండయింది.

ప్రతాప్ కావాలనే అలారం పెట్టుకున్నాడు. ఆ రాత్రి దెయ్యాన్ని చూడాలన్న దృఢసంకల్పం అతనికి కలిగింది. తనేమైపోయినా సరే దెయ్యాన్ని చూడాలని అతడనుకున్నాడు.

అయితే.... టైము పన్నెండు కాగానే మళ్ళీ అతడి శరీరంలో సంచలనం ప్రారంభమైంది. అప్రయత్నంగా ఒకసారి కిటికీవైపు చూశాడు. అక్కడ ఏమీ కనబడక పోయినా అప్రయత్నంగానే కళ్ళు మూసుకున్నాడు.

అతని పెదాలు ఆంజనేయస్తోత్రాన్ని జపిస్తూనే వున్నాయి. అతడికళ్ళు అప్పుడప్పుడు కిటికీవైపు చూసి మూసుకుంటూనే వున్నాయి. శరీరం మాత్రం అంత కంతకూ బిగుసుకుపోతోంది. మంచం దిగాలన్న అతని కోరికకు అది సహకరించడంలేదు.

ఉన్నట్టుండి కిటికీ వెనుక ఏదో ఆకారం కదలినట్లయింది. ప్రతాప్ కళ్ళు పెద్దవయ్యాయి. ఇప్పుడతని పెదవులు కూడా మంత్రోచ్చారణ ఆపేశాయి. కనుగ్రుడ్లు, కంటి రెప్పలు తప్ప అతని శరీరంలో మరేమీ కదలడంలేదు.

కిటికీ వేనుక ఏదో ఆకారమున్నట్టే ఉంది కానీ అదాట్టే కదులుతున్నట్టులేదు.

అది దెయ్యమా-లేక సూర్యమా?

ప్రతాప్ క్రమంగా ధైర్యం తెచ్చుకుని కిటికీవంక నే

చూశాడు. అక్కడ ఏదో నీడలాంటిది వుంది. కానీ ఆ నీడ కదలడంలేదు.

కాసేపటికి ప్రతాప్‌లో ధైర్యం పెరిగింది. అతను మంచం దిగాడు. జై ఆంజనేయా అని ఓ కేక పెట్టాడు. అతనిలో ధైర్యం ఇంకా పెరగాలనడానికి సాక్ష్యంగా ఆ కేక వణుకుతూనే వుంది.

ప్రతాప్ కిటికీని సమీపించాడు. నెమ్మదిగా తలుపు లాగాడు. అంతే!

ఓ నల్లటి ఆకారం అతడిమీదకు దూకింది.

కెవ్వుమని అరిచాడు ప్రతాప్! అది గావుకేకకాదు. చావుకేక. చావుకేకలు పెట్టడం ప్రతాప్‌కి మామూలై పోయిందేమో అలా కేక పెట్టినా అతను చావలేదు.

ఎందుకంటే తనమీద దూకిన నల్లటి ఆకారం దెయ్యం కాదు, సూర్యం కాదు ఒక పిల్లి!

ఆ నల్లపిల్లి ఆ కిటికీలోకి ఎలా వచ్చింది? ఎవరైనా కావాలని అక్కడుంచారా? లేక కాకతాళీయంగా అదక్కడ వుందా?

తనకు తెలిసినంతవరకూ ఈ భవనంలో పిల్లి—అందులోనూ నల్లపిల్లి తిరగడంలేదు. ఎవరో కావాలనే అక్కడుంచారు. అదెవరు—సూర్యమా?

ప్రతాప్ గుండెలు యింకా అదురుతూనే వున్నాయి. అతడు గుండెలు చిక్కబట్టుకునే ప్రయత్నం చేస్తున్నాడు కానీ కిటికీ అవతలకు తొంగిచూసే ధైర్యం అతడికి కలగ లేదు. పిల్లిని గదిలోంచి బైటకు వదిలేసి కళ్ళు మూసుకుని మళ్ళీ కిటికీ తలుపు మూశాడు.

ఇప్పుడేం చేయాలి? నిద్రపోవాలా - మరికాసేపు దెయ్యం కోసం ఎదురు చూడాలా?

అతను మరోసారి టైము చూసుకున్నాడు. టైము. ఇంకా పన్నెండున్నర కాలేదు. పన్నెండున్నర లోపులో ఎప్పుడైనా రావచ్చు దెయ్యం!

ప్రతాప్ మళ్ళీ మంచమెక్కి పద్మాసనం వేసుకుని ఆంజనేయస్తోత్రం ఆరంభించాడు. అప్పుడప్పుడు అతని దృష్టి కిటికీమీద నే పడుతోంది.

టైము పన్నెండూ ఇరవై అయిదు కాగానే ఏదో శబ్దం అయింది.

ప్రతాప్ కిటికీవంక చూశాడు. అక్కడ ఏదో దృశ్యం గోచరిస్తుందన్న భయం అతడికుంది కానీ అక్కడ, ఏమీ లేదు. శబ్దంకూడా కిటికీవద్ద అవడంలేదు. ఎవరో తలుపు తడుతున్నారని గ్రహించాడతను.

"ఎవరు?" అన్నాడతను.

సమాధానం రాలేదు. చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దంలో మరోసారి తలుపుతట్టిన చప్పుడైంది.

"ఎవరు—మాట్లాడరేం?" అరిచాడు ప్రతాప్.

జవాబులేదు. కానీ ఒక్కక్షణం ఆగి తలుపు మళ్ళీ చప్పుడైంది.

ప్రతాప్‌లో మళ్ళీ భయం చోటుచేసుకుంటోంది. ఆ తలుపు తడుతున్నది ఎవరు? పిలిస్తే పలకరేం? ఈ రోజు కిటికీతలుపు తెరిచి ధైర్యంగా చూడాలనుకుంటే దెయ్యం గుమ్మం దగ్గరకే వచ్చిందా? అది దెయ్యమా లేక సూర్యమా?

అతనిప్పుడేం చేయాలి? వెళ్ళి తలుపు తీయాలా-లేక ఊరుకోవాలా?

తలుపు మళ్ళీ చప్పుడైంది.

"ఎవరు?" అన్నాడు ప్రతాప్. తలుపు మళ్ళీ బాదిన

చప్పుడైంది.

ఏమైతే అయిందని ప్రతాప్ మంచం దిగాడు. వణుకు తున్న కాళ్ళతో అడుగులు వేస్తూ వణుకుతున్న చేతులతో తలుపులు తీశాడు.

అక్కడ....ఎదురుగా....ఓ యువతి....!

ఆమె తెల్లచీర కట్టుకుంది. తెల్లరవిక తొడుక్కుంది. జుట్టు విరబోసివుంది. పసిమిఛాయలో మెరుస్తున్న ఆమె ముఖం అస్పష్టంగా కనబడుతోంది.

ఎవర్నువ్వు? అనాలని ప్రయత్నించాడు ప్రతాప్. నోట మాటరాలేదు.

ఆమె లోపల అడుగు పెట్టింది. ఆమె నడుస్తూంటే చప్పుడు కావడంలేదు.

అప్రయత్నంగా ప్రతాప్ ఆమె పాదాలవంక చూశాడు. చీర పాదాలను కప్పేసింది. అవి అతనికి కన్పించడంలేదు.

"ను....ను....నువ్వు....ఎ....ఎ....ఎ....ఎవ .... ఎవరివి!" అన్నాడు ప్రతాప్ వణుకుతూ.

"నన్ను గుర్తించలేదా ప్రియా?" అందామె....ముఖం మీద జుట్టు వెనక్కితోసుకుంటూ....

వెంటనే ప్రతాప్‌కు సుజాత గుర్తొచ్చింది—

• • •

"ఇంకా ఈ ముసుగులో గుద్దులాట ఎన్నాళ్ళు ప్రియా!" అంది సుజాత.

సుజాత కౌగిలిని వదల్లేదు! ప్రతాప్ "జరిగినన్నాళ్ళనూ" అన్నాడు.

"నీకేం నువ్వు మగాడివి. నేను ఆడదాన్ని" అంది సుజాత.

"ప్రేయసీప్రియుల్లో స్త్రీ పురుష భేదాలుండవు. ఇద్దరం ఒక్కటే!" అన్నాడు ప్రతాప్.

"ప్రేయసీప్రియులుగా ఇప్పుడొక్కటయ్యాము. ఇది మన ఆనందం కోసం. కానీ ఈ ఆనందాన్ని సమాజం మెచ్చదు. సమాజం మెచ్చడంకోసం మనం భార్యాభర్తలుగా కూడా ఒకటవ్వాలి. అలాగ జరిగేవరకూ ఆడది ఆడదే—మగాడు మగాడే!" అంది సుజాత.

సుజాత చాలా తెలివిగా మాట్లాడుతుంది. వయసు మైకంలో ఆమె తెలివితక్కువదై ప్రతాప్‌కి లొంగి పోయింది కానీ—పెళ్ళయ్యాక మళ్ళీ పూర్వపు తెలివి తేటలు పొందగల్గుతుంది. తెలివైన ఆడదాన్ని భార్యగా తెచ్చుకోవద్దన్నది ప్రతాప్ తండ్రి హెచ్చరిక. అదీకాక ప్రతాప్ తండ్రి తలమునిగే అప్పుల్లో వున్నాడు. కొంత కాలంపాటు కొడుకు సంపాదించి తన అప్పులన్నీ తీరిస్తే అప్పులన్నీ తీర్చాలని అతడి ఉద్దేశ్యం. అప్పులు తీరేదాకా పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యం అతడికీలేదు. వయసు వేడిలో సుజాతమీదకు వల విసిరాడు. పడింది. ఆమెను భార్యగా చేసుకుంటే కానీ కట్నం రాదు.

"నువ్వన్నది నిజమే-కానీ నా ఆర్థికపరిస్థితి బాగోలేదు. నువ్వా కట్నమివ్వలేవు. మనం కొంతకాలం వేచివుండక తప్పదు" అన్నాడు ప్రతాప్.

"మనమెలాగూ సంసారం చేస్తూనే వున్నాము. ఏ రిజిష్ట్రాఫీసులోనో పేరుకి పెళ్ళి అయిందనిపిస్తే నష్టమేముంది? నువ్వు కావాలన్నప్పుడే నీ దగ్గరకు కాపరాని కొస్తాను" అంది సుజాత.

"నువ్వన్నదీ బాగానేవుంది. ఆలోచిస్తాను" అన్నాడు ప్రతాప్. అయితే అతడికి సుజాత మాటలు నచ్చలేదు.

ఆమె నెలాగో అలా వదిలించుకోవాలని చూస్తున్నాడతను.

ఓ రెండ్రోజులాగి రిజిస్ట్రాఫీసులో పెళ్ళి అన్న పేరు చెప్పి ఎవరికీ తెలీకుండా ఆమెను ఆ ఊర్నించి ప్రయాణం కట్టించాడు. అతణ్ని నమ్మి ఆమె తలిదండ్రులక్కూడా తెలీకుండా అతనితో బయల్దేరింది.

హైదరాబాదులో ఓ రెండ్రోజులామెతో గడిపి ఆమెనతను ఓ లోఫర్ గాడికి అమ్మేశాడు.

అయితే సుజాత ఆ లోఫర్ గాడికి అందలేదు. ఆమె ఆత్మహత్య చేసుకుంది. ఆ విషయం లోఫర్ గాడు ప్రతాప్ కి చెప్పి, తన డబ్బు వాపస్ ఇమ్మని అడిగాడు. నమ్మకం కోసం ప్రతాప్ వాడితో వెళ్ళి ఆమె శవాన్ని కూడా చూసి వచ్చాడు. తర్వాతనే వాడికి డబ్బు ఇచ్చాడు.

## 12

ఈ యువతి సుజాత....అదే కళ్ళు....అదే రూపు....

కానీ తనకు తెలిసిన సుజాత చనిపోయింది....అదీ తన కారణంగానే....

ఇప్పుడు ఎదురుగా సుజాత నిలబడివుంది. ఈ సుజాత తెల్లచీర కట్టుకుంది. తెల్లరవిక వేసుకుంది. చప్పుడు చేయకుండా నడుస్తోంది. జుట్టు విరబోసుకుంది. కళ్ళలో అదో రకమైన మానవాతీతమైన చూపు....ముఖంలో ఏదో తేజస్సు....

అంటే ఇన్నాళ్ళూ....తనను బెదిరిస్తున్న దెయ్యం సూర్యంకాదు....సుజాత....

ప్రతాప్ సుజాతను పరీక్షించి చూశాడు. ఆమె నోట్లోంచి కోరలుబుకుతున్నట్లూ, నెత్తికి కొమ్ములు మొలుస్తున్నట్లూ—నాలిక ముందుకు చాచుతున్నట్లూ

అతడికి తోచింది.

కెవ్వుమని భయంకరంగా అరిచి క్రింద పడిపోయా డతను.

ఇది తప్పకుండా చావుకేకే! ఈ కేక అనంతరం మనిషి బ్రతికే అవకాశం తక్కువ.

కేకవిని....గదిలోకి....కొందరు మనుషులు వచ్చారు. క్రింద పడివున్న ప్రతాప్‌నీ అతడికెదురుగా వున్న ఓ తెల్లచీర అమ్మాయినీ విచిత్రంగా చూశారు.

"ఏం జరిగింది?" అన్నాడు ముకుందరావు.

"ఈ గదిలో వుంటున్న ప్రతాప్ ఒకప్పుడు నన్ను పెళ్ళాడతానని మోసంచేసి ఓ లోఫర్ గాడికి అమ్మేశాడు. ఆ లోఫర్ గాడిని నేను తీవ్రంగా ఎదిరించాను. మాన సంరక్షణకోసం నేను జరిపిన పోరాటం ఆ లోఫర్ గాడి మనసుని కదిలించగా-వాడు నా పాదాలంటి దణ్ణంపెట్టి నన్ను వదిలిపెట్టాడు. నేను చచ్చానన్న భ్రమ కూడా ప్రతాప్‌కి కలిగించాను. చాలా కాలానికి ప్రతాప్ ఇక్క డుంటున్నట్లు తెలిసి చూద్దామని వచ్చాను. నన్ను చూస్తూనే అతను పెద్దకేకపెట్టి స్పృహతప్పి పడి పోయాడు. ఏం జరిగిందో తెలియదు" అంది సుజాత.

"తప్పు చేసినవాడే దెయ్యానికి భయపడతాడంటారు. అంతరాంతరాల్లో తను చేసిన తప్పు వేధించడంవల్లనే ప్రతాప్ దెయ్యానికి అంతగా భయపడ్డాడన్నమాట!" అన్నాడు సూర్యం.

లక్ష్మీనారాయణ నాలుగడుగులు ముందుకువేసి ప్రతాప్‌ని కదపబోయి ఏదో అనుమానం వచ్చి నాడి చూశాడు. నాడి ఆడుతున్నట్లులేదు. ముక్కువద్ద వ్రేలుంచి చూశాడు. శ్వాస ఆడుతున్నట్లులేదు. అప్పుడే అతను

# 44

ప్రతాప్ ని చూసి పెద్దకేక పెట్టాడు.

ప్రతాప్ రెండుకళ్ళూ తెరిచివున్నాయి. ఆశ్చర్యం వాటిలో ప్రతిబింబమవుతోంది. ఆ కంటికి రెప్పలు పడడంలేదు.

"ప్రతాప్ చచ్చిపోయాడు" ఎవరో అరిచారు.

సుజాత నిర్లిప్తంగా—"అయితే పోలీసుల్ని పిలవండి. జరిగిందేమిటో చెప్పి వెళ్ళాల్సిన బాధ్యత నాపైన వుంది" అంది. తర్వాత ఆమె సూర్యం వంక చూసి "మిస్టర్ సూర్యం! ఐ థాంక్యూ వెరీ మచ్ ఫర్ యువర్ హెల్ప్ ఇన్ ది షాక్ ట్రీట్ మెంట్" అంది.

—: ఐపోయింది :—

# నాగరాణి

**వాణిశ్రీ**

సాయంకాలం ఆరుగంటలకి ఇంటికి వెళ్ళి స్నానంచేసి టాయ్‌లెట్ అయిన తర్వాత కాస్మోపాలిటన్ క్లబ్‌కి వెళ్ళడం జగపతిరావు కొన్ని సంవత్సరాల నుంచి మెయింటెన్ చేస్తున్నాడు.

అందుకే సరిగ్గా ఆరయ్యేసరికి పోర్టికోలో కారు రెడీ చేస్తాడు డ్రైవర్.

బజ్జర్ నొక్కే సమయానికి డోర్ తియ్యడానికి సిద్ధంగా వుంటాడు జవాను.

లక్ష్మి ఇంజనీరింగ్ కంపెనీ యజమాని జగపతిరావు డిసిప్లిన్‌గా వుంటాడని మంచి పేరు తెచ్చుకున్నాడు. మంచిగాని చెడుగాని సిన్సియర్‌గా చేస్తాడని అతని సర్కిల్లో గొప్పగా చెప్పుకుంటారు.

ఇంతకీ అతను అరవైఏళ్ళ యువకుడు కానేకాదు, ముప్పైఏళ్ళ కుర్రాడే.

ఆ రోజు—

జగపతిరావు కుర్చీలోంచి లేవాలనుకునే సమయానికి టెలిఫోన్ రింగైంది.

రిసీవర్ ఎత్తి "జగపతిరావ్ స్పీకింగ్" అన్నాడు.

"గుడీవినింగ్ డియర్ రావ్!" తియ్యటి కంఠం విని పించి ఆశ్చర్యపోయాడు.

అతన్ని డియర్ రావ్ అని పిలిచేవాళ్ళు ఆ వూళ్ళో ఎవరూ లేరు. అతని భార్య అతనికి ఎప్పుడూ ఫోన్ చెయ్యదు. చేసినా "ఏవండీ" అనే అంటుంది.

"ఎవరో జ్ఞాపకం రాలేదా డియర్ రావ్?" నవ్వు వినపించింది గజ్జలు ఘల్లు ఘల్లుమన్నట్లు.

అతను మతిపోయినవాడిలా వుండిపోయాడు.

'ఆ గొంతు అతనికి చిరపరచితమైనదే.'

"నువ్వు....నువ్వు...."

"నేనే నీ డార్లింగ్ రూపని" మళ్ళీ నవ్వు.

జగపతిరావు ముఖం వెయ్యికాండిల్ బల్బులా వెలిగి పోయింది రూప పేరు విని.

"రూపా! నువ్వా ఎన్నాళ్ళికి...."

"నువ్వు నన్ను మర్చిపోయినా నేను నిన్ను మర్చి పోలేదు రావ్!" గోముగా అంటోంది రూప.

"ఇంతకీ ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నావ్?"

"కైలాసపురం నుంచి."

"అక్కడేందుకున్నావ్?"

"అదేం ప్రశ్న? కైలాసపురం ఎవరైనా ఎందుకు వెళ్తారు? దేవుడి దయకోసం. నేనూ అందుకే వచ్చాను."

"మీ వారితో వచ్చావా?"

"నో....ఆయనతో వస్తే నీ కెందుకు ఫోన్ చేస్తాను. ఆ మాత్రం తెలుసుకోలేవా?"

"ఎస్ .... ఐ నో ...."

"చాలా ముఖ్యమైన పనిమీద వచ్చాను. నీతో సీక్రెట్ గా మాట్లాడాలి. ఎంత సీక్రెట్ అంటే చచ్చేంత సీక్రెట్."

"సీక్రెటా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"యస్. సీక్రెట్ బిజినెస్."

"బిజినెస్సా!"

"అదంతా పర్సనల్ గా మాట్లాడుకుందాం. రాత్రి ఎనిమిదింటికి ఇక్కడకిరా. నేను కొండమీద స్పెషల్ కాటేజీ నెం. 14 లో వున్నాను. అయితే భోజనం చేసి రాకు. అంతా ఇక్కడే ఏర్పాటు చేస్తున్నాను. ఈ రాత్రికి ఇక్కడే వుండిపోయాలి. ఎన్నాళ్ళయిందో నీతో గడిపి...." తియ్యగా మత్తుగా అంటోంది రూప.

జగపతిరావు గుండె లయతప్పతోంది రూప మాటలు వింటూ వుంటే.

"మా ఆవిడకు ఏదో చెప్పిరా! ఏమంటావు మాట్లాడవేం డియర్!"

"ఏం మాట్లాడను డార్లింగ్. నాకు ఆనందంతో మాటలు రావడంలేదు."

నవ్వు వినిపించింది గలగలా.

"ఓ.కే...."?

"ఓ.కే...."

అవతల ఫోన్ పెట్టేసినట్లు క్లిక్ మంది. జగపతిరావు రిసీవర్ క్రెడిల్ చేసి ఈజీగా కూర్చున్నాడు ఛైర్ లో.

అతనికి సంతోషంతో శరీరం తేలికైపోయి గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది.

రూప ...ఎంత తియ్యగా వుంటుందో ఆ పేరు. ఐదేళ్ళ

క్రితం రూపతో అనుభవాలు కోకొల్లలు. మధురంగా క్షణాల్లా గడిచిపోయాయి రోజులు.

అసలు రూప తనభార్య కావలసింది.

డాడీకి ఇష్టంలేకపోయింది. అంతస్తులు అడ్డొచ్చాయి పెళ్ళికి. తను నిస్సహాయ స్థితిలో రూపను వదిలేయాల్సి వచ్చింది.

'హెల్ప్‌లెస్ కండిషన్' గొణుక్కున్నాడు.

తర్వాత తనంటే మండిపడేది రూప. మోసగాడివని తిట్టేది. తన ముఖం చూడ్డేదు మళ్ళీ.

తను ఎంత తపించిపోయాడు రూపతో అనుభవం కోసం. కాని ఏం లాభం తనను రానివ్వలేదు దగ్గరికి.

ఇన్నాళ్టికి క్షమించింది తనను.

'బహుశా ఆమెకు భర్తతో సుఖం లేదేమో?' ఆ ఆలోచన రాగానే జగపతిరావుకి హుషారెక్కింది.

తనవంటి పర్సనాల్టీగల మగాళ్ళు చాలా అరుదు. సినిమాల్లో జేరితే హీరోవేషాలు వేసేవాడు. అందుకూ ఒప్పుకోలేదు డాడీ. పూర్ డాడీ.

'ముఖానికి రంగుకొట్టుకుని తైతెక్కలాడే కర్మ మనకేం పట్టిందిరా?' అనేవాడు.

అందులో యెంత గ్లామర్ వుందో డాడీకి యేం తెలుసు.

నవ్వుకున్నాడు జగపతిరావు.

తండ్రి పోయాడు. తను సర్వస్వతంత్రుడయ్యాడు. కాని సినిమా వేషాలమీద దృష్టిపోలేదు. ఎందుకొచ్చిన రిస్క్. బిజినెస్‌లోనే హాయిగా వుంటుంది అనుకున్నాడు.

జగపతిరావు బజ్జర్ నొక్కాడు.

జవాన్ తలుపు నెట్టుకుని వచ్చి చేతులు కట్టుకుని

ఆజ్ఞ అన్నట్లు నిల్చున్నాడు.

"కారు రెడీచెయ్యమను" అన్నాడు.

## 2

కైలాసపురం అక్కడికి నాలుగుమైళ్ళ దూరంలోవుంది. పురాణకాలం నుంచీ గొప్ప పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధికెక్కింది. కొండమీద శివాలయానికి బస్సులు వెళ్ళడానికి ఘాట్‌రోడ్డు వుంది. వచ్చేపోయే జనంతో ఎంతో సందడిగా, కోలాహలంగా వుంటుంది కైలాసపురం.

జగపతిరావు హుషారుగా కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళాడు. ఎన్నో ఏళ్ళ తర్వాత తన పాత ప్రేయసిని కలుసుకోబోతున్నాననే సంతోషంతో వుప్పొంగిపోయింది మనస్సు.

అరగంటలో కొండపైకి వెళ్ళిపోయాడు.

కాటేజీ నెం. 11 ముందు కారు ఆపాడు. దూరం దూరంగా అందంగా వున్నాయి కాటేజీలు.

కారుహారన్ శబ్దం విని కాటేజీ తలుపులు తెరుచుకున్నాయి.

లోపల తెల్లటి ట్యూబ్‌లైట్ వెలుగులో నిల్చున్న రూపను చూసి క్షణంపాటు కళ్ళు పెద్దవిచేశాడు జగపతిరావు.

'ఎంత మారిపోయింది?' అనుకున్నాడు ఆశ్చర్యంగా.

ఆ రోజుల్లో చీరలు కట్టుకుని మల్లెపువ్వులా తాజాగా పరిమళిస్తూ వుండేది.

ఇప్పుడో! లుంగీకట్టుకుని అర్ధనగ్నంగా మోడరేట్‌గా క్లబ్‌డాన్సర్‌ని మరిపిస్తోంది.

బాబ్‌డ్ హెయిర్‌లో రూపని చూసి అతని కళ్ళు చెది

రాయి. అప్పటికన్నా బాగా వళ్ళు చేసింది. శరీరంలోని వంపుసొంపులన్నీ స్పష్టంగా కనిపించేటట్టు డ్రెస్ చేసుకుంది.

రూప అంత సెక్సీగా వుంటుందని కలలోగూడా వూహించలేదు అతను.

"కమాన్! ఏమిటలా నిలబడిపోయావు?" అంది ఆమె.

జగపతిరావు తేరుకున్నాడు.

"ఏంలేదు. నీలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపోతున్నాను" అన్నాడు లోపలకు వస్తూ.

"మార్పు మానవసహజం...." నవ్వింది.

జగపతిరావు లోపలకు రాగానే తలుపులు మూసి గడియవేసింది.

అమాంతం అతన్ని కౌగిలిలో బంధించివేసింది. ఉక్కిరి బిక్కిరి చేస్తూ అతని ముఖాన్ని ముద్దులతో నింపివేసింది.

"డియర్ రావ్! నిన్ను వదిలి ఇంతకాలం యెలా వున్నానో నాకే అర్ధంకావటంలేదు" గోముగా అంది.

జగపతిరావుకి స్వర్గంలో తేలిపోతున్నట్లుగా వుంది ఆమె వెచ్చని కౌగిలి.

"నేనూ అంతే డార్లింగ్. అప్పుడు పిరికివాడిలా నిన్ను దక్కించుకోలేకపోయాను" అన్నాడు విచారం వ్యక్త పరుస్తూ.

"ఆ రోజులు గుర్తుచేయకు డియర్. అదంతా ఒక పీడకల. గతంలేదు మనకి. భవిష్యత్తు మాత్రమే. యవ్వనం ఎంతోకాలం వుండదు. అందువే వీలైనంత జుర్రుకుందాం" అంది.

జగపతిరావు గాలిలో తేలిపోయాడు.

మొగలి సెంట్ సువాసన గదంతా నిండిపోయి కొత్త ప్రపంచాన్ని సృష్టిస్తోంది. రూప వుపయోగించిన ఖరీదైన కాస్మటిక్ పరిమళాలు అతనికి మత్తు కలిగిస్తున్నాయి.

ఆమెకు ఏదో గుర్తుకొచ్చినట్లుగా అతని చేతుల్ని తన నడుము నుంచి తప్పించి "పద భోజనం చేద్దాం" అంది.

అతను తేరుకుని బాత్‌రూమ్‌లో ముఖం సబ్బుతో కడుక్కున్నాను. పౌడర్ రాసుకుని డైనింగ్ టేబిల్ ముందు కూర్చున్నాడు.

రూప రెండుగ్లాసులు విస్కీతో వాటర్‌తో నింపింది.

ప్లేట్లలో జీడిపప్పు, నాన్-వెజిటేరియన్ డిషెష్ చూసి అతని కళ్ళు తిరిగాయి.

రూప అతనికి ఒక గ్లాసు అందించింది.

తనొక గ్లాసు తీసుకుంది.

"ఛీర్స్...." అంది గ్లాసుకు తగిలిస్తూ.

అతనికి గుండె దడపుట్టింది రూప చేష్టలకు.

"ఏమిటి? నువ్వు త్రాగడం నేర్చుకున్నావా?" అడిగాడు.

"ఆఁ....ఏం తప్పా? మగాడిబుద్ధి పోనిచ్చుకున్నావు గాదు" అంది నవ్వుతూ.

"నో....నో....డార్లింగ్ ఆడవాళ్ళు త్రాగకూడదని కాదు" అన్నాడు తత్తరపడిపోతూ.

"నేను అందరిలాంటి ఆడదాన్ని కాదు. ఆ సంగతి నువ్వే గ్రహిస్తావు డియర్" అంది.

ఒక గంటసేపు కబుర్లు చెప్పుకున్నారు.

భోజనం పూర్తయిన తర్వాత బెడ్ మీద చేరుకున్నాడు రావ్.

అతనికి ఎంతో ఆత్రంగా వుంది రూప పొందుకోసం.

సెక్స్ ఆకలి కడుపులో వెర్రితలలు వేస్తోంది.

రూప నైట్ గౌన్‌లో మెరిసిపోతున్న అందంతో దంతశిల్పంలా కన్పించింది.

ఆమె చేతిలో ఒక డైమండ్ నెక్లెస్ వుంది.

"చూడు ఈ నెక్లెస్ ఖరీదు ఎంతో చెప్పు?" అంది అతని మీదకు విసురుతూ.

అతని కళ్ళు మిరుమిట్లు గొల్పాయి దాన్ని చూడగానే.

"ఎక్కడిది ఇది?" అన్నాడు నివ్వెరపోయి.

"దొంగతనం చేశాను" తాపీగా అంది.

కరెంట్ షాక్ తిన్నట్లుగా అదిరిపడ్డాడు. మత్తు దిగిపోయినట్లయింది.

"వాడ్డూయూ మీన్?" అన్నాడు.

"కంగారుపడకు మిష్టర్ రావ్. ఈ రూప ఆ నాటి రూపకాదు. సరికొత్త రూపం ఎత్తింది. నేను అప్పటి దరిద్రపు రూపను కాను. కోట్లున్నాయి నా దగ్గర. అండర్‌స్టాండ్" అంది.

"ఈజిట్?"

"యస్. ఇప్పుడు చెప్పు? నీ ఆస్తి మొత్తం విలువ ఎంత?"

"పదిలక్షలు వుండవచ్చు."

"ఒక్కరోజులో నిన్ను ఇరవైలక్షల ఆస్తికి అధిపతిని చేస్తాను" చిటికవేసింది గమ్మత్తుగా.

"ఎలా చేస్తావ్?"

"విను. నా దగ్గర డైమండ్స్, బంగారం యెంతో మూలుగుతోంది. అంతా దొంగతనంచేసి సంపాదించింది. సగం ధరకు నీకు ఇస్తాను తీసుకో. నువ్వు డబున్నవాడివి కనుక ఎవరూ అనుమానించరు. ఆ నగలు కరిగించుకుని

మార్కెట్లో అమ్ముకో. ఫినిష్" అంది.

జగపతిరావు కళ్ళు మెరిశాయి. తన తాతలు, ముత్తాతల దగ్గర్నుంచి కూడబెడుతే ఇప్పటికి పదిలక్షల ఆస్తి చేరింది. తను రాత్రికి రాత్రి పదిలక్షలు సంపాదిస్తాడు. "ఐ యామ్ వెరీ లక్కీ ఫెలో" మత్తుగా అన్నాడు.

"నువ్వు నా ప్రియుడివి కాబట్టి నీకీ అవకాశం ఇస్తున్నాను. జాగ్రత్తగా బిజినెస్ చేసుకో. అదృష్టం నీ కాళ్ళ దగ్గరికి వచ్చింది" అంది రూప.

"అవునూ! అసలు నువ్వెందుకు దొంగవయ్యావు?" అనుమానంగా ప్రశ్నించాడు.

"డోంట్ గో టూ సైడ్ ట్రాక్ మిస్టర్ రావ్. నువ్వు నీ బిజినెస్ చూసుకో. అనవసరమైన విషయాల జోలికి పోవద్దు" కోపంగా అంది.

"సారీ రూపా!" అన్నాడు ఆమెకు కోపం వచ్చిందని గమనించి.

"నీ ఆస్తి పదిలక్షలు వుంది. కాని నువ్వు క్యాష్ రూపంలో ఎంత యివ్వగలవు? నీ క్యాష్‌కు మార్కెట్ రేటునుబట్టి రెట్టింపు బంగారం ఇస్తాను. అదీ ఈ ఒక్కసారికే" అంది రూప.

జగపతిరావు తల గోకున్నాడు.

"ఎంత క్యాష్ తీసుకురాగలనో అంతా తీసుకొస్తాను" అన్నాడు.

"ఎప్పుడు? కరెక్టుగా నిముషాలతో సహా చెప్పాలి."

"రేపురాత్రి ఏడింటికి."

"ఓ.కే. ఇక్కడికే రావాలి" అంది రూప.

"ఓ.కే" అంటూ అతను రూప చేతిని అందుకున్నాడు.

ఆమె ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లతలా అతన్ని

అల్లుకుపోయింది.

"డియర్ రావ్!"

"వూఁ...."

"స్వర్గంలో వున్నట్లుంది గదూ!"

"వూఁ...."

"మనం ఇలాగే స్వర్గానికి వెళ్ళిపోదామా?"

"ఆఁ....ఆల్ రైట్" అన్నాడు అతను.

"ముందు నువ్వెళ్ళు తర్వాత నేనొస్తాను."

"నో....నో....ఇద్దరం కలిసే....ఇలాగే...."

"ఓ.కే....ఓ.కే...." ఆమె వికృతంగా నవ్వింది.

# 3

ఒకటో నెంబరు కాటేజీలో జనం సందడిగా వున్నారు. మంగళవాయిద్యాలు మ్రోగుతున్నాయి. రాఘవరావు తన ఇద్దరు పిల్లలకు పుట్టెంటికలు తీయిస్తున్నాడు. అదీ హడావుడి.

ఎవరి గొడవలో వాళ్ళుంటే దేవుడిప్రసాదం వున్న వెండిగిన్నెను తస్కరించి కాటేజీ ప్రహరీ గోడమీద కూర్చుని భోంచేస్తూ వుంది ఒక కోతి.

రాఘవరావు భార్య చూసింది. జనం గోడదగ్గరికి రాగానే కోతి కంగారుపడి ఒక్క గెంతు గెంతింది.

ఏదైనా స్టీలుగిన్నె అయితే పోనీలే అని వూరుకోవచ్చు. రెండువందలు చేసే వెండిగిన్నె. చూస్తూ యెలా వూరుకోవడం. రాఘవరావు కర్ర పట్టుకుని కోతివెంట పడ్డాడు.

కోతి ముప్పతిప్పలు పెట్టింది అతన్ని. రాఘవరావుకి సహాయంగా ఇద్దరు కుర్రాళ్ళు గూడా వచ్చారు. గుడికి చాలా దూరం తీసికెళ్ళింది కోతి. కొండమీద ఎగుడు

దిగుడు బండలు ఎక్కి దిగి అలసిపోయాడు రాఘవరావు.

ఆఖరికి ఒక పెద్ద మర్రిచెట్టు దగ్గరికి పరిగెత్తింది. రాఘవరావు వెంబడించాడు.

అతని వెంట వచ్చిన కుర్రాళ్ళు కేవ్వుమన్నారు. రాఘవరావు అదిరిపడి వాళ్ళవంక చూశాడు. వాళ్ళిద్దరూ వణికిపోతూ చేతులు ఎత్తి చూపించారు ఆ దృశ్యాన్ని.

మర్రిచెట్టుకి శవం వ్రేలాడుతూ వుంది.

కొంచెం దూరంలో నల్లటికారు లేత ఎండలో నిగనిగ లాడుతూ వుంది.

రాఘవరావుకి గుండె దడపుట్టింది. భయంతో శరీరం కంపించింది. కాళ్ళు వణుకుతున్నాయి.

వెండిగిన్నె మాటే మర్చిపోయాడు. తిరుగుముఖం పెట్టాడు పరుగులాంటి నడకతో. ఆ కుర్రాళ్ళూ పరిగెత్తారు.

దేవాలయానికి తూర్పున ఫర్లాంగు దూరంలో మర్రిచెట్టుకి శవం వ్రేలాడుతున్న సంగతి దేవస్థానం ఆఫీసులో చెప్పాడు రాఘవరావు.

ఆ దారుణవార్త కైలాసపురంలోని సత్రాల్లోను, కాటేజీల్లోను వున్న వాళ్ళందరికీ తెలిసిపోయింది. అంతా దైవదర్శనానికి బదులుగా శవదర్శనానికి బయల్దేరారు.

కొండక్రింద కైలాసపురం పోలీస్ స్టేషన్ నుంచి పోలీసువ్యాను వచ్చింది. అప్పటికి జనం గుంపులు గుంపులుగా వున్నారు.

ఇనస్పెక్టర్ శ్రీహరిరావు శవాన్ని గుర్తుపట్టి ఆశ్చర్యపోయాడు.

ఆ శవం జగపతిరావుది. అతను ఇనస్పెక్టర్ శ్రీహరిరావుకి బాగా పరిచయం వుంది. లక్ష్మీ ఇంజనీరింగ్ కంపెనీ

ప్రొప్రయిటర్ అతను. ఆ నల్లకారు గూడా అతనిదే.

కైలాసపురానికి ఆనుకునే వున్న కపిలనగరం టౌన్‌లో జగపతిరావు ప్రముఖుడే. హైసొసైటీలో అతనికి మంచి పేరుంది. కాస్మోపాలిటన్ క్లబ్ ప్రెసిడెంట్‌గా ఎన్నో ధర్మకార్యాలు చేసాడు.

శ్రీహరిరావు మనసులో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి. జగపతిరావుని యెవరు హత్య చేశారు? ఎందుకు?

కపిలనగరం నుంచి డియస్పీ గూడా వచ్చాడు.

ఇనస్పెక్టర్ శ్రీహరిరావు సెల్యూట్ చేసి "అతను జగపతిరావు సార్!" అన్నాడు.

"ఐ నో....ఐ నో...." అన్నాడాయన.

శవాన్ని క్రిందకు దించారు. శవ పంచాయితీ చేశాడు ఇనస్పెక్టర్.

ఫోటోగ్రాఫర్ అన్ని కోణాల నుంచీ ఫోటోలు తీస్తున్నాడు.

ఫింగర్ ప్రింట్ నిపుణుడు కారుమీద పౌడర్ చల్లి వేలిముద్రలు ట్రేస్ చేస్తున్నాడు.

కాసేపటికి అతని భార్య పిల్లలు, బంధువులు టాక్సీల్లో వచ్చారు.

అతని భార్య శవంమీద పడి గోడు గోడున ఏడుస్తోంది.

చూసేవారి హృదయాలు ద్రవించిపోతున్నాయి ఆ దృశ్యం చూసి.

తర్వాత శవాన్ని పోస్ట్‌మార్టమ్ రిపోర్టుకోసం కపిలనగరం హాస్పిటల్‌కి పంపించారు.

ఉరితీసినందువల్లనే జగపతిరావు మరణించాడని పోస్టు

మార్టమ్ రిపోర్టులో తేలింది. అతను రాత్రి పదింటికి మర ణించాడని ధృవపరిచారు.

జగపతిరావు కారుమీద అతని వేలిముద్రలు కాక వేరే ఎవరివో వున్నాయి. అవి అతని కంపెనీలో పనిచేసే జవాన్, మేనేజర్, అతని భార్య....అతని సన్నిహితులకు సంబంధించినవి కావు.

అవి పాత నేరస్తులకు సంబంధించినవేమో తెలుసు కోవడానికి ఫింగర్ ప్రింట్స్ బ్యూరోకు పంపించారు.

డబ్బుకోసమే అతన్ని హత్య చేశారని ఇన్వెస్టిగేషన్ చేసిన ఇనస్పెక్టర్ శ్రీహరిరావు అభిప్రాయపడ్డాడు. కపిలనగరంలో అతను అజాత శత్రువు. కంపెనీలో వర్కర్లతో గూడా చనువుగా వుంటాడు. జీతాలు పెంచే విషయంలో వుదారంగా ప్రవర్తిస్తాడు. సమ్మెవంటి పరి స్థితులకు ఆ కంపెనీ వర్కర్లకు అవకాశం ఇవ్వలేదు.

అతని భార్యగూడా అతని హత్య గురించి ఏమీ చెప్పలేకపోయింది. ఆమెవద్ద పనికివచ్చే విషయాలులేవు.

పోతే, లక్ష్మి కంపెనీ మేనేజర్ కోటేశ్వరరావు కొంత సమాచారం ఇచ్చాడు. కంపెనీ ఎకౌంట్స్‌లో వున్న క్యాష్ అంతా డ్రా చేశాడనీ, అంతేకాక నలుగురు మిత్రుల దగ్గర అప్పుగూడా తీసుకున్నాడనీ, మొత్తం దాదాపు అయిదులక్షలు వుంటుందనీ తెలియ జేశాడు. అంత డబ్బు ఎందుకు డ్రా చేస్తున్నారని అడిగితే ఏదో క్రొత్త బిజినెస్ స్టార్ట్ చేస్తున్నాడని మాత్రం చెప్పాడట.

అదేమిటో మాత్రం చెప్పలేదు.

కపిలనగరంలో ఏ.సి. సినిమా థియేటర్ కట్టించాలనే కోరిక జగపతిరావుకి గాఢంగా వుండట. మొత్తం పాతిక

లక్షలు అవుతుందని అంచనా వేశాడనీ. బస్టాండ్ దగ్గర్లో రెండువేల గజాల స్థలం కొనాలని చూస్తున్నాడనీ, కాని స్థలానికే ఆరేడు లక్షలు అడుగుతున్నారనీ, ఐదు లక్షలకిస్తే కొంటానన్నాడనీ కోటేశ్వరరావు చెప్పాడు.

బహుశా, క్రొత్తబిజినెస్ అదే కావచ్చు అన్నాడు.

ఆ స్థలం అబ్దుల్ సత్తార్ అనే అతనిది. అతనికి ఆటోగ్యారేజీ వుంది. లారీలు నడిపిస్తున్నాడు. ఆ స్థలం అమ్మాలని తను అనుకున్నాడనీ, జగపతిరావు బేరమాడిన సంగతి నిజమేననీ, అదంతా ఆర్నెల్ల క్రితం సంగతనీ, తర్వాత మాటలు జరగలేదనీ చెప్పాడు సత్తార్.

జగపతిరావు అంత డబ్బు హడావుడిగా సేకరించిన పద్ధతి చూస్తే ఏదో క్రొత్త వ్యాపారం మొదలుపెట్టడానికే అయివుంటుంది.

'ఆ డబ్బున్న సూట్ కేస్‌తో అతను కైలాసపురం వెళ్ళివుంటాడు. దేవుడికి అర్చన చేయించడానికి. అది ఎవరో కనిపెట్టి దోచుకున్నారు తెలివిగా. సెంటిమెంటల్ ఫూల్' అనుకున్నాడు ఇనస్పెక్టర్ శ్రీహరిరావు.

డిస్ట్రిక్టు క్రిమినల్స్‌ని చాలా మందిని ప్రశ్నించారు. మూడ్ ఆఫ్ క్రైమ్స్‌నిబట్టి కొంగతనాలు చేసేవాళ్ళ లిస్టులు తిరగేశారు. ఈ రోజుల్లో అంతా కత్తితోనో, పిస్టల్‌తోనో మర్డరు చేసి దోచుకునేవాళ్ళే తప్ప వురితీసి చంపేవాళ్ళు ఎవరు?

కారుమీద దొరికిన ఫింగర్ ప్రింట్స్ పాత నేరస్తులవి కావని బ్యూరో నుంచి సమాధానం వచ్చింది.

మొత్తానికి డబ్బు దోచుకుని జగపతిరావుని వురితీసి హత్య చేసిన నేరస్థులు దొరకలేదు.

జగపతిరావుకి అప్పులిచ్చిన మిత్రులు లబోదిబో మంటున్నారు.

నెమ్మదిగా అప్పులు తీరుస్తామని జగపతిరావు బావమరిది ప్రామిస్ చేశాడు. అతనే అక్కడ తరఫున కంపెనీ నడుపుతున్నాడు.

పోలీసులు గాలిస్తూనే వున్నారు హంతకులకోసం.

## 4

రాత్రి ఏడు దాటింది.

చూడవలసిన ఫైల్సన్నీ చూసి డిస్పోజ్ చేసేశాడు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ సత్యనారాయణ.

గంటక్రితమే సైట్ నుంచి వచ్చాడు అతను.

ఆఫీసులో కూర్చుని పని పూర్తి చేశాడు. రెండు చేతులూ పైకెత్తి వళ్ళు విరుచుకున్నాడు.

టెలిఫోన్ గణగణ మ్రోగింది.

విసుగ్గా చూశాడు సత్యనారాయణ.

రిసీవర్ ఎత్తి "ఇ. ఇ. సత్యానారాయణ స్పీకింగ్" అన్నాడు.

"నమస్కారం సార్" కోకిల కంఠం వినిపించింది.

"ఎవరు?" హుషారెక్కింది ఆడగొంతు వినగానే.

"కనుక్కోండి చూద్దాం."

పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది సత్యనారాయణకి, ఎవరని చెప్పడం? అతనికి సెక్సు సంబంధాలు వున్న వాళ్ళు ఎందరో వున్నారు గతంలో. డబ్బుంది, అధికారం వుంది. ఇక ఆడవాళ్ళకి కొదవేముంది?

"ఐ యామ్ సారీ. గుర్తించలేకపోతున్నాను."

"అంతేలెండి. మనిషి దూరమైతే మర్చిపోతారు మీరు" నవ్వు వినిపించింది గలగలా పారే సెలయేరులా.

"ఎక్స్క్యూజ్ మీ! ఎవరో మీరు?"

"మీరు అనకండి. ఒకప్పుడు మీ క్రింద పనిచేసిన దాన్ని. మీ క్రింద నలిగినదాన్ని నేను."

అయినా గుర్తుకు రావడంలేదు. అతని సర్వీసులో ఎందరో నలిగారు అతని కబంధ హస్తాల్లో. ఎవరని చెప్పడం?

"కొంపతీసి సీతవి కాదుగదా!"

"సీతను కాను స్వరూపని."

"హాయ్! స్వరూపా! నువ్వా! ఎన్నాళ్ళకి విన్నాను నీ తేనెవంటి కంఠం. నాలుగేళ్ళయింది నిన్ను చూసి. మళ్ళీ కన్పించనేలేదు" కుర్రాడిలా కుర్చీలో నుంచి ఎగిరాడు.

"ఏదీ! మీ దయలేకపోయింది గదా! లేకపోతే మీ 'బెటర్ హాఫ్ నయ్యేదానిని."

"సారీ స్వరూపా! సర్కమ్‌స్టెన్సెస్ అలా వచ్చాయి. నిన్ను మోసం చేసే వుద్దేశ్యం ఏ మాత్రంలేదు నాకు. నా కంటే పదిహేనేళ్ళు చిన్నదానివి. అయినా నన్ను గాఢంగా ప్రేమించావు. నాకు చాలా గర్వంగా వుండేది గూడా.

నిన్ను పెళ్ళి చేసుకోవాలని కలలుగన్నాను. నీ అందం నేనే స్వంతం చేసుకుని ఎంజాయ్ చెయ్యాలనుకున్నాను. నిన్ను పోగొట్టుకోవలసి వచ్చింది మా మామ మూలంగా.దట్ ఓల్డ్ రోగ్ ....డర్టీ క్రీచర్ .... చేతిలో నా జుట్టు నుండిపోయింది. నా భార్య తండ్రిగదా అని, ఆమె

పోయినా నా పిల్లల్ని ఆయన దగ్గరే వుంచాను. నేను సంపాదించేదంతా ఎప్పటికప్పుడు పంపించాను. నీకు తెలియంది ఏముంది?

నిన్ను పెళ్ళి చేసుకుంటే పిల్లల్తోపాటు, డబ్బుగూడా వదులుకోవాల్సి వస్తుందని బెదిరించాడు. ఎలా చెప్పు మరి. ఈ రోజుల్లో డబ్బులేకుండా ఎలా బ్రతకాలి. ఒక్కటి గుర్తుపెట్టుకో స్వరూపా! ఈ రోజుల్లో ఏదైనా అనుభవించవచ్చును గాని, దరిద్రాన్ని అనుభవించడం చాలా కష్టం."

"నగ్న సత్యం సెలవిచ్చారు."

"ఏమిటి విశేషాలు?"

"మీరే చెప్పాలిసార్. నేను మా వారు డామ్‌చూద్దా మని వచ్చాం. ఈ సమయంలో మీరు ఆఫీసులో వుంటా రని నాకు తెలుసుగదా. ఫోన్ చేశాను."

"వెరీగుడ్. నీకు జ్ఞాపకశక్తి చాలా ఎక్కువ."

"థాంక్స్."

"వట్టి థాంక్సేనా? ఇంకేమీ లేదా?" చిలిపిగా ప్రశ్నించాడు.

"మీ బుద్ధి పోనిచ్చుకున్నారు గాదు. ఎలా చెప్పండి? మా వారు వెంటవున్నారుగదా?"

"నేనేం చెప్పను? మనసుంటే మార్గం వుండక పోతుందా?" నవ్వాడు.

"ఆలోచిస్తాను."

"ఎక్కడనుంచి నువ్వు మాట్లాడేది?"

"సీత సదన్ గెస్ట్‌హౌస్ నుంచి."

"ఎందరు పిల్లలు?"

"ఒక్కడే కొడుకు."

"మీ శ్రీవారు ఏంచేస్తుంటాడు?"

"అవన్నీ మనం కలుసుకున్నాక మాట్లాడుకుందాం."

"మనం కలుసుకునేది నిజమేనంటావా?" ఆనందంతో అన్నాడు.

"మనం కలుసుకునేది నిజం. స్వర్గంలో తేలేది నగ్న సత్యం. మీకు గుర్తులేదూ? సిటీ వెళ్ళినప్పుడు ఏ.సి. హోటల్ రూములో...."

"అబ్బ ఎంత తియ్యటి రోజులు. నోట్లో నీళ్ళూరుతున్నాయి. ఇంతకీ ఎక్కడ మనం కలుసుకునేది?"

"మీ క్వార్టర్ కే వస్తాను. రాత్రి ఏదోక సమయం చూసుకుని బయల్దేరతాను. అయితే మనం గడిపేది జల తరగింణి జలపాతం దగ్గర. ఎన్నాళ్ళయిందో ఆ జలపాతం చూసి. ఎత్తుగా కొండమీదనుంచి లోయలోకి దూకే నీళ్ళు చూస్తుంటే నా మనసు పరవశించి పోతూ వుంటుంది."

"ఓ.కే....అలాగే."

"మీకోసం ప్రత్యేకంగా ఓ గొప్ప బహుమతి పట్టుకొచ్చాను."

"ఏమిటది?"

"అబ్బ! చెప్పను. చూస్తారుగా!" వూరిస్తునట్లుగా అంది స్వరూప.

"సరే....సరే....నీ ఇష్టం. నీ కోసం నిద్రపోకుండా ఎదురు చూస్తుంటాను."

"అలాగే చూడండి. నేను మీ క్వార్టర్ ముందు కారు ఆపి హారన్ కొడతాను. ఒక్క నిముషంలో మీరు కారు ఎక్కేయ్యాలి."

"ఏమిటీ నీకు కారుందా?"ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"ఒక్కటేమిటి నాలుగున్నాయి. ఆశ్చర్యపడకండి. నేనే స్వయంగా నడుపుకుంటూ వస్తాను."

"నాకు మతి పోతోంది."

"మతి దగ్గరుంచుకోండి. ఒక్క సంగతి గుర్తుంచుకోండి. ఇలా మనం కలుసుకోబోతున్నట్లు ఎవరికీ చెప్పకండి. బైటికి పొక్కిందా మా వారు సైలెన్స్ పిస్టల్‌తో ఇద్దర్నీ కాల్చి చంపుతాడు."

"ఓకే.... నేనంత తెలివి తక్కువవాడినా? అయినా ఎవరున్నారు నేను చెప్పుకోవడానికి?"

"ఓకే.... సీ.... యూ!"

అవతల ఫోన్ పెట్టేసినట్లు క్లిక్‌మంది.

సత్యనారాయణ రిసీవర్ క్రెడిల్ చేశాడు.

మనసు సంతోషంతో వుక్కిరి బిక్కిరై పోతోంది.

మళ్ళీ ఎన్నాళ్ళకి తను స్వరూపతో గడపబోతున్నాడు?

మనసు గతంలోకి జారుకుంది.

స్వరూప మేనమామో. బాబాయో గుర్తులేదుగాని మొదటిసారిగా తీసుకొచ్చి పరిచయం చేశారు. ఆమె అందం చూసి తన కళ్ళు చెదిరాయి. ఆమె కుటుంబం చాల అసహాయ స్థితిలో వుందనీ వుద్యోగం కావాలనీ అర్థించారు.

సర్కిల్ ఆఫీసులో క్లర్కు పోస్టు ఖాళీగా వుందని తను తెలుసుకున్నాడు. తన పలుకుబడి వుపయోగించి ఆమెను టెంపరరీ క్లర్కుగా అపాయింట్ చేయించాడు. తర్వాత కొద్ది రోజులకే ఆమెను తన డివిజన్ ఆఫీసుకి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు.

తనకి భార్యపోయి రెండేళ్ళు అయింది అప్పటికి. మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి మనస్కరించలేదు. ముప్పై అయి

ఏళ్ళు నిండాయి. ఇద్దరు పిల్లలున్నారు.

పెళ్ళిచేసుకుంటే ఎన్నో గొడవలు వస్తాయి. సవతి తల్లి సరిగా పిల్లల్ని చూడదు. ఇదంతా ఎందుకని తను అలాగే గడపదల్చాడు. పిల్లల్ని వాళ్ళ తాతగారే పెంచు తున్నాడు.

డబ్బు అధికారం వుంటే ఆడవాళ్ళకి కొదవేముంది? కాని, స్వరూప ఒక పట్టాన లొంగలేదు-తను ప్రేమించి నట్లు నటించాడు. పెళ్ళిచేసుకుంటానని నమ్మించాడు. దాదాపు పెళ్ళాంలాగా వెంట త్రిప్పుకున్నాడు, ఆమె అందాన్ని జుర్రుకున్నాడు. పెళ్ళి చేసుకోమని అప్పు డప్పుడూ గొడవచేసేది. తను ఏదో కుంటిసాకులు చెప్పి తప్పించుకునేవాడు.

అప్పటికి తమ సంగతి మామగారికి తెలిసింది. పెళ్ళి చేసుకుంటే ఆస్తి ఇవ్వనని గొడవ పెట్టాడు. స్వరూపని ఎలాగైనా వదులుకోమని వార్నింగ్ ఇచ్చాడు.

ఇంతలోనే స్వరూప టెంపరరీ వుద్యోగం వూడింది. తను సంతోషించాడు. తను తల్చుకుంటే ఎలాగో అడ్జెస్టు చేసేవాడు. కాని తను సహాయంచెయ్యలేదు- తనను నిష్ఠూరాలాడి వెళ్ళిపోయింది. మళ్ళీ ఇదే కన్పించడం.

సత్యనారాయణ నిట్టూర్చాడు.

## 5

ఆ రోజు ఆదివారం—

సెలవురోజు కాబట్టి నదిమీద కట్టిస్తున్న డామ్, రిజర్వాయరు చూడటానికి టూరిస్టు బస్సులలో యాత్రి కులు వస్తుంటారు.

డామ్‌కు పదిమైళ్ళదూరంలో జలతరంగిణి అనే జల పాతం వుంది. మూడువందల అడుగుల ఎత్తు నుంచి మారు

తుంది నది లోయలోకి. దూది పింజల్లాంటి తెల్లటి మేఘాల్లా నీటి తుంపరలు అద్భుతంగా కనిపిస్తాయి. ఎంత సేపైనా అలా చూడాలనిపిస్తుంది జలపాత దృశ్యం. డామ్ చూడటానికి వచ్చేవాళ్ళంతా జలపాతం చూడ్డానికి తప్పకుండా వస్తుంటారు.

ఆ రోజు జలపాతం అందచందాలు తిలకిస్తున్న వాళ్ళకి లోయలో జలపాతం నదిలో కలిసేచోట తెల్లటి బట్టలు కట్టుకున్న వ్యక్తి విగతజీవుడై కన్పించాడు.

శవాన్ని దగ్గరగా చూడ్డానికి చాలమంది కుర్రాళ్ళు లోయలోకి దిగారు.

పల్చటి లాల్చీ, పైజమా వుంది అతనికి. బట్టతల. చేతికి వాచీ, పసుపురంగులో మెరుస్తున్న వుంగరం వున్నాయి అతనికి.

నాలుగైదు టూరిస్టు బస్సుల వాళ్ళున్నారు అక్కడ. వివిధ ప్రదేశాలనుంచి వచ్చిన వాళ్ళు. అతను ఎవరో ఎవరికీ తెలియదు. అక్కడ జలపాతం వుందిగాని గెస్టుహౌస్ లేదు. వానవస్తే తలదాచుకునేందుకు, జలపాతాన్ని చూడానికి వీలుగాను ఒక రేకుల షెడ్డుమాత్రం వుంది. చీకటి పడితే నరసంచారం వుండదు అక్కడ.

టూరిస్టు బస్సులవాళ్ళు డామ్‌కి వెళ్ళాక పోలీస్ స్టేషన్లో చెప్పారు జలపాతం దగ్గర ఒక శవం వుందని.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్, సబ్-ఇన్‌స్పెక్టర్, హెడ్ కానిస్టేబుళ్ళు, కానిస్టేబుళ్ళు వగైరా పోలీసు సిబ్బంది వాన్‌లో బయల్దేరి వెళ్ళారు.

ఆ శవాన్ని చూసి ఆశ్చర్యపోయారు పోలీసులు. అతను వాళ్ళందరికీ తెలిసినవాడే. ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్

సత్యనారాయణ.

జాపాతం పైనుంచి క్రిందపడడంవల్ల రాళ్ళుతగిలి తల పగిలింది. నెత్తురు చాలాపోయి చనిపోయివుంటాడు.

శవపంచాయితీ జరిపి డామ్ హాస్పటల్ కి పంపించారు పోస్టుమార్టమ్ రిపోర్టుకోసం.

అతని పైజమా జేబులో ఇంటితాళాల గుత్తి మాత్రం వుంది.

పోస్టుమార్టమ్ చేశాక మార్చురీలో వుంచారు శవాన్ని. అతనికి డామ్‌లో బంధువులు ఎవరూలేరు. దాదాపు ఎకరం స్థలంలో వున్న పెద్దక్వార్టరులో ఒంటరిగా వుంటున్నాడు.

ఆ క్వార్టర్ కి తాళంవేసివుంది. షెడ్ లో జీప్ వుంది. మరి అంతదూరం ఎలా వెళ్ళాడో అర్థంకావడంలేదు. అసలు అది హత్యా? లేక ఆత్మహత్యా అనేది నిర్ధారణ చెయ్యలేక పోతున్నారు.

శనివారం రాత్రి ఎనిమిదింటికి తనను వెళ్ళిపొమ్మని తలుపు వేసుకున్నాడని ఇంట్లో పనిచేసే వీరయ్యా అనే అతను చెప్పాడు.

పోస్టుమార్టమ్ రిపోర్టులో ఇంకా ఆశ్చర్యం కలిగించే విషయం బైటపడింది. అతను బాగా త్రాగి వున్నాడని తేలింది. అతను త్రాగిన మద్యంలో విషం కలిసి వుందని డాక్టర్ చెప్పాడు.

అంత ఎత్తునుంచి పడిపోయి తల పగిలి చనిపోయాడనీ ఒకవేళ కాళ్ళు చేతులు విరిగి తప్పకుండా ఎవరో విష ప్రయోగం చేసివుంటారని వూహించారు.

ఆత్మహత్య చేసుకునేవాడికి అంతదూరం వెళ్ళవలసిన అవసరం ఏముంది?

కాబట్టి, ఎవరో అతన్ని మంచిగనంతో తీసుకెళ్ళి త్రాగించి, అందులో విషం కలిపి, పైగించి నెట్టివేశారు.

ఎవరు అతన్ని హత్య చేసింది?

విజయవాడలో వుంటున్న అతని అత్తమామలు, బామ్మర్దులు, అతని పిల్లలు వచ్చారు.

శవాన్ని వాళ్ళకి అప్పగించారు పోలీసులు.

అతనికి శత్రువులు ఎవరో? ఎవరూ చెప్పలేక పోతున్నారు.

పోలీసులు ఇన్వెస్టిగేషన్ చేస్తూనే వున్నారు.

ఇంకా తేలలేదు హత్య చేసింది ఎవరో?

అది తేలదు. కేసు మూసి వేయాల్సిందే అనే పరిస్థితికి వచ్చారు పోలీసులు.

## 6

ఎండాకాలం-

అంతా ఆరుబైట వేసుకుని పడుకున్నారు.

రమణమూర్తిగూడా ఆరుబైట పడుకున్నాడు. రెండో మంచంమీద మూడేళ్ళ కొడుకు బాలు నిద్రపోతున్నాడు

ఇంటి చుట్టూ ప్రహరీగోడ. మధ్యలో రెండు గదుల ఇల్లు ముచ్చటగా వుంటుంది.

అతను ఎంతో కష్టపడి కట్టించుకున్నాడు ఆ ఇల్లు.

నాలుగేళ్ళ క్రితం పెళ్ళయింది రాణీతో అతనికి. రాణీ వచ్చిన వేళావిశేషం ఏమోగాని అతనికి మంచి రోజులు వచ్చినాయి. ఉద్యోగంలో ప్రమోషన్ వచ్చింది. అరియెర్స్‌తో చెల్లెలి పెళ్ళిచేసి పంపేశాడు. జీతం డబ్బులంటే లెక్కలేదు అతనికి. జీతానికి నాలుగురెట్లు లంచాలు వస్తున్నాయి. అంతా రాణీ అదృష్టమే అనుకున్నాడు. టౌన్ చివర చౌకగా వస్తుంటే మూడువందల

గజాల సలంకొని చిన్న ఇల్లు కట్టించాడు. చుట్టూ ప్రహరీ గోడ. నిమ్మ, దానిమ్మ, మల్లె, గులాబీ, మందార మొక్కలు నాటించాడు. అద్దె ఇంట్లో వుండే బాధ తప్పింది. వూరు చివర ఇప్పుడిప్పుడే డెవలప్ అవుతున్నది. అసలు ఇంటిముందు కూర్చుంటే పొలాల మీదనుంచి వచ్చే చల్లటిగాలికి పల్లెటూళ్ళో వున్నట్లు ఫీలయ్యేవాడు. టౌన్‌లో వుంటూ పల్లెటూరి వాతావరణం అనుభవించే అదృష్టం కలిగింది. ఆఫీసుకి వెళ్ళిరావడం కష్టంగా వుందని స్కూటర్ కొన్నాడు.

ఏటిలో తెరచాప ఎత్తిన పడవలా హాయిగా గడిచి పోతూ వుంది అతని జీవితం.

"బాబు తర్వాత ఒకపాప పుడితే ఇక చాలండీ" అంటూ వుండేది రాణి.

"ఏరా! నీకు తమ్ముడు కావాలా? చెల్లాయి కావాలా?" అంటే బాలు "తమ్ముడు" అనేవాడు.

"కాదు. చెల్లాయి....అను...."అనేది రాణి నవ్వుతూ.

బాలు తల అడ్డంగా వూపేవాడు.

అటువంటి మధురమైన జీవితంలో అపశ్రుతి పలికింది ఆ రోజు.

తెల్లవారితే ఆదివారం సెలవు గనుక శనివారం రెండో ఆట సినిమాకి వెళ్ళడం మామూలే.

ఆ రోజు అలాగే రెండో ఆట సినిమాకి వెళ్ళివస్తున్నారు.

ఎదురుగా ఏదో జీప్ అడ్డం వచ్చింది వూరి చివర. దాని డ్రైవర్ బాగా త్రాగి వస్తున్నట్లు మెలికలు తిరుగుతోంది జీప్. రమణమూర్తి అది గమనించి స్కూటర్ రోడ్డు దించి నిలబెట్టాడు తప్పుకున్నాక పోదామని.

అయితే జీపు తప్పుకోలేదు. ఆగింది.

అందులోనుంచి నలుగురు బలిష్టమైన మనుషులు దిగారు. నల్లగా భయంకరంగా వున్నారు. చూస్తుంటేనే తెలిసి పోతూ వుంది వాళ్లు గూండాలని.

బాగా తాగి వున్నారు. కళ్లు ఎర్రగా వున్నాయి.

ఆ వెన్నెల్లో వాళ్ళ దృష్టి రాణీమీద పడింది.

"దిగరా!" అన్నాడు ఒకడు.

మరొకడు దిగేదాకా వూరుకోలేదు చెయ్యి పట్టుకుని క్రిందకు లాగాడు.

బాలు కెవ్వుమని అరిచాడు.

రాణికి ఏడుపు ముంచుకొచ్చింది.

"బాబూ! నా నగలన్నీ ఇచ్చేస్తా. మమ్మల్ని ఏం చెయ్యకండి" అంది.

"నగలు మాకెందుకే. నువ్వు కావాలి ఈ రాత్రికి" అన్నాడు ఒకడు వికటంగా నవ్వుతూ.

"అయ్యా! నన్ను వదలండి. నా జీవితం నాశనం చెయ్యకండి...." అంటూ ఏడుస్తోంది.

వాళ్ళకి హృదయం అంటూ వుంటేగా ఆమె ఏడుపు విని కరగడానికి.

రమణమూర్తి ప్రతిఘటించ బోయాడు. అతన్ని దూరంగా నెట్టివేశారు.

బాలూ ఆకాశం దద్దరిల్లేటట్లు ఏడుస్తున్నాడు.

ఆమెను బరబరా ఈడ్చుకుపోయారు.

ఆమె ఏడుస్తోంది గుండెలు పగిలేటట్లు.

జీపులో పడేసి కదలకుండా పట్టుకున్నారు. అరవకుండా, ఏడవకుండా నోట్లో గుడ్డలు కుక్కారు.

మూడు కోట్లమంది దేవతలు వున్నారని పురాణాల్లో

ఘోషిస్తూ వుంటారు.

త్రిమూర్తులు అనేవాళ్లు ప్రపంచాన్ని రక్షిస్తుంటారు. ఎందరో శక్తిస్వరూపిణులున్నారు.

ఏ దేవుడూ, ఏ దేవతా రాణీని కాపాడలేక పోయారు.

నడిరోడ్డులో దారుణంగా భర్తనుంచి, బిడ్డనుంచి వేరు చేసి తమ కామదాహం తీర్చుకోవడానికి రాణీని తీసుకు పోతుంటే ఆ దుర్మార్గుల్ని శిక్షించడానికి ఏ దేవుడికీ శక్తి లేకపోయింది.

దేవుళ్ళున్నారట? ఎందుకు?

కాకీ బట్టల పోలీసులున్నారు? ఎందుకు?

ఈ దేశంలో ఆడదాన్ని రక్షించలేరు దుర్మార్గుల బారి నుంచి.

రామరాజ్యమట. పుణ్యభూమి, పవిత్రదేశం పేపర్ల మీద డబ్బా కొట్టుకోవడం.

మర్నాడు వచ్చింది రాణీ వాళ్ళ కామదాహం తీర్చి.

రమణమూర్తి ఇంటి తలుపు తెరవలేదు.

ఆమె తప్పు ఏమీ లేదని అతనికి తెలుసు. తప్పు చెయ్యనప్పుడు శిక్షించగూడదనీ తెలుసు. కాని ఆ సంగతి నలుగురికీ తెలిసిపోయింది. శీలంపోయిన ఆడదిగా ఆమెకు ముద్ర పడిపోయింది. అటువంటి భార్యను ఏలుకున్నందుకు సమాజం అతన్ని హింసిస్తుంది. నాగరిక సమాజం గదా! అందుకు ఆ సమాజానికి భయపడి భార్యను ఏలుకోలేక పోయాడు ఆ మగాడు.

ఈ దేశంలో మగాళ్ళు రాముడి అడుగుజాడల్లో నడవాలి మరి.

రాణీ అశోప హతురాలై ఎటో వెళ్ళిపోయింది.

మర్నాడు రైలు క్రిందపడి ప్రాణాలు తీసుకుంది. ఆమె శవాన్ని ఇంటికి తీసుకురాలేదు. హాస్పటల్ నుంచి అటే స్మశానానికి తీసుకెళ్ళి భూస్థాపితం చేశాడు.

భార్యని రక్షించుకోలేని అసమర్థుడు, చెయ్యని తప్పుని క్షమించలేని చవట అని అందరికీ తెలిసినా అతనికి పిల్లనివ్వడానికి తిరుగుతున్నారు ఆడపిల్లల తండ్రులు.

అతనికే ఇష్టం లేకుండా పోయింది. మొన్న మొన్నటి వరకూ అతని తల్లి వుండేది. ఇప్పుడామె స్వర్గానికి పోయింది. బాలు రక్షణ అతనికి సమస్యగా వుంది.

రమణమూర్తికి ఎందుకో మెలకువ వచ్చింది. కళ్ళువిప్పి చూశాడు.

తన మంచంమీద రాణీ కూర్చుని వుంది. తెల్లటి జాకెట్టు తెల్లటి చీర. వెన్నెల్లో మెరిసిపోతున్న దేవతలా వుంది.

ఏడుస్తోంది ఆమె.

రమణమూర్తి లేవాలని అనుకున్నాడు. ఆమెను ఓదార్చాలని తహతహలాడాడు. ఎందుకో లేవలేకపోతున్నాడు. గొంతుగూడా పెగలడంలేదు. శక్తి హరించుకుని పోయినవాడిలా కళ్ళు తెరుచుకుని చూస్తూ వుండిపోయాడు.

ఆమె అతన్ని ముద్దాడింది.

"నన్ను క్షమించండి...." అంటోంది.

నిద్రపోతున్న బాలూని గుండెలకు హత్తుకుంది. ముఖాన్ని ముద్దులతో నింపివేసింది.

ఆమె కళ్ళల్లోనుంచి ధారాపాతంగా వర్షిస్తున్నాయి నీళ్ళు.

తర్వాత ఆమె అతని తలగడ క్రింద నుంచి తాళం

తీసుకుంది.

ఆమె చేతిలో నల్లటి సంచి వుంది.

"ఏమండీ! ఇందులో డబ్బుంది. దాంతో బాలూని రాజాలా పెంచండి. గొప్పవాడిని చెయ్యండి" అంది.

ఇంటి తాళం తీసి లోపలకు వెళ్ళింది. ఐరన్ బీరువా తీసిన చప్పుడైంది.

మళ్ళీ ఇంటికి తాళాలు వేసి వాటిని అతని తలగడ క్రింద పెట్టేసింది.

"బాలూని.... వాడిని అమెరికా పంపండి చదువుకోడానికి. ఏ లోటూ చెయ్యకండి...."అంటూ వుంది రాణి.

రమణమూర్తి కళ్ళు మూసుకుపోయాయి. నిద్రలోకి జారిపోయాడు.

మర్నాడు ఎండ చుర్రుమనేదాకా మెలకువ రాలేదు అతనికి.

బాలు ముందు లేచాడు అతనికంటే.

పనిమనిషి వాకిలి ముందు వూడుస్తోంది. "అయ్యగారూ! పాలు వచ్చాయి...." అంది.

పాలమనిషి కాన్ పట్టుకుని వుంది.

అతను లేచి ఇంటి తాళంతీసి పాలగిన్నె తెచ్చి పాలు పోయించుకున్నాడు.

పనిమనిషి వంటగదిలోని అంట్లు తెచ్చి బావి దగ్గర పడేసి తోమసాగింది.

ఉన్నట్టుండి రాత్రి రాణీ అతని కలలోకి రావడం జ్ఞాపకం వచ్చింది.

అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ముభావంగానే కాలకృత్యాలు తీర్చుకున్నాడు. బాలు తొమ్మిదింటికి కాన్వెంట్ రిక్షా రాగానే వెళ్ళిపోయాడు.

రమణమూర్తి భోజనం చేశాడు.

బట్టలకోసం బీరువా తీశాడు.

అంతే. శిలా విగ్రహంలా నిల్చుండిపోయాడు. అతని కళ్ళు బైర్లు క్రమ్మాయి.

బీరువాలో వందరూపాయల నోట్లకట్టలు ఒక అర నిండా పేర్చి వున్నాయి.

కలా?

నిజమా?

అని కాసేపు నివ్వెరపోతూ వుండిపోయాడు.

అది కలకాదనీ వాస్తవమేననీ నిర్ధారించుకున్నాక మతి పోయినట్లయింది.

అంటే రాణీ రాత్రి నిజంగా వచ్చిందా? బాలూ కోసం డబ్బు ఇచ్చి వెళ్ళిందా?

అది ఎలా సాధ్యం?

చనిపోయిన రాణీ ఎలా వస్తుంది?

వచ్చినా ఇంత డబ్బు.... కాస్తాకూస్తా కాదు లక్షల కొద్దీ డబ్బు ఎలా వస్తుంది?

ఒకవేళ రాణీ చనిపోలేదా?

రమణమూర్తి తల బ్రద్దలైపోతోంది.

## 7

ఆ దొంగల ముఠాకి నాయకుడు రాజాసింగ్. ఎత్తుగా బలంగా వుంటాడు. నల్లగా కండలు తిరిగిన శరీరం. చూస్తే ఎవరికైనా జంకు కలుగుతుంది.

అతను స్వతహాగా తెలివైనవాడు. నిప్పుకి గాలి తోడైనట్లుగా రాణీ అతనికి జత కుదిరింది.

ఇద్దరూ కలసి ఎన్నో దొంగతనాలకు ప్లాన్ చేశారు. విజయవంతంగా దోపిడీ సాగించారు. పోలీసులకు అంతు

చిక్కని తరహాలో వుంటుంది ప్లాన్.

ఆ ముఠాలో పదిమంది వున్నారు. అంతా నమ్మకస్తులు. రామభక్త హనుమాన్‌లాగా రాజాసింగ్ మాట జవ దాటరు. దోపిడీలో ఎంత వచ్చింది అని ఎప్పుడూ ఆరా తియ్యరు. ఇచ్చింది తీసుకుంటారు. జల్సాగా ఖర్చుపెట్టు కుంటారు. సుఖాన్ని జుర్రుకుంటారు డబ్బు అయిపోయే దాకా.

"ఎన్నాళ్ళు మనం ఇలా కక్కుర్తి దొంగతనాలు చేయడం?" అంది రాణి రాజాసింగ్ భుజంమీద చెయ్యి వేసి.

రాజాసింగ్ ప్రేమగా ఆమె చేతిని పట్టుకున్నాడు.

"మన వృత్తి అదే అయినప్పుడు తప్పేది ఏముంది?" అన్నాడు.

వాళ్ళిద్దరూ కాక దాసు, సిద్ధప్ప అని ఇద్దరు వున్నారు గదిలో.

సినమాలో చూపించే దొంగల గుహలా లేదు అది. మోడరేట్‌గా విలువైన ఫర్నిచర్‌తో నిండివుంది ఏ.సి. రూమ్ చల్లగాలితో హాయిగా వుంది.

"నాకొక ఐడియా వచ్చింది."

అంతా రాణీవంక చూశారు.

"ఇప్పుడు దేశంలో అంతా ఘరానాగా దొంగతనం చేస్తూ పెద్దమనుషులుగా తిరుగుతున్నారు. మనం చాటుగా దొంగతనాలు చేస్తూ చాటుగా తిరగడం ఎందుకు? ఎప్పుడో ఒకప్పుడు దొరికిపోతే జీవితాంతం జైల్లో పడి చావాలి గదా?" అంది.

"అయితే ఏం చెయ్యాలంటావ్? అదంతా వాళ్ళ అదృష్టం" అన్నాడు సింగ్.

రాణీ ముఖం గంభీరంగా అయ్యింది.

"అదే తిప్పు. ఎవరి అదృష్టం వాళ్ళ చేతుల్లో వుంది."

"ఎలా చెప్పు చూద్దాం?"

"మనం చిల్లర దొంగతనాలు మానేద్దాం. ఏదైనా పెద్ద దొంగతనం ఒక్కటే ప్లాన్ చేద్దాం. డబ్బంతా కూడేసి సిటీలో పెద్ద ఫ్యాక్టరీ పెట్టి పబ్లిక్‌గా బ్రతుకుదాం. స్వేచ్ఛగా జీవించుదాం. ఇప్పుడు మనకి ఎంత డబ్బున్నా సుఖం లేదు గదా!" అంది.

"నీ ఆలోచన బాగానే వుంది" అన్నాడు దాసు.

"హాయిగా బ్రతకాలని యెవరికి లేదు" అన్నాడు సిధప్ప.

"డబ్బుంటే సరా! మనం ఎలా ఫ్యాక్టరీలు పెట్టాలో తెలియాలి. అది సరిగ్గా నడవాలి. లాభాలు రావాలి. లేకపోతే దివాళాతీసి రోడ్డున పడతాం" అనుమానంగా అన్నాడు సింగ్.

"భయం ఎందుకు? నేను లేనూ అన్నీ చూసుకోవడానికి. ఈ రోజుల్లో ధయిర్యం చెయ్యాలిగాని యే వ్యాపారం చేసినా డబ్బువర్షం కురుస్తుంది. మాటవరసకి ఫ్యాక్టరీ అన్నానుగాని సిటీలో మంచి సెంటర్ చూసి ఫైవ్ స్టార్ హోటల్ కట్టిద్దాం."

దాసు చప్పట్లు కొట్టాడు.

"నీ బుర్ర అమోఘం" అన్నాడు.

"నా బుర్ర సంగతి యిప్పుడేం తెలుస్తుంది. ముందు ముందు తెలుస్తుంది. మనకి అసాధ్యం యేదీ లేదు" అంది రాణి.

రాణీ ఆలోచన బాగానే వున్నట్లనిపించింది. తర్జన భర్జనలు చేశారు. తమ దగ్గర యెంత బంగారం వుంది,

యెంత డబ్బుంది అంచనా వేశారు. దానికి తోడు పెద్ద ఛాన్స్ కొడితే సరిపోతుంది. పది మంది హాయిగా బ్రతుకుతారు అనిపించింది.

"పెద్ద దొంగతనం యెక్కడ చెయ్యాలి మనం?" అన్నాడు దాసు.

"అది మీరు చూసుకోండి. ఏదైనా బ్యాంకును దోచేద్దాం" అంది రాణి.

"నాకూ అలాంటి సాహసం చెయ్యాలని చాలా రోజులనుంచి కోర్కెగా వుంది" అన్నాడు సిధప్ప.

"ఆఖరిసారి నీ కోర్కె తీర్చుకో" అంది రాణి నవ్వుతూ.

"వారం లోపలే నిర్ణయిస్తాను" అన్నాడు సిధప్ప.

"గుడ్" అంది రాణి మెచ్చుకోలుగా చూసి.

అనుకున్నట్టే నాలుగు రోజుల్లో సిటీ అంతా సెర్చి చేసి తను దోపిడీ చెయ్యదల్చుకున్న బ్యాంక్‌ని యెన్ను కున్నాడు సిధప్ప.

ఏ.బి.సి. కాలనీ బ్యాంక్ అది.

ఏ.బి.సి. ఫ్యాక్టరీ కాలనీలో దాదాపు పదివేలమంది పనిచేస్తున్నారు.

వాళ్ళకి ఫస్టు తారీఖున జీతాలు యిస్తారు. దాదాపు ఏడెనిమిది లక్షలు డ్రా చేస్తారు ఫ్యాక్టరీ వాళ్ళు. నెలా ఖరు రాత్రికి బ్యాంకును దోచెయ్యాలి. అదృష్టం బాగుంటే పదిహేను, ఇరవై లక్షలు దొరకవచ్చు. సిటీకి దూరంగా వుంది కాబట్టి అట్టే ప్రమాదం లేదు.

ఆ బ్యాంక్ గూడా చుట్టూ ప్రహరీతో విశాలమైన కాంపౌండ్‌లో వుంది. అందులో దొంగతనం జరిగిన సంగతి తెల్లారే వరకూ యెవరూ తెలుసుకోలేరు. ఈ

లోపల సురక్షితంగా బయటపడవచ్చు.

రాణి, రాజాసింగ్ కూడా వెళ్ళి బ్యాంక్ భవనం చూసి వచ్చారు.

పథకం సిద్ధం చేశారు.

రాత్రి రెండు గంటల ప్రాంతంలో ఆ కాలనీకి కరెంట్ సప్లయ్ చేసే ట్రాన్స్‌ఫారం వద్ద సప్లయ్ ఆపివేయాలి. ఆ టైములో ఫ్యాక్టరీ పనిచేయదు కాబట్టి రిపేరుకోసం యెవరూ వచ్చే ప్రసక్తి రాదు. అయినా ట్రాన్సుఫారం దగ్గర ఒకళ్లు రహస్యంగా కాపలా కాస్తూ వుండాలి.

సిద్దప్ప, దాసుల నాయకత్వంలో ఏడుగురు బ్యాంకు దోపిడీ పూర్తి చేస్తారు. రెండు జీపులు సిద్ధంగా వుంచుకోవాలి. ఒకటి ఏదైయినా ట్రబుల్ యిచ్చినా బాధ వుండదు.

ఈసారి రాజాసింగ్‌ని వెళ్ళొద్దంది రాణి. రాణీ సలహా ప్రకారం పూర్తి బాధ్యత అసిస్టెంట్లమీదే పెట్టాడు అతను. సిద్ధప్ప సాహసం చెయ్యాలనే మజాలో వున్నాడు.

# 8

పోలీస్ కమీషనర్ యింటికి వెళ్ళి బట్టలు మార్చుకుంటున్నాడో లేదో టెలిఫోన్ మ్రోగింది.

విసుగ్గా రిసీవర్ ఎత్తి "పోలీస్ కమీషనర్ రెసిడెన్స్ ప్లీజ్!" అన్నాడు.

"పోలీస్ కమీషనర్ గారేనా?"

"యస్....స్పీకింగ్."

"ఇప్పుడు టైమెంతయింది?"

"నన్ను టైమడగడానికా నువ్వు ఫోన్ చేసింది

ఇంకెవరూ దొరకలేదా నీకు?" కోపంగా అన్నాడు.

టెలిఫోన్‌లో నవ్వు వినిపించింది.

"ఎందుకా నవ్వు?" దబాయించాడు.

"కోప్పడకండి సార్. సమయానికి చేతికి వాచీ లేదు. అందుకే మిమ్మల్ని అడిగాను. మీకు ఫోన్ చేసింది టైమ్ అడగడానికి కాదు—మీ కొక యింపార్టెంట్ అండ్ సీక్రెట్ యిన్ఫర్మేషన్ యివ్వాలనే."

"ఏమిటీ, సీక్రెట్ యిన్ఫర్మేషనా? ఎవరు నువ్వు?"

"చెప్తాను. ముందు టైమ్ చెప్పండి."

"ఏడు."

"గుడ్. చెప్తాను వినండి. ఇంకొక ఏడు గంటల తర్వాత అంటే రాత్రి సరిగ్గా రెండు గంటలకి ఎ.బి.సి. కాలనీ బ్యాంక్ దోపిడీ చెయ్యబడుతుంది."

"ఎలా తెలుసు నీకు?"

"అవన్నీ అడక్కండి."

"ఎవరు నువ్వు?"

"అదీ అడక్కండి ప్లీజ్. మీరు సీక్రెట్‌గా వ్యవహరించి ఆ ముఠాని పట్టుకోండి. బయటపడితే వాళ్ళు చిక్కరు."

ఫోన్ పెట్టేశారు.

పోలీస్ కమీషనర్ ఆశ్చర్యపోతున్నాడు అదంతా విని.

## 9

రాత్రి పన్నెండింటికే సిద్దప్ప, దాసుల నాయకత్వంలో రెండు జీపుల్లో, కావలసిన పరికరాలు సిద్ధం చేసుకుని వెళ్ళిపోయారు.

ఇక మిగిలింది రాజాసింగ్ ఒక్కడే.

అప్పటికే పూర్తి బాటిల్ పట్టించాడు. రెండోది ఓపెన్ చేసింది రాణి.

"ఇక వద్దు రాణీ...." మత్తుగా అన్నాడు సింగ్.

"ఈ ఒక్క గ్లాసు తీసుకో" అంది.

సింగ్ ఆ గ్లాసు చేతిలోకి తీసుకుని గట గట త్రాగే శాడు.

కుర్చీలోనుంచి లేచాడు. రాణి చేతిని పట్టుకుని బెడ్ మీదకు తూలాడు.

అతని కళ్ళు యెర్రగా వున్నాయి.

మెడలో పులిగోరు పతకం తళతళలాడుతోంది.

వంటిమీద బట్టలు ఏమీ లేవు అతనికి. లుంగీమాత్రం కట్టుకున్నాడు.

రాణికూడా పల్చటి నైట్ గౌన్ రోజా రంగుది వేసుకుంది. దేవతావస్త్రంలాగా అది వున్నా లేదనిపించే టట్లు ఆమె శరీరంలోని వంపుసొంపులన్నీ స్పష్టంగా కని పిస్తున్నాయి.

సింగ్ కి పిచ్చెక్కిపోతోంది ఆమె అందం చూసి. రోజూ అనుభవించినా తనివితీరడం లేదు అతనికి. ఆమెతో అనుభవం నిత్య నూతనంగా వుంటుంది సింగ్ కి.

రోజుకన్నా ఆమె ఆ రోజు వొంపుకో బాగా మేకప్ చేసుకుంది.

అదీ అతని ముందే. ముఖానికి మాత్రమే పూసుకునే క్రీమ్ వంటినిండా పట్టించింది. మందంగా పౌడర్ పూసు కుంది శరీరమంతా డబ్బా ఖాళీ అయ్యే వరకూ. ఫారిన్ సెంట్ బాటిల్స్ నాలుగు ఓపెన్ చేసి తన నైట్ గౌన్ మీద, రాజాసింగ్ లుంగీమీద, బెడ్ మీద ఒలికించింది.

ఏ.సి. రూమ్ రకరకాల పరిమళాలతో ముక్కులు

పగలగొట్టేట్టు నిండిపోయింది.

సింగ్ ఆమె చర్యలన్నీ గమనిస్తున్నాడు.

'ఆమెకు యెంతో సంతోషంగా వుంది యీ రాత్రి' అనుకున్నాడు.

ఆమె విస్కీ సీసాలోనుంచి మరొక గ్లాసు వంపి సింగ్‌తో త్రాగించింది.

అయిష్టంగానే త్రాగాడు.

"రా....రా...." అంటున్నాడు పిచ్చివాడిలా.

రాణి పిచ్చి పిచ్చిగా నవ్వింది.

"ఎందుకు?" అంది.

"అందుకే!" నవ్వాడు.

"అందుకు యిది కాదు సమయం" అంది.

"ఏం?"

"చెప్తున్నాను. కపిల నగరంలో జగపతిరావుని ఉరి తీసి చంపాను గుర్తుందా?"

"ఆఁ...."

"జలతరంగణి జలపాతంలోకి యింజనీర్ సత్యనారాయణని నెట్టేశాను."

"అవును....అవన్నీ యెందుకు యిప్పుడు?"

"చాల అవసరం."

"వాళ్ళిద్దర్నీ యెందుకు చంపాను?"

"వాళ్ళు నిన్ను మోసంచేశారని."

"అవును. నన్ను పెళ్ళి చేసుకుంటానని నమ్మించి మోసం చేశారు. అందుకే సమయం చూసి చంపాను. నాది నాగుపాము పగ" నవ్వింది.

"నువ్వు నాగరాణీవి...." నవ్వాడు సింగ్.

"అవునా?" పక పక నవ్వింది.

"అవును."

"నేను నా భర్తతో సినిమానుంచి తిరిగి వస్తుంటే నువ్వు స్కూటర్ మీద వున్న నన్ను నా భర్త నుంచి, బిడ్డనుంచి వేరుచేసి రాక్షసంగా చెరిచావు. అవునా?"

"అవును" సీరియస్‌గా అన్నాడు సింగ్.

"మరి నేను నాగరాణిని అయితే నీ మీద పగతీర్చుకోవద్దా? ఆ జగపతిరావుని, సత్యనారాయణలని పంపించిన దారిలో నిన్నూ పంపాలా, వద్దా?"

అయోమయంగా చూశాడు సింగ్.

"నేను చెడిపోయినదాన్నని నా భర్త నన్ను తిరస్కరించాడు. అప్పుడే యెందులోనన్నా పడి చనిపోవాలనుకున్నాను. కాని నాలో యేదో శక్తి ప్రవేశించింది. మోసగాళ్ళని మోసంతో జయించాలనే ఆలోచన వచ్చింది. నన్ను మోసంచేసినవాళ్ళమీద తిరుగుబాటు చేశాను.

నన్ను అనుభవించి వదిలేసిన తర్వాత నా అంతట నేనే నీ స్థావరానికి వచ్చి లొంగిపోయాను. భర్త ఎటూ వదిలేశాడు కాబట్టి నీకు వుంపుడుగత్తెగా ఉంటానని ప్రాధేయపడ్డాను. నువ్వు ఒప్పుకున్నావు.

నీ మట్టిబుర్ర వూహాలకు అందకుండా నీ సహాయంతోనే నన్ను మోసంచేసినవాళ్ళందర్నీ చంపాను. నా బిడ్డ భవిష్యత్తు కోసం అంతులేని డబ్బు యిచ్చాను నా భర్తకి. నేను అక్కర్లేకపోయినా నే నిచ్చిన డబ్బు సహిస్తాడని నాకు తెలుసు. ఇక నేను చేయాల్సిన పని యేమీ లేదు ఈ లోకంలో. నిన్ను చంపడం ఒక్కటే

మిగిలింది" అంది రాణి.

సింగ్ బిత్తరపోయి చూస్తున్నాడు.

"నన్ను చంపుతావా?"

"చంపుతావా ఏమిట్రా పశువా? ఇప్పటికే సగం చచ్చావు. నువ్వు చివరిసారిగా త్రాగిన విస్కీలో విషం కలిపాను. ఇంకా సేపటికి నువ్వు చస్తావు. బ్యాంకు దోపిడీ చేస్తున్నారని పోలీసులకు తెలియజేశాను. వాళ్ళు అక్కడ పట్టుబడి జైల్లోకి పోతారు.

ఇక్కడ వున్నదంతా మూటగట్టి ఉంచాను. హాయిగా వెళ్ళిపోతాను నా కొడుకు దగ్గరకి. ఇప్పుడు లక్షాధికారిణిని కాబట్టి నా భర్తగూడా నా దగ్గర కుక్కలా పడి ఉంటాడు. ఉండకపోయినా బాధపడను." పకపక నవ్వుతోంది రాణి. ఆమె పూర్తి పేరు స్వరూపరాణి.

సింగ్ అదిరిపడ్డాడు.

"నన్నే మోసం చేస్తావా...." అంటూ దిండుక్రింద వున్న పిస్టల్ తీసి రాణికి గురిపెట్టాడు.

గుళ్ళు అయిపోయే వరకూ కాల్చాడు.

రక్తపు మడుగులో గిలగిలా కొట్టుకుని ప్రాణాలు వదిలింది రాణి.

సింగ్ త్రాగిన విషం పనిచేయసాగింది. స్పృహతప్పి ఆమెమీద పడిపోయాడు.

—: ఐపోయింది :—

# నిశాచరుడు

టెంపోరావ్

రోడ్డమ్మట కొంతసేపు నడిచి అతడు ఒక గేటు ముందు ఆగాడు. గేటుకు అటువైపున తాళం వేసి వుంది. ఊచల మధ్యనుంచి అతడు సూటిగా చూశాడు.

దూరంలో పెద్ద మేడ కనిపిస్తోంది. వాచ్‌మన్ లేనందుకు అతడు సంతోషించాడు. అతడు మెల్లిగా గేటుపైకి యెక్కి అటువైపుకు దూకాడు.

క్షణకాలం నిలబడి అలాగే వుండిపోయాడు. టైమ్ చూశాడు. పన్నెండు దాటింది. ఇంట్లో లైట్లు వెలగడం లేదు. ఇంట్లోని వాళ్ళు నిద్రపోతూ వుండాలి!

అతడు రెండు అరచేతులనూ కలిపి వేళ్ళను విరుచుకున్నాడు. సిగరెట్ వెలిగించాడు. జేబులో వున్న రమ్ బాటిల్ని పైకితీసి కొంచెం రమ్ తాగాడు. సిగరెట్ పొగ పీల్చి వదులుతూ అతడు మేడవైపు మెల్లిగా కదిలాడు.

మేడ ముందు అతడు నిలబడ్డాడు. లోపలకు యెలా వెళ్ళడం? అతడు ఆలోచిస్తూ సిగరెట్ పొగ వదులుతున్నాడు.

ఇంటిచుట్టూ పెద్ద తోట. దూరంలో ప్రహరీ గోడ ఉంది. ధనవంతులు ఇటువంటి మేడల్లో జీవిస్తూ ఉంటారని అతడికి తెలుసు.

అతడు వెనక్కి కదిలాడు. పైకి చూశాడు. పై డాబా మీదున్న ఓవర్ హెడ్ టాంక్ అతడికి కనిపించింది. కిందనుంచి పైపులు పైకి వెళుతున్నాయి, టాంక్ వైపు.

అతడు పైపును ముట్టుకుని గమనిస్తూ ఉండిపోయాడు. గోడకు పైపు దిట్టంగా అమర్చబడి ఉంది. అతడు సిగరెట్ పీకను పక్కకు విసిరాడు.

నేలమీద పడిన సిగరెట్ పీకను అతడు బోడుతో నొక్కి ఆర్పేశాడు. దాన్నితీసి జేబులో వదేసుకున్నాడు. తను ఏదీ ఎక్కడా వదలకూడదు!

అతడిది బరువైన విగ్రహం కాదు. పొట్టిగా, సన్నగా వున్నాడతను. సన్నటి నుదురు. చిన్న తల. అతడు పైపమ్మట పైకి పాకాడు. ఓవర్ హెడ్ టాంక్ దగ్గరకు చేరుకొన్నాడు. పై డాబా మీదకు దూకాడతను.

విశాలమైన డాబా! డాబామీద ఎవ్వరూ లేరు. అతడు డాబా నలువైపులా నడుస్తూ సిగరెట్ వెలిగించాడు. మరికొంచం రమ్ తాగి, సిగరెట్ పొగ పీల్చి వదులూ రోడ్డువైపు చూశాడు.

రోడ్డు దూరంలో వుంది.రోడ్డుదీపాలు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. కాని తనున్న డాబామీద చీకటిగా వుంది. ఆకాశంలో చంద్రుడు లేడు. నక్షత్రాలు మాత్రం తళతళ మెరుస్తున్నాయి.

అతడు గుమ్మంవైపు నడిచాడు. తలుపుమూసి వుంది. అతడు తోసి చూశాడు. తెరవబడలేదు. ఈ తలుపు తెరవగల్గితే తను మెట్లమ్మట కిందకు వెళ్లొచ్చు!

అతడు తన బాగ్‌లోంచి బాటరీ డ్రిల్లింగ్ మిషన్ని పైకి తీశాడు. అతడు తన పని ప్రారంభించాడు. తలుపు లోంచి చిన్న ముక్కలను అతడు కోసిపారేశాడు.

రంధ్రం వైపు చూశాడు. ఒకటిన్నర అడుగులు పొడుగు, ఒకటిన్నర అడుగు వెడల్పు! అతడు రంధ్రం లోంచి అటువైపుకు దిగాడు. గడియతీసి తలుపును తెరిచాడు. గాలికి తలుపు కొట్టుకోకుండా తను కోసిన కర్ర ముక్కలనా తలుపు వారగా పెట్టాడు.

జేబులోంచి టార్చ్‌తీసి బటన్ నొక్కాడతను. టార్చ్ కాంతిలో కిందకు చూశాడు. మేడమెట్లు కనిపించాయి. మెట్లు మలుపు తిరిగి కిందకు వెళ్తున్నాయి!

అతడా మెట్లమ్మట కిందకు దిగాడు. మూసిన మరి కొన్ని తలుపులు అతనికి అడ్డొస్తాయేమో!

అతడి కళ్ళు మెరిశాయి! తలుపు తెరిచే వుంది. అతడు కిందనున్న హాల్లోకి ప్రవేశించాడు.

టార్చి కాంతిలో నలువైపులా చూశాడు. పెద్ద హాలు. హాల్లో ఖరీదైన సోఫాలు! అతడు ఒక సోఫాలో కూర్చున్నాడు. ఫోమ్ తలగడ మెత్తగా వుంది. అతడు వెనక్కివాలాడు. వెనకనున్న ఫోమ్ తలగడ మెత్తగా తగిలింది.

అతడు రమ్ తాగాడు. మరో సిగరెట్ వెలిగించాడు. తనకు భయంలేదు. ఇంట్లోని వాళ్ళు నిద్రపోతున్నారు!

అతడు టార్చి కాంతిలో చూశాడు. పక్కపక్కనే రెండు గదులున్నాయి. గదుల తలుపులు అతడికి కనిపించాయి.

అతడు ఒక గదివైపు నడిచాడు. తలుపు తెర్చుకుంది. అతడు లోపలకు వెళ్ళాడు. టార్చి కాంతిలో చూశాడు. ఇరవై ఐదేళ్ళ స్త్రీ పరుపుమీద నిద్రపోతోంది.

అతడా మెవైపు చూశాడు. అందంగా వుంది. ఆమె తొడలు కనిపిస్తున్నాయి. స్తనాలు బరువుగా పైకి పొడుచుకొచ్చాయి. అతడు పళ్ళు కొరికాడు. ఆడది అతడి నెప్పుడూ ఆకర్షించలేదు!

టార్చి కాంతిలో అతడామెను చూస్తున్నాడు. ఆమె కదిలింది. లైట్‌ను చూసి మేల్కొని లేచింది.

అతడు టార్చి బటన్ని నొక్కాడు. గదిలో చీకటి. అతడామెవైపు చూశాడు. అర్చేలోగా అతడామె నోరును నొక్కేశాడు.

## 2

రాత్రి ఒంటిగంటకు శ్రీపతికి మెలుకువచ్చింది. అతడు లేచాడు. స్విచ్ నొక్కాడు. గదిలోని ఫ్లోరసెంట్ లైట్ వెల్గింది.

తన భార్య శ్రీమతిని గురించి అతడు ఆలోచిస్తూ కొంతసేపు కూర్చున్నాడు. తనతో దెబ్బలాడి ఆమె పక్క గదిలోకెళ్ళి పడుకుంది!

అతడు హాల్లోకొచ్చాడు. మెల్లగా భార్య గదిలోకి వెళ్ళి స్విచ్ నొక్కాడు. లైట్ వెల్గింది. అతడు ఆశ్చర్య పోయాడు. ఆమె పరుపుమీద లేదు!

ఆమె ఎక్కడికెళ్ళింది? కిందనున్న వంటగదిలోకి వెళ్ళిందా? రాత్రిళ్ళు ఆమె కిందకు వెళ్ళి టీ చేసుకుని తాగుతూ వుంటుంది!

అతడు గదిలోంచి బయటకు నడిచాడు. హాల్లో మూలగా కిందకు వెళ్లాడు. డైనింగ్ హాలువైపు నడిచాడతను.

డైనింగ్ హాల్లో లైట్ వెలుగుతోంది! ఆమె అక్కడే వుండివుండాలి! అతడు డైనింగ్ హాలు గుమ్మంవైపు

వెళ్ళాడు. గుమ్మంలో ఆగి లోపలకు చూశాడు.

అతడు వులిక్కిపడ్డాడు. టేబిల్ దగ్గరున్న కుర్చీలో ఎవరో కూర్చుని వున్నారు. అతడివైపు చూసి శ్రీపతి భయంకరంగా అర్చాడు. దడదడలాడే గుండెతో అతడు కిందపడ్డాడు.

పక్కింట్లో వుండే మీనన్ అతడి అరుపు విని అమాంతంగా లేచాడు.

అతడి భార్యకూడా లేచి కూర్చుంది.

"శ్రీపతి యింట్లోంచి యేదో అరుపు వినపడింది!" అన్నాడతను.

"అదంతా మనకెందుకు? పడుకోండి" అంది భార్య.

"వెళ్ళి చూసివస్తాను" అన్నాడు మీనన్.

మీనన్ యింట్లోంచి బయటకు నడిచాడు. శ్రీపతి కాంపౌండులో ప్రవేశించాడు. ముందు తలుపు తెరిచి ఉంది. అతడు లోపలకు వెళ్ళాడు. డైనింగ్ హాలు గుమ్మం ముందు పడున్న శ్రీపతిని చూశాడు.

అతడిని తట్టి లేపాడు. శ్రీపతి లేచి కూర్చున్నాడు. అతడు భయంతో మీనన్ వైపు చూశాడు. తన కెదురునా వున్న వ్యక్తి మీనన్ అని గుర్తించడానికి శ్రీపతికి టైమ్ బట్టింది.

"ఏమైంది?" అడిగాడు మీనన్.

"మా డైనింగ్ హాల్లో అపరిచితవ్యక్తి యెవరో కూర్చుని తింటున్నాడు" అన్నాడు శ్రీపతి.

"నీ భార్య యెక్కడ?"

"ఆమె తన పడగ్గదిలో లేదు."

మీనన్ మెట్లమ్మట పైకి వెళ్ళాడు. శ్రీపతి పడగ్గదిలోకి అడుగుపెట్టాడు. పరుపు ఖాళీగా వుంది. అతడి

చూపు మంచం కిందకు వెళ్ళింది. అతడు వులిక్కి-పడ్డాడు.

వేగంగా అతడు మంచం దగ్గరకు వెళ్ళాడు. వంగి కింద పడున్న శ్రీమతివైపు చూశాడు. ఆమె రక్తం మడుగులో పడుంది. మీనన్ కిందకు పరుగెత్తాడు.

కింద హాల్లో శ్రీపతి కూర్చుని వున్నాడు. మీనన్ వెళ్ళి అతడి యెదురుగా నిలబడ్డాడు.

"నీ భార్యను యెవరో చంపేశారు!" అన్నాడు మీనన్.

శ్రీపతి త్రుళ్ళిపడ్డాడు. భయంతో మీనన్ వంక చూశాడు.

"ఆమె ఎక్కడుంది?"

"మంచం కింద" అన్నాడు మీనన్.

శ్రీపతి మెట్లమ్మట పైకి పరుగెత్తాడు. మంచం కింద రక్తంమడుగులో పడున్న భార్యవైపు చూసి ఆమెమీద వాలిపోయాడు. అతడు వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

"శ్రీపతీ, యిలారా!" అన్నాడు మీనన్, అతడి చెయ్యి పట్టుకుని.

శ్రీపతి లేచాడు. ఇద్దరూ హాల్లో కొచ్చారు. మీనన్ అతడిని ఒక సోఫాలో కూర్చోబెట్టాడు. శ్రీపతి మాట్లాడే స్థితిలో లేడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"మై డియర్ ఫ్రెండ్ ధైర్యం తెచ్చుకో. ఏడిస్తే పోయిన భార్య రాదు" అన్నాడు మీనన్.

"అది నాకు తెలుసు. అతడే ఆమెని చంపి వుండాలి" అన్నాడు శ్రీపతి.

"ఎవరతను?"

"అతడెవరో నాకు తెలియదు. పొట్టిగా సన్నగా

వున్నాడు. పిశాచంలాంటి వ్యక్తి. డైనింగ్ హాలు గుమ్మంలో నేను పడిపోయాక అతడు పారిపోయి వుండాలి" అన్నాడు శ్రీపతి.

"మనం పోలీస్‌కి రిపోర్టు యివ్వాలి" అన్నాడు మీనన్ ఫోన్ వైపు నడుస్తూ.

# 3

టెలిఫోన్ మ్రోగడం విని గాఢనిద్రలోంచి లేచాను. నా పక్కన పడుకున్న పార్వతి వంక నవ్వుతూ చూశాను. ఆమె మెలుకువగా లేదు. హాల్లోకి వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"హలో, పరశురామ్" అన్నాను.

"బ్రదర్, యిన్‌స్పెక్టర్ నాయర్!" అంది అటువైపు కంఠం.

"నాయర్ భాయ్, ఏమిటి సంగతి?"

"శ్రీపతి భార్య శ్రీమతిని యెవరో హత్యచేశారు. శ్రీపతి పెద్ద బిజినెస్‌మేన్. నంబర్ 10, లాడర్స్ స్ట్రీట్‌లో ఉంటున్నాడు. అక్కడకు రాగలవా?"

హత్య దేశంలో యెక్కడ జరిగినా నన్ను ఆకర్షిస్తుంది. "వస్తాను నాయర్ భాయ్" అన్నాను.

"నేను అక్కడకు వెళ్తున్నాను వెంటనే రా" అని నాయర్ రిసీవర్ పెట్టేశాడు.

దుస్తులు మార్చుకుని కిందకు వెళ్ళాను. డాడ్జి కారును శరవేగంగా లాడర్స్ స్ట్రీట్ వైపు పోనిచ్చాను. గేటు ముందు కానిస్టేబుల్ వున్నాడు. అతడి శల్యూట్‌ని అందుకుని కారుని లోపలికి పోనిచ్చి, పోర్టికోలో వున్న పోలీస్ జీపు వెనకనే ఆపాను. కిందకు దిగాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ నా దగ్గరకొచ్చి కరచాలనం చేశాడు.

"బ్రదర్, లోపలకు వెళ్దాం పద" అన్నాడు నాయర్.

ఇన్‌స్పెక్టర్‌తో ముందు హాల్లోకి వెళ్ళాను. మేడ మెట్లెక్కి పైకి వెళ్ళాను. శ్రీమతి పడగ్గదిలోకి యిద్దరం ప్రవేశించాం.

పడగ్గదిలో ఫ్లోరసెంట్ లైటు ప్రకాశవంతంగా వెల్గుతోంది. గదిలో యెవ్వరూ లేరు. మంచం ఖాళీగా వుంది. మంచం కింద చూశాను. అక్కడున్న దృశ్యాన్ని చూసి మామూలు మనుషులు తృళ్ళిపడ్తారు.

వంగి నేలమీద పడున్న ఆమె వైపు చూశాను. ఆమె చాలా అందంగా వుంది. మరణించినా ఆమె అందం తరగలేదు. ఆమె కళ్ళు చూస్తున్నాయి. ఎక్కడో! ఎవర్నో!

కత్తితో ఆమెను పదిసార్లు యెవరో పొడిచివుండాలి. ఆమె రక్తం మడుగులో పడుంది. ఆమె ధరించిన దుస్తుల నిండా రక్తం వుంది.

వెనక్కి తిరిగాను. ఎవరో కసితో ఆమెని చంపి వుండాలి. గదిలోంచి బయటకు నడిచాను.

శ్రీపతి వైపు చూశాను. అతడు పొట్టిగా, సన్నగా వున్నాడు. అతడు యీ హత్య చేసివుండకపోవచ్చు.

"మీ భార్యకు ఎవరేనా శత్రువులు వున్నారా?"

"ఎవ్వరూ లేరు!" అన్నాడతను.

"ఆమె చాలా అందమయిన యువతి. మీ పెళ్ళి ముందు యెవరేనా ఆమెను ప్రేమించి పెళ్ళాడాలని అనుకున్నారా?" అడిగాను.

"నాకు తెలిసినంతమటుకు ఆమె నెవరూ ప్రేమించి పెళ్ళాడదల్చుకోలేదు. ఏదేనా వుంటే ఆమె నాకు

తప్పక చెప్పేది. మేమిద్దరం ప్రేమించుకునే పెళ్ళి చేసుకున్నాం" అన్నాడు శ్రీపతి.

శ్రీపతి పక్కనున్న వ్యక్తివంక చూశాను. అతడు పొట్టిగా లావుగా వున్నాడు.

"ఇతడు నా ఫ్రెండ్ మానస్. పక్కయింట్లో వుంటున్నాడు. ఇతడే పోలీసు రిపోర్టు యిచ్చాడు" అన్నాడు శ్రీపతి.

"మిస్టర్ మానస్, మీకు తెలిసినదంతా చెప్పండి" అన్నాను.

"శ్రీపతి అరుపు నాకు వినిపించి మేలుకున్నాను. వెంటనే యిక్కడికొచ్చాను. శ్రీపతి డైనింగ్ హాలు గుమ్మం ప్రాంతంలో పడున్నాడు. అతడిని లేవగొట్టి, తర్వాత శ్రీమతి హత్య చేయబడిందని తెల్సుకుని పోలీస్ రిపోర్టు యిచ్చాను" అన్నాడు మానస్.

శ్రీపతివైపు సూటిగా చూశాను.

"డైనింగ్ హాలు గుమ్మంముందు మీరెందుకు పడున్నారు?" ప్రశ్నించాను.

"నా భార్య పడగ్గదిలో లేదు. ఆమెకోసం కిందకు వచ్చాను. డైనింగ్ హాల్లో లైట్ వెల్గుతోంది. పిశాచం లాంటి వ్యక్తి కుర్చీలో కూర్చుని తింటున్నాడు. అతడిని చూడగానే భయంతో అర్చి కింద పడిపోయాను,"

"అతడిని వర్ణించండి!"

"పొట్టిగా, సన్నగా వున్నాడు. చింపిరి జుత్తు. పెద్ద మీసాలు. నల్లటి గెడ్డం. పాంటు, చొక్కా, కోటులో వున్నాడతను. అంతకంటె ఎక్కువగా చెప్పలేను!"

"పడుకునే ముందు మీరు అన్ని తలుపులూ మూశారా?"

"నేనే మూశాను సార్."

"డబ్బు ఏదేనా పోయిందా?"

"నేనింకా చూడలేదు."

"వెళ్ళి చూడండి" అని మేడమెట్లమ్మట డాబా మీదకు వెళ్ళాను.

తలుపు రంధ్రాన్ని గమనించాను. గుండ్రటి కర్ర ముక్కలు తలుపు వారగా వున్నాయి. డాబా మీదకు వెళ్ళాను. నీళ్ళ పైప్‌లను గుర్తించాను. హంతకుడు యిటు వైపునుంచే యింట్లోకి ప్రవేశించి వుండాలి!

కిందకు వెళ్లాను. అరగంట తర్వాత శ్రీపతి నా దగ్గర కొచ్చాడు.

"ఆమె నగలు అన్నీ వున్నాయి. డబ్బు పోయినట్లు లేదు" అన్నాడతను.

ఆశ్చర్యపడ్డాను. డబ్బుకోసం యీ హత్య జరగలేదు. అయితే ఎందుకు జరిగింది?

డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షించాడు. "పరశు రామ్‌గారూ, హత్య చేసిన వ్యక్తి పిచ్చివాడేమో! అతడి మూడు నాలుగు కత్తి పోట్లతోనే ఆమె మరణించి వుండాలి. ఆమె మరణించాక కూడా అతడు ఆమెను కత్తితో పొడుస్తూనే వున్నాడు!" అన్నాడతను.

అంత కసి ఆమెమీద హంతకుడికి ఎందుకు ఏర్పడింది? శ్రీపతికి తెలియని రహస్యమేదైనా వుందా?

ఆలోచిస్తూ కిందకు వెళ్ళాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ నాతో కారుదాకా వచ్చాడు.

"నాయర్ భాయ్, నీ పని కానీ? ప్రస్తుతం ఏమీ చెప్ప లేను. అంధకారంలో వున్నాను" అని కారులో కూర్చుని తలుపు మూశాను.

# 4

మర్నాటి పత్రికలో యీ హత్యగురించి విశేషంగా ప్రచారమయ్యింది. పత్రికా విలేఖర్లు వాళ్ళ యిష్టమొచ్చినట్లు రాసేశారు.

"ఇంత ఘోరంగా శ్రీమతి ఎలా చంపబడింది? ఎందుకీ హత్య జరిగింది? పోలీసులు వెంటనే కనుక్కోవాలి. లేకపోతే ప్రజలు తారెత్తిపోతారు. ఇటువంటి హత్యలు ఇంకా జరగొచ్చని భావించి ప్రజలు భయపడ్తారు!" అని రాశాడు ఒక విలేఖరి.

క్రిష్ణయ్య వేడివేడిగా యిడ్లీ తెచ్చాడు. ఇరవై యిడ్లీ తిని, మూడు కప్పుల కాఫీ తాగాను. ఇడ్లీలోకి క్రిష్ణయ్య చేసిన పొదినా, కొత్తిమిరి, కొబ్బరికాయ మిశ్రమ పచ్చడి నాకు చాలా నచ్చింది.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నవ్వుతూ గదిలోకొచ్చాడు. అతడికి యిడ్లీ తెమ్మన్నాను. అలవాటుప్రకారం వద్దన్నాడు. క్రిష్ణయ్య తెచ్చిన అరడజను యిడ్లీలను మాట్లాడకుండా నవిలేశాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ వేడి కాఫీ తాగాడు. నేను సిగరెట్ వెలిగించి అతడివంక చూశాను.

"నాయర్ భాయ్, ఏమిటి సంగతి?"

"పత్రికలు చూశావా?" అడిగాడతను.

"రెండు ఆంగ్ల దినపత్రికలు చూశాను. శ్రీమతి హత్యను గురించి విశేషంగా రాసేశారు" అన్నాను.

"బ్రదర్, యీ హత్యగురించి నువ్వు ఏమంటావు?"

"హత్య ఎందుకు జరిగిందో మనకింకా తెలియదు. శ్రీపతి చెప్పినదంతా నిజం అనుకుందాం. ఎవడో డాబా తలుపుకు చిల్లుపొడిచి యింటికొచ్చి ఆమెను చంపాడు. అంత కసితో ఆమెనతడు ఎందుకు చంపుతాడు."

ఇన్‌స్పెక్టర్ నాయర్ నావైపు సూటిగా చూశాడు. "శ్రీపతికి యీ హత్యలో ఏదేనా సంబంధం వుందని నువ్వంటావా? క్రితం రాత్రి భార్య తనతో దెబ్బలాడి వేరే పడుకుందని శ్రీపతి నాతో అన్నాడు" నాయర్ ప్రశ్నించాడు.

"భార్యా భర్తలు దెబ్బలాడుకున్నారు. వేర్వేరు గదుల్లో పడుకొన్నారు. వుద్రేకంలో మనిషి ఏదేనా చెయ్యొచ్చు!" అన్నాను.

"అతడిమీద నాకు అనుమానంగా వుంది. ఇంట్లోని వస్తువులు ఏమీ పోలేదు. ధనలాభం కోసం యీ హత్య జరగలేదని స్పష్టంగా తెలుస్తోంది. డైనింగ్ హాల్లో ఎవర్నో చూసి అతడు అరుస్తూ పడిపోవడం పచ్చి అబద్ధం అయి వుండొచ్చు! ఆ తలుపుకు అతడే చిల్లుపొడిచి వుండొచ్చు!" అన్నాడు నాయర్.

"అతడు చెప్పింది నిజం కూడా కావచ్చు! ప్రస్తుతం ఏదీ దృఢంగా మనం నమ్మలేం! మరికొంత దర్యాప్తు చేశాక నిజం మనకు తెలియొచ్చు."

"బ్రదర్, యీ హత్య విషయంలో నువ్వు నాకు సహాయపడాలి. ఈ మధ్య పోలీస్ డిపార్టుమెంటులో నామీద విమర్శలు యెక్కువైనాయి. తొందరగా హంతకుడిని నేను పట్టుకుంటే నన్ను విమర్శించేవారు నోరు మూసుకుంటారు."

అతడివంక నవ్వుతూ చూశాను.

"నాయర్ భాయ్, డోండ్ బాదర్! నీ అంత అనుభవం యీనాడొచ్చే పోలీసువాళ్ళకు లేదు. ఆఖరికి నువ్వు జయిస్తావ్" అన్నాను.

"అందుకు నీ సహాయం కావాలి!"

"నా సహాయం నీ కెప్పుడూ వుంటుంది" అన్నాను.

# 5

హోటల్ అమర్ కాబిన్‌లో కూర్చుని అతడు తెలుగు దినపత్రికలను చూడసాగాడు. పత్రికలనిండా తన్ని గురించే వుంది! అతడు ఎంతగానో ఆనందించాడు!

ప్రతి పత్రికా తననిగురించే రాయాలి!

హోటల్ బాయ్ గదిలోకొచ్చాడు. అతడు పత్రికలో నిమగ్నుడై వున్నాడు.

"ఏం కావాలి సార్" అన్నాడు బేరర్.

అతడు బేరర్ వైపు చూశాడు.

"చికెన్ బిర్యానీ, చపాతీలు, చికెన్ కూర్మా!" అన్నాడతను.

బేరర్ వెళ్ళిపోయాడు. కాబిన్‌లోని లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. జేబులోని రమ్ బాటిల్ పైకితీసి అతడు కొంచెం రమ్ తాగాడు. రమ్! నీళ్ళుకలిపి తాగే అలవాటు లేదతనికి!

రమ్ వేడిగా గొంతులోంచి లోనకు వెళ్ళి రక్తంతో కలిసి ప్రవహించాలి! వెంటనే మెదడుకు చేరాలి!

శ్రీపతి ఏమీ పోలేదన్నాడు! అతడు తనలో తను నవ్వుకున్నాడు. అతడి భార్య బీరువాలో వున్న మూడొందల రూపాయిలను తను తీసుకున్నట్లు వాళ్ళకు తెలియదు! పూర్ ఫెలోస్!

ఎక్కువగా డబ్బు పొందాలనే ఆశ అతడికి లేదు. తనకు కావలసిన కొంత డబ్బును మాత్రం తీసుకున్నాడు. బీరువాలో యింకా చాలా డబ్బుంది. అంతా తను తీసుకుంటే గుర్తిస్తారు! కొంచెం తీసుకుంటే డబ్బు పోయి

నట్లు వాళ్ళు గ్రహించరు! తను అనుకున్నట్లే అంతా జరిగింది.

తన్నెవరూ పట్టుకోలేరు. పోలీసులు తన్ని పట్టుకోలేరు! డిటెక్టివ్ పరశురామ్ పరిశోధిస్తున్నాడని అతడు పేపర్లో చూశాడు. అతడు నవ్వుకున్నాడు. పరశురామ్ యీసారి ఓడిపోయి, నవ్వులపాలవుతాడు!

బేరర్ తెచ్చినదంతా అతడు ఆకలితో తినేశాడు. తింటూ మధ్యలో రమ్ సేవిస్తున్నాడు. తినడం పూర్తి చేసి అతడు బిల్లు చెల్లించాడు. దినపత్రికలను తన బాగ్‌లో పెట్టుకుని జిప్పర్ మూశాడు. కాబిన్‌లోంచి అతడు మెల్లిగా బయటకు నడిచాడు.

రోడ్డువారగా నడుస్తూ అతడు టైం చూశాడు. పది కావస్తోంది. పగలంతా అతడు నిద్రపోతాడు. అతడు నిశాచరుడు! రాత్రిళ్ళు మాత్రమే తిరుగుతూ వుంటాడు.

మైలుదూరం నడిచాడతను. ప్రకాశం పార్క్‌లోకి ప్రవేశించాడు. సిమెంట్ సోఫాలో పడుకున్నాడు. బాగ్‌ను తలకింద పెట్టుకున్నాడు. అతడికదే తలగడ!

చల్లటి గాలి వీస్తోంది. అతడికి నిద్రపట్టేసింది! ఎవరో అతడిని లేపారు. అతడు లేచాడు. కళ్ళు నలుపుకుని ఎదురుగా వున్న వ్యక్తివైపు చూశాడు.

పార్క్ వాచ్‌మన్! అతడి చేతిలో టార్చిలైట్ వుంది.

"ఇది పడగ్గదికాదు, పార్క్!" అన్నాడు వాచ్‌మాన్.

పాంటు లోపలజేబులోకి అతడి చెయ్యి వెళ్ళింది. మరుక్షణంలో పదునైన కత్తి బయటకొచ్చింది. వాచ్‌మన్ మీదకు దూకాడతను. గాభరాగా వాచ్‌మన్ గడ్డినేల

మీద పడ్డాడు. అటుపైన అతడు తన పనిని చకచక సాగించాడు.

కత్తిని తుడిచి పాంటు లోపల జేబులో దాచుకున్నాడు. తన బాగ్ తీసుకుని అతడు శరవేగంగా గేటు వైపు నడిచాడు.

నేలమీద పడున్న టార్చి యింకా వెల్గుతోంది. టార్చి సమీపంలో వాచ్‌మన్ కూనయ్య పడున్నాడు. అతడీ లోకంలో లేడు.

కూనయ్య భార్య అతడికోసం వెతుకుతూ టార్చిలైట్ వెల్గుతున్న చోటకు వచ్చింది. టార్చి కాంతిలో నేలమీద పడున్న భర్తను చూసి ఆమె భయంకరంగా అర్చింది. ఆమె అరుపువిని, పార్కు సమీపంలో వుండే యిళ్ళలోని వాళ్ళు వులిక్కిపడ్డారు.

## 6

ప్రకాశం పార్కులో కారాపి దిగాను. ఎదురుగా పోలీస్ జీపు వుంది. ఇన్‌స్పెక్టర్ నాయర్ గబగబా నా దగ్గరకొచ్చాడు.

"బ్రదర్, మరో హత్య!" అన్నాడు నాయర్.

ప్రకాశం పార్కులోని లైట్లన్నీ వెల్గుతున్నాయి. సమీపంలో వుండే యిళ్ళలోనివాళ్ళు పార్కులో గుమిగూడారు. ఇన్‌స్పెక్టర్ నాయర్‌తో కొంతదూరం నడిచి వెళ్ళాను. సిమెంట్ సోఫా పక్కనే పడున్న వ్యక్తివైపు చూశాను.

కత్తితో ఆతడినెవరో కసితో అనేకచోట్ల పొడిచారు. అతడి దుస్తులు రక్తమయంగా వున్నాయి.

"ఎవరితను?" అడిగాను.

"ఈ పార్కు వాచ్‌మన్ కూనయ్య. అతడి భార్య శవాన్నిచూసి అర్చింది. సమీపంలో వుండే యిళ్ళలోని వాళ్ళు యిక్కడికొచ్చారు. ఒక వ్యక్తి నాకు ఫోన్ చేశాడు. నేను ఫోన్ చేసి నేనిక్కడికొచ్చాను" అన్నాడు నాయర్.

కత్తిపోట్లను మళ్ళీ పరీక్షించాను. శ్రీమతిని హత్యచేసినట్టే యితడినీ చంపారు! శ్రీమతి హంతకుడే యీ హత్య చేసేదేమో!

ఒక కానిస్టేబుల్ పెట్రోమాక్స్ లైట్‌ను శవం సమీపంలో పెట్టాడు. వాచ్‌మన్ కూనయ్య వయస్సు యాభై దాటి వుంటుంది.

సమీపంలో వున్న అతడి భార్యవంక చూశాను. మాసిన తెల్లచీరలో వుందామె. నలభై ఏళ్ళపైన ఆమె వయస్సుంటుంది.

"నీ భర్తకు ఎవరేనా శత్రువులున్నారా?" అడిగాను.

"రంగడున్నాడు" అందామె.

"ఎవరతను?"

"నా కూతురంటే ఆడికి పిచ్చి. నా కూతురు ఆడిని పెళ్ళాడ్డం నా మొగుడి కిష్టంలేదు" అందామె.

"రంగడు నీ భర్తను బెదిరించాడా?"

"తనని చంపి కూతుర్ని పెళ్ళాడ్తానని రంగడు ఎన్నిసార్లో అన్నాడు" అందామె.

"రంగడిని వెంటనే అరస్టు చేస్తాను" అన్నాడు నాయర్.

"రంగడు ఎక్కడుంటాడు?"

"ఇక్కడకు దగ్గర్లోనే! తాతమ్మన్ సందులోని 7 నంబరు గుడిసెలో వుంటాడు," అందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ వంక చూశాను.

"నాయర్ భాయ్, ఇక్కడ పని నువ్వు కానీ? నేనా రంగడిని కల్సుని వస్తాను" అని కారువైపు పరుగెత్తాను.

డాడ్జి కారును వేగాంగా పోనిచ్చాను. మెయిన్ రోడ్డు వారగా కారాపి దిగాను. రోడ్డుదాటి సందువైపు నడిచాను. సందు మొనలో ఒక వృద్ధుడు రాయిమీద కూర్చుని వున్నాడు.

"తాతమ్మన్ సందు యిదేనా?"

"అవునుసార్. మీ కెవరు కావాలి?" అడిగాడతను.

"రంగడు" అన్నాను.

"తిన్నగా ఎల్లండి, కుడిపక్క మూడోది."

సందులో లైట్లులేవు. టార్చి కాంతిలో చూసుకుంటూ ఒక గుడిసెముందు ఆగాను. లోపల బుడ్డిదీపం వెలుగుతోంది. కొబ్బరాకులతో అల్లిన తలుపు మూసివుంది. దగ్గరగావెళ్ళి తలుపునుతోసి, లోపలకు వెళ్ళాను. చాపమీద గూండాలా వున్న వ్యక్తి పడుకుని వున్నాడు. బుడ్డిదీపం డిమ్ముగా వుంది. నాటుసారా వాసన గదిలో కొడ్తోంది.

టైం చూశాను. పన్నెండున్నర కావస్తోంది. ఆలోచిస్తూ రంగడివైపు చూశాను. నాటుసారా బాగా కొట్టేసి అతడు నిద్రపోతూ వుండాలి. పక్కన సీసాలో యింకా నాటుసారా వుంది. సీసా పక్కన ప్లాస్టిక్ గ్లాసు వుంది.

అతడిని గట్టిగా తట్టాను. అతడు కళ్ళు తెరిచి నావంక చూశాడు. తృళ్ళిపడ్తూ లేచి కూర్చున్నాడు.

మళ్ళీ నావైపు చూశాడు.

"ఏం కావాలి సార్?" అడిగాడతను.

"రంగడు నువ్వేనా??"

"అవును సార్."

"ఈ రాత్రి ప్రకాశం పార్కు కూనయ్య యింటికి వెళ్ళావా?"

"వెళ్లాను సార్."

"ఎన్నింటి కెళ్లావు?"

"నా పని ఐదింటికి అయిపోయింది. తిన్నగా కూనయ్య మామ యింటికెళ్ళి, ఓసారి సూరమ్మను చూసి యిక్కడి కొచ్చేశాను."

"నీ కూనయ్య మామను ఎవరో చంపారు!"

అతడు గాభరాగా నావంక చూశాడు. అతడి నోట మ్మట మాట పెగల్లేదు.

"అతడిని చంపితే సూరమ్మను పెళ్ళాడవచ్చని అనుకున్నావా?" అడిగాను, అతడివంక సూటిగా చూస్తూ.

"మావని నేనెందుకు చంపుతాను సార్? తన కూతుర్ని నాకివ్వనంటే చంపుతానని సరదాగా అనేవాడిని. నేను బాగా డబ్బు సంపాయిస్తున్నాను. సూరమ్మ నా పెళ్లాం అవుతుందని నాకు తెలుసు."

"నువ్వు డబ్బు ఏం చేసి గడిస్తున్నావు?"

"నేను వడ్రంగిని, సార్. ఎక్కడ యిల్లుకట్టినా తలుపులూ అవీ చెయ్యడానికి నన్ను పిలుస్తారు. చేతిలో కావలసినంత పనుంది."

"ఇలా నాటుసారా తాగితే ఎంతొచ్చినా కూరించి పోతుంది!" అన్నాను నవ్వుతూ.

"సూరమ్మ యింటికొస్తే నేను నాటుసారా తాగను, సార్. నే నొంటరివాడిని. అందుకని తాగుతున్నాను."

ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి అతడివంక చూశాను.

రంగడు యువకుడు. బలమైన శరీరం కలవాడు. అతడు

లేచి నిలబడ్డాడు.

"ఎక్కడికేనా వెళ్ళాలా?"

"మావయ్యను ఎవరో చంపారన్నావుగా. వెళ్ళి చూసి వస్తాను" అన్నాడు రంగడు.

ఇద్దరం సందమ్మట నడిచాం. రోడ్డు వారగా వున్న కారులో అతడిని ఎక్కమన్నాను. అతడు కూర్చున్నాక తలుపుమూసి, అటువైపునుంచి కార్లో ఎక్కి, డ్రైవ్ పోనిచ్చాను.

రంగడు మౌనంగా వున్నాడు. ఓరగా అతడివైపు చూశాను.

"కూనయ్య వాచ్‌మన్‌గా ఎంతకాలం నుంచి పని చేస్తున్నాడు?"

"ఇరవై ఏళ్లు దాటిందని చెప్పాడు మావ."

"అతడికి ఎవరేనా శత్రువులున్నారా?"

"ఆ పార్కులోకి రౌడీలు అప్పుడప్పుడొచ్చి రాత్రిళ్లు పడుకుంటారు. వాళ్ళను మావ తరిమేస్తూ వుంటాడు. ఆ విధంగా కొందరు శత్రువులు వుండొచ్చు!"

సిగరెట్ పొగవదుల్తూ ఆలోచించసాగాను—పార్కు లోంచి తరిమేసినందుకు ఎవరూ అతడిమీద అంత కసి ప్రదర్శించరు.

ప్రకాశంపార్కులో పోలీస్ జీపు వెనకనే కారాపి దిగాను. రంగడు కార్లోంచి దిగి వాచ్‌మన్ యింటివైపు పరుగెత్తాడు.

అటువైపు గబగబా నడిచాను. రెండు గదులున్న చిన్న యింటి ముందుకు వెళ్లాడు రంగడు.

ఇంతకు ముందు నేను చూసిన వాచ్‌మన్ భార్య ఏడుస్తోంది. ఆమె పక్కనున్న సూరమ్మ ఏడుస్తూ రంగడిని

కౌగలించుకుంది. అతడామెను ఓదారుస్తూ ఆమె దగ్గర కూర్చున్నాడు.

ఆ స్థితిలోవున్న వాళ్ళవైపు క్షణకాలం చూసి, మార్గంలో వెల్గుతున్న పెట్రోమాక్స్ లైటువైపు నడిచాను.

ఇన్ స్పెక్టర్ నాయర్, డాక్టర్ సుధాకర్ మాట్లాడు కుంటున్నారు. పోలీస్ డాక్టర్ నావైపు తిరిగాడు.

"పరశురామ్‌గారూ, నాకిది చాలా ఆశ్చర్యంగా వుంది. కత్తిపోట్లనుబట్టి శ్రీమతిని చంపినట్లే యీ హత్యకూడా జరిగిందని చెప్పాలి. శ్రీమతినీ, యీ వాచ్ మన్నీ ఒకే వ్యక్తి చంపవలసిన అవసరం ఏమిటో వూహాతీతంగా వుంది" అన్నాడు సుధాకర్.

"శవాన్ని చూడగానే ఆ అనుమానం నాకూ వచ్చింది" అన్నాను నవ్వుతూ.

"డాక్టర్, రెండు హత్యలకూ ఒకేరకమైన ఆయుధాన్ని హంతకుడు వుపయోగించి వుంటాడా?" అడిగాడు నాయర్.

"సందేహం లేదు. ఒకే ఆయుధం శ్రీమతినీ, కూనయ్యనీ చంపింది!" అన్నాడు డాక్టర్.

ఆలోచిస్తూ ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను! ఈ రెండు హత్యలకూ ఎటువంటి సంబంధమూ లేదు. హంతకుడు వీళ్ళిద్దర్నీ ఎందుకు చంపాడు?

నా మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. శ్రీమతి ఈ పార్కుకి వచ్చేదేమో! కూనయ్య ఆమెకు తెలుసేమో! శ్రీమతి భర్తను అడిగి తెల్సుకోవాలి!

రంగడు యీ హత్య చేసుంటాడనే నమ్మకం నాకు లేదు. ఏ పిచ్చివాడో యీ హత్యలు చేస్తూ వుండాలి!

ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి గుడ్‌నైట్ చెప్పి నా డాడ్జి కారువైపు నడిచాను. కారులో కూర్చుని తలుపు మూసి ఆలోచిస్తూ వుండిపోయాను.

ఇన్‌స్పెక్టర్ నాయర్ కారు పక్కనే నిలబడి వున్నాడు.

"నాయర్ భాయ్, నీ పని కానీ!" అన్నాను.

"బ్రదర్, పత్రికలు మామీద దుమ్మెత్తి పోస్తాయి!" అన్నాడు నాయర్.

"కుర్చీలో కూర్చుని రాసినంత సులువుగా హంతకుడిని పట్టుకోలేం!" అన్నాను నవ్వుతూ.

"మనం ఏదో తొందరగా చెయ్యకపోతే ప్రజలు వూరుకోరు! రంగడిని అరెస్టు చేయడం మంచిదేమో!" అన్నాడు నాయర్.

అతడివంక సూటిగా చూశాను.

"రంగడు యువకుడు-సూరమ్మంటే అతడికి ప్రాణం. ఆమె తండ్రిని రంగడు హత్యచేశాడంటే నేను నమ్మను!" అన్నాను.

"నువ్వు నమ్మకపోవచ్చు! కాని ప్రజలు తృప్తిచెందుతారు. కావలిస్తే తర్వాత అతడిని విడుదల చెయ్యొచ్చు!"

"నాయర్ భాయ్, తొందరపడకు! ప్రజల్ని తృప్తి పర్చడంకోసం ఒక అమాయకుడిని బాధించడం అన్యాయం!" అని కారును స్టార్ట్ చేసి పోనిచ్చాను.

## 7

సముద్రపొడ్డున దట్టంగా పెరిగిన సరుగుడు చెట్లకింద అతడు కూర్చుని వున్నాడు. ఎండుటాకులు నేలను పూర్తిగా కప్పేశాయి. సూర్యకాంతి అడ్డపడ్డం లేదు.

అతడు పాంటుజేబులోంచి రమ్ బాటిల్ తీశాడు.

రమ్ తాగుతూ సిగరెట్ వెలిగించాడు. కనుచూపు మేరలో యెవ్వరూ లేరు.

దూరంనుంచి సముద్రపు హోరు వినపడుతోంది. అతడి కళ్ళు యెర్రగా వున్నాయి. ఆకుల చప్పుడు విని అతడు అటువైపు తిరిగాడు. ఆకుల కిందనుంచి త్రాచుపాము తల పైకి లేచింది. అది ఆకులమీద పాకుతోంది.

ఉషారుగా అతడు లేచాడు. పాంటు లోపల జేబు లోంచి కత్తి తీశాడు. త్రాచుపామును ముక్కలు ముక్కలుగా నరికాడు. ముక్కలు ప్రాణంతో అల్లల్లాడుతున్నాయి. ఆనందంతో అతడి కళ్ళు మెరుస్తున్నాయి.

ఆకుల మీద పడున్న ముక్కలవైపు అతడు సంతోషంగా చూశాడు.కత్తిని ఆకుల్తో తుడిచి పాంటు జేబులో పడేసుకున్నాడు.

అతడు తిరిగొచ్చి తన స్థానంలో కూర్చున్నాడు. మరికొంత రమ్ తాగి సిగరెట్ వెలిగించాడు.

సమీపంలో తునాతునకలై పడున్న పామువంక చూశాడు. దాన్ని నరుకుతుంటే అతడికి చాలా ఆనందంగా వుంది.

అతడు కళ్ళు మూసుకున్నాడు. గతం గుర్తుకొస్తోంది. అతడు పేద కుటుంబంలో పుట్టాడు. తండ్రి వడ్రంగిగా పనిచేసేవాడు. తండ్రి తప్పతాగి యింట్లోని భార్యనీ, నలుగురు పిల్లల్నీ చావగొట్టేవాడు.

చిన్నతనంలోనే అతడికి తండ్రిమీద కసి ఏర్పడింది. కాని తన కసిని తీర్చుకునే బలం అప్పటిలో లేదతనికి.

అతడు బడికి వెళ్ళేవాడు. తోటి విద్యార్థులతో పోట్లాడి వాళ్ళ వస్తువులను లాక్కునేవాడు. దాని మూలంగా అతడు బడికి స్వస్తి చెప్పవలసి వచ్చింది.

పనీపాటా లేని అతను గుడిసెలో వూరికే కూర్చోలేక పోయేవాడు. ఒకనాడు అతడిని చూసి ఒక కుక్క మొరిగింది. అతడు దాన్ని యిటికలతో కొట్టి చంపేశాడు. చచ్చి పడున్న కుక్కవైపు చూస్తూంటే అతడికి చాలా ఆనందంగా వుంది.

రాత్రిళ్ళు తండ్రికి భయపడి అతను ఆలస్యంగా ఇంటికొచ్చేవాడు. తండ్రి దెబ్బలు పడలేక అతడి తోబుట్టువులు యెక్కడికో పారిపోయారు. తల్లి మాత్రం నోరు మూసుకుని పడుండేది.

ఒకనాడు రాత్రి తప్పతాగి రోడ్డు వారగా పడుకున్న తండ్రిని అతడు చూశాడు. తండ్రి పీకను నులిపేసి చంపేశాడతను. ఏమీ యెరగనట్లు యింటికి చేరుకున్నాడు. అటుపైన అతడికి భయం లేదు. నాలుగిళ్ళల్లో పనిచేసి తల్లి యెలాగో కుటుంబాన్ని నడిపేది.

అతడికి పెళ్ళిచేసింది తల్లి. పెళ్ళయిన నెలరోజుల తర్వాత అతడి భార్య మరొకడితో లేచిపోయింది. సెక్స్ మీద అతడికి ఉత్సాహం లేదు. స్త్రీ రూపం అతడిని ఆకర్షించేది కాదు. అతడి నిర్లక్ష్యం వల్లనే భార్య లేచిపోయింది.

ఓ సంవత్సరం తిరిగే లోపల తల్లి మరణించింది. గుడిసెను వదిలేసి అతడు పట్నానికి చేరుకున్నాడు. అప్పటి నుంచీ పట్నంలోనే వుంటున్నాడు.

పట్నం అతడికి నచ్చింది. లక్షలాది ప్రజలు! ఈ మహా ప్రపంచంలో తన్ని యెవ్వరూ గుర్తించరు.

అతడు కళ్ళు తెరిచి పక్కనున్న ప్లాస్టిక్ బాగ్ వైపు చూశాడు. మళ్ళా కళ్ళు మూసుకున్నాడు. అతడికి కాస్సేపట్లో నిద్ర పట్టేసింది.

# 8

రాత్రి పన్నెండు దాటింది. అతడు రోడ్డమ్మట నడుస్తున్నాడు. ఒక బంగళా గేటు ముందు ఆగాడు. శబ్దం లేకుండా పిట్ట గేటు తెరిచి లోపలికెళ్ళాడు.

బంగళా చుట్టూ కొద్దిగా ఖాళీ స్థలం ఉంది. పూల మొక్కలు ఆ స్థలంలో అతడికి కనిపించాయి. చుట్టూ ముళ్ళతీగలు అమర్చబడ్డాయి.

అతడు మెల్లిగా వెనకవైపుకు వెళ్ళాడు. నుయ్యి కనిపించింది. వెనక అరటి చెట్లు వున్నాయి.

కాస్సేపు అతడు మౌనంగా నిలబడి నలువైపులా చూశాడు. సమీపంలోని యిళ్ళలోని వాళ్ళు నిద్రపోతున్నారు. ఇళ్ళలో దీపాలు ఎక్కడా వెలగడం లేదు.

అతడు జేబులోంచి బాటిల్ తీసి కొంచెం రమ్ సేవించాడు. బాటిల్‌ని దాచేసి సిగరెట్ వెలిగించాడు. సిగరెట్ పొగ పీల్చి, వదులుతూ వెనుక తలుపు వంక చూశాడు. తలుపుమీద వేళ్ళతో తట్టి పరీక్షించాడు.

ప్లాస్టిక్ బ్యాగ్‌లోని డ్రిల్లింగ్ మిషన్ తీశాడు. తలుపుకు పెద్ద చిల్లు యేర్పడింది. అతడు చిల్లులోంచి లోపలకు దూరాడు.

టార్చి కాంతిలో గదిని పరిశీలించాడు. వంట గది. ఒక వైపున గ్యాస్ స్టవ్, సిలిండర్ వగైరా కనిపించాయి.

ఎదురుగా గుమ్మం వుంది. అతడు వెనుక తలుపు గడియలు తీసి బయటనున్న బాగ్‌ను వంట గదిలో పెట్టి తలుపు మూశాడు. ఎదురుగా వున్న గుమ్మంవైపు నడిచాడు.

తలుపు దగ్గరగా మూసివుంది—తోసి అతడు లోపలికి వెళ్ళాడు. టేబుల్ కటూ యిటూ కుర్చీలున్నాయి.

ఫార్మికాతో కప్పిన టేబుల్ మీద కొన్ని పాత్ర లున్నాయి.

అతడు పాత్రలను పరీక్షించాడు. అన్నం, వంకాయ కూర, సాంబార్, గడ్డకట్టిన పెరుగు, నెయ్యి మంచినీళ్ళు వగైరా వున్నాయి. ఇవన్నీ యెందుకెక్కడ అమర్చ బడ్డాయి? ఎవరేనా భోజనానికి వస్తారా?

అతడు యెదురుగా వున్న మరో గుమ్మం వైపు చూశాడు. గుమ్మం దాటి వెళ్ళాడు. హాలు! హాల్లో రేము సోఫాలు ఉన్నాయి.

టార్చి కాంతిలో అతడు గది నలువైపులా చూశాడు. ఒక గుమ్మం వీధివైపు వుంది. రెండో గుమ్మం తలుపు తెరిచి వుంది. పడగ్గది అయివుండాలి!

అతడు పడగ్గది గుమ్మంలో నిలబడి లోపలకు చూశాడు. నీలం రంగు జీరోవాల్టు బల్బు వెల్గుతోంది. ఆ కాంతిలో పరుపుమీద పడుకున్న ఆకారం అతడికి కనిపించింది.

అతడు పరుపు దగ్గర కెళ్ళాడు. పరుపుమీదున్న స్త్రీ వైపు చూశాడు. వెంటనే అతడిలో యేదో సంచలనం రేకెత్తింది. పాంటు లోపల జేబులోంచి కత్తిని పైకి తీశాడు. ఆమె వైపు పిశాచంలా చూశాడు.

అతడి యెడంచేయి ఆమె నోరును నొక్కేసింది. అనేకచోట్ల కత్తి ఆమె శరీరంలోకి దిగింది.

బయట యేదో స్కూటర్ ఆగిన చప్పుడయింది. అతడు గాభరాగా లేచి నిలబడ్డాడు. బయట బూట్ల చప్పుడు. పిట్టగేటు తెరుస్తున్న ధ్వని.

కత్తిని ఆమె చీరకు తుడిచాడతను. జీరోవాట్ బల్బును ఆర్పేసి వంట గదిలోకి పరుగెత్తాడు.

లోపలకు యెవరో వస్తున్నారు! వంటగది, డైనింగ్

రూమ్ గుమ్మంలో చీకట్లో అతను నిలబడ్డాడు. ముందు తలుపు తోసి యెవరో లోపలకొచ్చారు. హాల్లోని లైటు వెలిగింది. తలుపు పక్కనుంచి అతడు హాల్లో కొచ్చిన వ్యక్తి వైపు చూశాడు.

ఆ వ్యక్తి వుషారుగా పడగ్గది వైపు కదిలాడు. అతడు వెనక్కి జరిగి ప్లాస్టిక్ బాగ్ ను అందుకుని, తలుపు తెరిచి నూతి పక్కనుంచి ముళ్ళతీగల దగ్గరకు పరుగెత్తాడు. అదే క్షణంలోనే పడగ్గదిలో కెళ్ళిన వ్యక్తి అరుపు భయంకరంగా అతడికి వినపడింది.

అతడు ముళ్ళతీగల మధ్యనుంచి దూరి వెనుక నున్న కాంపౌండ్ లోకి వెళ్ళాడు. వేగంగా అడుగులేస్తూ వెనక వైపునున్న రోడ్డుకు చేరుకున్నాడు.

రోడ్డమ్మట వేగంగా అతడు నడిచి వెళ్ళిపోయాడు.

# 9

పోలీస్ జీపు వెనకనే డాడ్జి కారాపి దిగాను. చాలా మంది ప్రజలు బంగ్లా ముందు గుమిగూడారు. చిన్న గేటు తెరిచి వుంది.

ముందు వరండా మీద స్కూటర్ వుంది. ఒక కానిస్టేబుల్ అక్కడ నిలబడి వున్నాడు. అతడు వినయంగా నాకు శల్యూట్ చేశాడు.

ముందు హాల్లోకి వెళ్ళాను. ఇన్ స్పెక్టర్ నాయర్ యెదురుగా వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు. సమీపంలో వున్న వ్యక్తిని అతడు నాకు పరిచయం చేశాడు.

"ఈయన పేరు రాజన్. ఒక పబ్లిషింగ్ కంపెనీకి మేనేజర్" అన్నాడు నాయర్.

అతడివైపు క్షణకాలం చూసి యిన్ స్పెక్టర్ తో పడగ్గదిలోకి వెళ్ళాను.

పడగ్గదిలో ఫ్లోరోసెంట్ లైట్ వెల్గుతోంది. డబుల్ కాట్ మీదున్న స్త్రీ వైపు చూడ్డానికి మనిషికి బాగా ధయిర్యం వుండాలి.

ఏ పిశాచమో ఆమెను కత్తితో అనేకచోట్ల పొడిచి నట్లుంది. ముఖం నుంచి కాళ్ళదాకా కత్తిపోట్లు. ఆమె ధరించిన చీర, జాకెట్ రక్తమయంగా వున్నాయి.

ఆమె మెళ్ళో బంగారం గొలుసుంది. చేతులకు గాజు లున్నాయి. చెవులకు మెరుస్తూన్న కమ్మలు వున్నాయి.

"బ్రదర్, నాతో రా" అన్నాడు నాయర్.

డైనింగ్ హాల్లోంచి వెనకనున్న వంట గదిలోకి వెళ్ళాను. వెనుక తలుపు వైపు నాయర్ చెయ్యి చూపిం చాడు. తలుపులో పెద్ద చిల్లు. అందులోంచి దూరి హంతకుడు లోపలకు వచ్చుండాలి.

చిల్లు పొడిచిన తలుపువైపు చూస్తూ వుండిపోయాను. ఇదే విధంగా శ్రీపతి యింట్లో జరిగింది.

"నాయర్ భాయ్, శ్రీమతిని చంపినతడే ఈ హత్య చేసుండాలి. సందేహం లేదు" అన్నాను.

"యూ ఆర్ రైట్ బ్రదర్" అన్నాడు యిన్ స్పెక్టర్.

తలుపు లాగి బయటకు నడిచాను. నాయర్ నా వెనకనే వచ్చాడు. నుయ్యి, కొంచెం దూరంలో ముళ్ళ తీగలు.

"హంతకుడు యీ గుమ్మంలోంచి లోపలకు వెళ్ళి యిటువైపునుంచే వెళ్ళిపోయి వుంటాడు" అన్నాడు నాయర్.

ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను. పొగ వదులుతూ నలువైపులా చూశాను. సమీపంలో వున్న యిళ్ళల్లో

లైట్లు వెల్గుతున్నాయి. ఆ యిళ్ళలోని వాళ్ళు హత్య జరిగిన యింటివైపు చూస్తున్నారు.

వెనక్కి తిరిగాను. హాల్లోకి నడిచాను. రాజన్ విచారవదనంతో పేము సోఫాలో కూర్చుని వున్నాడు. అతడి యెదురుగా నిలబడ్డాను. అతను లేవబోయాడు.

"ప్లీజ్, కూర్చోండి" అన్నాను.

డాక్టర్ సుధాకర్‌తో యిన్‌స్పెక్టర్ నాయర్ పడగ్గదిలోకి వెళ్ళాడు.

"మిస్టర్ రాజన్, జరిగిందంతా చెప్పండి!" అన్నాను.

"నేను పొద్దుట పదింటికి భోజనంచేసి వెళ్ళాను. ప్రతి రోజూ ఏడు లోపల వచ్చేస్తూ వుంటాను. ఇవాళ మా బాస్ బెనర్జీ వుండే హోటల్ సవేరాకి వెళ్ళాను. అక్కడ డిన్నర్ చేసి నేను వచ్చేసరికి ఒంటిగంట కావస్తోంది. ఇంటికొచ్చి నేను చూసేసరికి నా భార్య ఆ స్థితిలో వుంది" అని అతడు ఏడ్వసాగాడు.

"ఆలస్యంగా వస్తారని మీ రామెతో పొద్దుట చెప్పారా?" ప్రశ్నించాను.

"చెప్పాను. భోజనంచేసి పడుకోమన్నాను. ముందు తలుపు తాళం తీసి నేను లోపలకు వచ్చాను" అన్నాడతను.

ముందు తలుపును పరీక్షించాను. ఏర్ లాక్ అమర్చబడింది. బయటవాళ్ళు లోపలకు వెళ్ళాలంటే తాళంచెవి వుండాలి.

"మీరు యింటి ముందు స్కూటర్ ఆపి దిగేసరికి ఏ గదిలోనైనా లైట్లు వున్నాయా?"

నా ప్రశ్న విని అతడు వులిక్కిపడ్డాడు. నా వైపు భయంతో చూశాడు.

"నేను వచ్చేసరికి పడగ్గదిలో జీరో వాట్ బల్బు వెల్గుతున్నట్లు బయటనుంచి గుర్తించాను. కాని నేను లోపలకు వచ్చేసరికి పడగ్గదిలో చీకటిగా వుంది. లైట్లు నేను ఆన్ చేశాను" అన్నాడు రాజన్.

ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి ఆలోచిస్తూ ఉండిపోయాను. రాజన్ వచ్చేసరికి హంతకుడు పడగ్గదిలో వున్నాడు. బయట స్కూటర్ చప్పుడు విని అతడు లైట్ ఆపుచేసి వుండాలి!

తటాలున పడగ్గదిలోకి వెళ్ళాను. రెండు కిటికీలున్నాయి. ప్లాస్టిక్ గ్లాసు తలుపులు రెండూ మూసి వున్నాయి. మంచం పైనున్న సీలింగ్ ఫాన్ తిరుగుతోంది.

గదిలో వున్న డాక్టర్ సుధాకర్ వైపు చూశాను.

"మిస్టర్ పరశురామ్, ఈమె పన్నెండున్నర ఒంటిగంట మధ్య మరణించి వుండాలి. ఇంతకు ముందు శ్రీపతి భార్య యిలాగే హత్య చేయబడింది. అది మీరు గమనించి వుంటారు" అన్నాడు డాక్టర్.

ఆలోచిస్తూ హాల్లోకి నడిచాను. "మిస్టర్ రాజన్, మీ భార్య కిటికీ తలుపులు మూసుకునే పడుకునేదా?"

"నేను యింట్లో లేకపోతే ఆమె కిటికీ తలుపులను మూసే పడుకునేది."

"మీరు యిక్కడకు ఎన్నింటికి వచ్చారు?"

"12.50 కి వచ్చుంటాను."

"దిగ్గానే టైమ్ చూశారా?"

"లేదు. స్కూటర్ స్టార్ట్ చేసే ముందు హోటల్ సవేరాలో టైమ్ చూశాను. అప్పుడు 12.35 అయింది. అక్కడనుంచి యిక్కడకు రావడానికి 15 నిమిషాలు

పడ్తుంది."

నా వాచ్ వంక చూశాను. 1.45 కావస్తోంది. 12.50కి హంతకుడు యింట్లో వున్నాడు. రాజన్ రావడం గమనించి అతడు వెనకవైపునుంచి వెళ్ళిపోయి వుండాలి.

మళ్ళీ లోపలి గదుల్లోంచి సుయ్యి దగ్గరకు వెళ్ళాను. ఆలోచిస్తూ అక్కడ నిలబడ్డాను. హంతకుడు యేటువైపు వెళ్ళుంటాడు?

"సార్!" ఎవరో పిల్చారు.

ముళ్ళతీగల దగ్గరకు నడిచాను. అటువైపున మధ్య వయస్సులో వున్న వ్యక్తి నా వైపు చూశాడు.

"సార్, ఎవరో మా కాంపౌండ్‌లోంచి వెళ్ళిపోడం మా అమ్మాయి చూసింది" అన్నాడతను.

పన్నెండేళ్ళ ఆడపిల్ల మెల్లిగా వచ్చి తండ్రి పక్కన నిలబడింది. ముళ్ళతీగల మధ్యనుంచి దూరి వాళ్ళ కాంపౌండులోకి వెళ్ళాను.

"అమ్మాయి సీత మీ కంతా చెప్తుంది" అన్నాడతను.

సీత నన్ను తనతో రమ్మంది. ఒక కిటికీ పక్కనే అందరం ఆగాం. గదిలో లైటు వెల్గుతోంది.

"ఆ గదిలో నేను పడుకుని వున్నాను. నా మంచం కిటికీ పక్కనే వుంది. ఏదో కేక విని ఉలిక్కిపడి లేచాను. ఒకతను కిటికీ పక్కనుంచి రోడ్డు వైపుకు వేగంగా పోయాడు."

"అతడెలా వుంటాడు?"

"చెప్పలేను సార్. నా గదిలో లైట్ లేదు. చీకటిలో వున్నాను. అతడు మా గేటులోంచి రోడ్డు మీదకు పోయివుంటాడు."

ఆమెకు థాంక్స్ చెప్పి రాజన్ వున్న హాల్లోకి చేరు

కున్నారు. మరోసారి టైం చూశాను. రెండయింది. హంతకుడు రాజన్ యిల్లు విడిచిపెట్టి ఒక గంట పది నిమిషాలు అయింది. అతడికోసం అన్వేషించాలి.

బయటకు పరుగెత్తాను. కారులో కూర్చుని తలుపు మూశాను. ఇన్‌స్పెక్టర్ నాయర్ నా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

"నాయర్ భాయ్, నీ పని కానీ! అలా వెళ్ళొస్తాను" అని కారును పోనిచ్చాను.

కొంతదూరం పోయాక కారును ఎడంవైపుకు తిప్పి వెనకరోడ్డమ్మట పోనిచ్చాను. రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. ఇరువైపులా చూస్తూ కారును పోనిచ్చాను.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. హంతకుడు నడిచివెళ్ళి వుండాలి? గంటలో అతడు చాలాదూరం పోవచ్చు. అతడికోసం వెతకడం వృధా అనిపించింది.

రోడ్డు వారగా ఒక పాక. పాకలో టీకొట్టునుచూసి కారాపి దిగాను. పాక ముందుకి వెళ్ళాను. పాలు మరుగుతున్నాయి. పొడుగాటి బల్లమీద గాజు పాత్రల్లో బన్నులు బిస్కట్లు వగైరా వున్నాయి. అటువైపు నిలబడి షాపు యజమాని నావైపు ఆశ్చర్యంగా చూశాడు.

"ఒంటిగంట తర్వాత టీ తాగడానికి యిక్కడికి ఎంతమంది వచ్చారు?" ప్రశ్నించాను.

"చాలామంది వచ్చారు సార్" అన్నాడతను.

అతడివంక సూటిగా చూశాను.

"ఈ సమీపంలో హత్య జరిగింది. హంతకుడు యిటువైపు వచ్చి వుండొచ్చు. నీ సహాయం నాకు కావాలి" అని ఆగాను.

అతడు భయంతో నావైపు చూశాడు.

"ఒకతను వచ్చాడు సార్. ఆతడిని యింతకు ముందెప్పుడూ నేను చూడలేదు. అతడు నీళ్ళు అడిగాడు. ప్లాస్టిక్ జగ్గులో యిచ్చాను! అలా వెళ్ళి మొహం, చేతులు కడుక్కున్నాడు. అరడజను బన్నులు కొని పట్టుకు పోయాడు" అన్నాడతను.

"అతడు మొహం ఎక్కడ కడుక్కున్నాడు?"

పాపతను చేత్తో చూపించాడు.

ఆ ప్రదేశాన్ని టార్చి కాంతితో పరీక్షించాను. ఒక చోట నేలమీద నీళ్ళుపడిన సూచనలు వున్నాయి. తడి నేలను గమనించాను. రక్తం మరకలు ఏమైనా కనిపిస్తాయేమో అని చూశాను. తడి నేలమీదున్న కాగితం ముక్క కొద్దిగా ఎర్రబడింది!

వెనక్కు తిరిగాను. కొట్టుముందుకు వెళ్లాను.

"అతడు వెళ్ళిపోయి ఎంతసేపైంది?"

"అరగంటయింది సార్."

"ఎలా వెళ్ళాడతను?

"ఆ మైదానంవైపు వెళ్లాడు."

అతడు చూపించిన మైదానం వైపు చూసాను. విశాలంగా వుంది. చీకటిమయం.

"అలా వెళ్తే ఎక్కడికెళ్లొచ్చు?"

"రైలుపట్టాల దగ్గరకు" అన్నాడతను.

"అతడెలా వుంటాడు?"

"సన్నగా, పొట్టిగా వుంటాడు. గడ్డం వుంది. పాంట్, చొక్కా, పైన కోటు వేసుకున్నాడు. భుజానికి నల్లటి బాగ్ వేళ్ళాడుతోంది. చింపిరి జుత్తు!"

ఇంతకు ముందు శ్రీపతి చెప్పింది గుర్తుకొచ్చింది.

అతడికి థాంక్స్ చెప్పాను. రోడ్డువారగా వున్న నా కారును చూసుకోమని మైదానంవైపు అడుగువేశాను.

కడ్డినేల. వేగంగా అడుగులు వేస్తున్నాను. కొంచెం దూరం వెళ్ళాక ఆగి సిగరెట్ వెలిగించాను. పొగపీల్చి వదుల్తూ నలువైపులా చూశాను.

ఎక్కడా జనసంచారం లేదు. వెనక దూరంలో రోడ్డు లైట్లు, టీకొట్టు కనిపిస్తున్నాయి. రైలుపట్టాలు యింకా ఎంతదూరంలో వున్నాయో!

మెల్లిగా అడుగులు వేస్తున్నాను. రైలు యింజన్ కూత వినబడింది. కొంచెం సేపయ్యాక యింజన్ హెడ్ లైట్ కాంతిలో పట్టాలు కనిపించాయి. ఆ కాంతిలో పట్టాలపొడుగునా చూశాను.

ఒక ఆకారం పట్టాల పక్కనే కదుల్తోంది!

రైలు పట్టాలు నాకు ఒకటిన్నర ఫర్లాంగుల దూరంలో వుండొచ్చు. గూడ్స్ట్రెయిన్ వేగంగా వెళ్ళిపోయింది. మళ్ళా చీకటిమయం. నేను చూసిన ఆకారం వైపు వేగంగా అడుగులేశాను.

చీకట్లో చూడ్డానికి నా కళ్ళు అలవాటుపడ్డాయి. పట్టాలపక్క నడుస్తున్న ఆకారం యిప్పుడు దగ్గర్లో కనిపిస్తోంది.

నా బూట్లు చప్పుడుచేస్తున్నాయి. ఆ వ్యక్తి అమాంతంగా ఆగి నావైపు చూశాడు. నిశ్శబ్దంగా నిలబడ్డాను. అతడు మళ్ళా నడక ప్రారంభించాడు.

పట్టాలకు దగ్గరయ్యాను. పైకి నిక్కి, పట్టాల పక్క నిలబడి దూరంలో వెళ్తూన్న వ్యక్తివైపు తీక్షణంగా చూశాను.

సందేహం లేదు. టీపాపతను వర్ణించిన వ్యక్తి అతడే!

వేగంగా వెళ్ళిపోతున్నాడు.

పట్టా పక్కనే అతడివైపు శరవేగంగా నడవసాగాను.

# 10

అతడు ఆగాడు, నన్ను చూసి. జేబులోంచి టార్చితీసి, ఆన్ చేసి అతడివైపు తిప్పాను. అతడు అమాంతంగా పరుగెత్తసాగాడు.

"ఆగు! ఎవరు నువ్వు?" అర్చాను.

అతడు జవాబివ్వలేదు. కొంచెం దూరం వెళ్ళి ఆగాడు. పాంట్ అడుగు భాగాన్ని పైకి తిరగేసి లాగాడు. అందులోంచి తటాలున కత్తి అతడి చేతిలోకొచ్చింది.

అతడు నావైపు సూటిగా చూశాడు. టార్చి కాంతిలో అతడి ముఖాన్ని పరీక్షించాను. ఎర్రబడిన కళ్ళు! భుజానికి బాగ్ వేళ్ళాడుతోంది. టార్చి కాంతిలో అతడి చేతిలో వున్న కత్తి మెరుస్తోంది.

"రాస్కల్! కత్తిని పక్కపడేసి నా ప్రశ్నలకి జవాబియ్యి" అర్చాను.

అతడు అమాంతంగా పులిలా నావైపు దూకాడు! టార్చిని ఆఫ్ చేశాను. చటుక్కున పక్కకు జరిగాను. అతడు రైలు పట్టాలమధ్య పడ్డాడు.

కత్తున్న అతడి చెయ్యిని బూట్‌తో గట్టిగా నొక్కాను. అతడు లేవబోయాడు. మరోకాల్తో అతడిని పొట్టలో తన్నాను. అతడు పక్కకు పడ్డాడు. నా బూట్ కిందనున్న చెయ్యిని యింకా గట్టిగా నొక్కాను. కత్తిని అతడు వదిలేశాడు. అతడి శరీరాన్ని కత్తికి దూరంగా తన్నాను.

అతడు మూలుగుతున్నాడు. టార్చి ఆన్ చేసి అతడివంక చూశాను. అతడిని లేవదీసి, చేతుల్ని వెనక్కువిరిచి

నైలాన్ తాడుతో కట్టేశాను.

అతడి భుజానికున్న బాగ్ ను తీసి, తెరిచి చూశాడు. డ్రిల్లింగ్ మిషన్, మరికొన్ని పనిముట్లు వగైరా వున్నాయి!

కత్తిని జేబురుమాల్లో చుట్టి బాగ్ లో పడేసి అతడి భుజానికి తగిలించాను.

"పద!" అర్చాను.

అతడు ముందు నడుస్తున్నాడు. టార్చి కాంతిలో అత డిని గమనిస్తూ వెనకనే వస్తున్నాను.

మైదానంగుండా నడిచి యిద్దరం టీకొట్టు ప్రాంతానికి చేరుకున్నాం. అతడిని కారు ముందుసీటులో కూర్చోబెట్టి తలుపు మూశాను. నా సీట్లో కూర్చుని కారును వెనక్కు తిప్పి పోనిచ్చాను.

రాజన్ యింటిముందు కారు ఆగింది. ఇన్ స్పెక్టర్ నాయర్ కారు దగ్గరకు గబగబా వచ్చాడు.

"నాయర్ భాయ్, మిసెస్ రాజన్ హంతకుడిని నీకిస్తున్నా. ఇతడే శ్రీమతిని హత్య చేసుండాలి! ప్రకాశం పార్కు కూనయ్యను కూడా యితడే చంపి వుండొచ్చు" అన్నాను.

"బ్రదర్, యితడు నీకు ఎక్కడ దొరికాడు?"

"ఇతడికోసం చాలా దూరం నడవ్వలసి వచ్చింది. అంతా తర్వాత చెప్తాను" అన్నాను.

అతడిని ఇన్ స్పెక్టర్ నాయర్ బయటకు దింపాడు. ఇద్దరు కానిస్టేబుల్స్ అతడిని లాక్కెళ్ళి పోలీస్ జీప్ లో కూర్చోబెట్టారు.

శ శ శ

# 118

ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాను. సైకియాట్రిస్ట్ ఆనంద్ నవ్వుతూ గదిలోకొచ్చి నాతో కరచాలనం చేశాడు.

"పరశురామ్‌గారూ, అతడిని పట్టుకుని మీరు ప్రజలకు చాలా సేవచేశారు. అతడొక కిల్లర్ మేనియక్! జంతువుల్నో, మనుషులనో చంపితేగాని అతడు ఆనందంగా బ్రతకలేడు. సైకోపథిక్ కిల్లర్!" అన్నాడు ఆనంద్.

"శ్రీమతిని, కూనయ్యని, మిసెస్ రాజన్ని చంపానని అతడు ఒప్పుకున్నాడు. ఇంకా ఎందర్నో గతంలో అతడు చంపానన్నాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"ఇటుపైన ప్రజలు క్షేమంగా బ్రతకొచ్చు" అన్నాను నవ్వుతూ.

—: ఐపోయింది :—

# వురి కోరిన వుత్తరం!

## సికిందర్

సరళాదేవి స్వింగ్‌డోర్ తెరిచి లోనికెళ్ళి మ్రాన్పడి పోయింది. లోపల ఎదురుగా టేబిల్ మీద ఆరేళ్ళ వినయ్‌బాబు మోకాళ్ళమీద కూర్చొని, చిందరవందరగా పడివున్న నోట్లను ఏరుతున్నాడు.

అన్నీ వందరూపాయల నోట్లు! వాటి మొత్తం కనీసం అయిదారువేలు వుంటుంది....

సరళ కళ్ళు చెదిరాయి. వేగంగా కదిలి టేబిల్ దగ్గరికెళ్ళింది. వినయ్ ఆమెను గమనించలేదు. ఉత్సాహంగా నోట్లను పేరుస్తూ నిమగ్నమై వున్నాడు.

“వినయ్! ఇవెక్కడివి!” సరళ అర్చింది.

వినయ్ ఉలికిపడి తలెత్తి చూశాడు. వెంటనే అతని కళ్ళు మెరిశాయి. ఆ వెంటనే ముఖంలో గర్వం, సంతోషం చోటుచేసుకున్నాయి.

“ఇవన్నీ నావే! బావున్నాయి కదూ?”

సరళకు మతిపోయనట్లయింది. తేరుకొని అంది:

"వినయ్! నువ్విలా డబ్బు తీయకూడదు! డాడీ చూస్తే కోప్పడతారు!"

"ఈ డబ్బు నాది! ఫో! దూరంగా వుండు నువ్వు?"

సరళ గాభరాగా నోట్లనందుకోబోయింది. వినయ్ ఆమె చేతులు పట్టుకొని ప్రక్కకు నెట్టేశాడు.

"ఏయ్! ముట్టుకోకు నువ్వు! నీ ముక్కు కోస్తాను!"

"బాబూ! డాడీ వస్తారు" సరళ బ్రతిమాలింది.

వినయ్ మెరుపులా లేచి, పెన్ స్టాండులోంచి కలం తీసి ఝులిపించాడు. "నువ్వు ఫో! పొడుస్తాను లేకపోతే!"

సరళ సహనం చచ్చిపోయింది. దుడుకుగా అతని కలం లాక్కుని, అతన్ని లేపి క్రిందకు దింపింది. వినయ్ కెవ్వుమన్నాడు.

అదే క్షణంలో విసనకర్రలా స్వింగ్ డోర్ తెరచుకుంది. సుమారు 45 ఏళ్ళ వయసున్న వ్యక్తి లోనికి జొరబడ్డాడు. సరళ చేతిలో డబ్బు వదిలేసి, గిరుక్కున వెనక్కి తిరిగి చూసి కొయ్యబారిపోయింది.

అతను టేబిల్ మీద నోట్లను, సరళను, వినయ్‌నూ మార్చిమార్చి చూశాడు. క్షణాలు ఉద్రిక్తంగా గడుస్తున్నాయి. సరళ బెదురుతూ చూసి, చిన్నగా గొణిగింది. "సర్, ఈ డబ్బు—వినయ్ తీశాడు."

ఆ వ్యక్తి చటుక్కున వినయ్‌ని చూశాడు. వినయ్ ఒక్క దూకులో వెళ్ళి తండ్రి చెయ్యి పట్టుకున్నాడు.

"డాడీ! ఆ డబ్బు నేనే తీశాను! నాకివ్వవూ?"

ఆ వ్యక్తి సరళను ప్రశ్నార్థకంగా చూసి, "ఏమిటిది! ఈ డబ్బు బయటికెలా వచ్చింది?" అన్నాడు తీవ్రంగా.

"ఏమో! వినయ్ తీశాడు .... వినయ్! ఎక్కడిది వినయ్?"

పసివాడు ఉషారుగా నవ్వాడు. చెయ్యిపెట్టి ఎదురు గోడకున్న షెల్ఫ్‌లో హాండ్ బ్యాగును చూపించాడు.

"అందులోంచి తీశానూ!"

సరళ అదిరిపడింది. ఆ వ్యక్తి విసురుగా షెల్ఫ్ దగ్గరికి నడిచాడు.

సరళకు వున్నట్టుండి చెమటలు పట్టాయి. నిల్చున్న చోట విగ్రహంలా వుండిపోయింది.

ఆ వ్యక్తి బ్యాగునందుకొని తెరిచి చూశాడు. అతని కళ్ళు ఉలికిపడ్డాయి. గబగబ దానితో టేబిల్ దగ్గరి కొచ్చి అందులోని వస్తువుల్ని గుమ్మరించాడు.

సరళ కళ్ళప్పగించి చూస్తోంది. వినయ్ టేబిల్ ఎక్కి ఆసక్తిగా చూస్తున్నాడు.

ఆ వ్యక్తి క్రిందపడ్డ వస్తువుల్లోంచి ఒక తాళంచెవి ఏరి తీశాడు.

వెంటనే జేబులోంచు తాళాల గుత్తితీసి చూసుకున్నాడు. అతని ముఖం కందగడ్డలా మారింది. సరళ నోరు తెరిచిపెట్టి చూస్తోంది. అతను తాళం చెవితో టేబిల్ సొరుగు లాగి, లోనికి తొంగిచూశాడు. ధడాలున సొరుగు లోనికి నెట్టేసి తల పైకెత్తాడు:

"రాక్షసీ! నా తాళంచెవి దొంగిలించి డబ్బు తీయడానికి నీకెంత ధైర్యం!"

సరళ మాట్లాడలేదు. ఆమె మాట్లాడే స్థితిలో లేదు. ఆ షాక్‌నుంచి ఇంకా కోలుకోలేదు.

అతడు ఫోనందుకున్నాడు. "నీ అంతు చూస్తాను!" ఉద్రేకంతో డయల్ చేస్తూ, "నీలాంటి మోసగత్తెను సహించను!" అనర్చి, "హలో.... పోలీస్?" అన్నాడు.

అప్పుడుగానీ సరళ తేరుకోలేదు. లేడిలా ముందుకు

గొంతో, ఫోను పట్టుకుంది. "నన్ను నమ్మండి! ఆ డబ్బు నేను తీయలేదు! పోలీసుల్ని పిలవకండి!" అనర్చింది ఉద్రేకంగా.

అతనామె గడ్డంక్రింద చెయ్యిపెట్టి వెనక్కి నెట్టాడు. ఆమె విసురుగా వినయ్ వొళ్ళో పడింది. వినయ్ ఆమెను దూరంగా నెట్టేస్తూ, "నువ్వు చెడ్డదానివి!" అన్నాడు.

ఆ వ్యక్తి ఫోన్లో గబగబ మాట్లాడుతున్నాడు, "ఇన్స్పెక్టర్! త్వరగా రావాలి! గ్లోబ్ ఫైనాన్సింగ్ కంపెనీ, అరోరా బిల్డింగ్స్, ఆబిడ్స్. నేను విష్ణుకాంత్ - ప్రొప్రయిటర్ని మాట్లాడుతున్నాను. ఇక్కడ దొంగతనం జరిగింది...."

సరళ అతని మాటలు వింటూ, తీవ్రంగా ఆలోచిస్తూ ఉలిక్కిపడింది. అతను ఫోను పెట్టేశాక, గభాల్న అందుకొని గబగబ డయల్ చేయసాగింది. అతను తీక్షణంగా చూస్తున్నాడు.

"హలో, ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ....?"

"యస్, వాటీజిట్ యూ వాంట్, మాడమ్?"

"మిస్టర్ లాల్ కావాలి!" అంది సరళ ఉద్వేగంగా.

# 2

లాల్ చెయ్యి చాపి, జాన్ చేతిలో ఫోన్ అందుకొని "యస్, లాల్ హియర్" అన్నాడు ఓపిగ్గా. ఆ తర్వాత అవతలి మాటలు రెండు నిమిషాలు శ్రద్ధగా విని, "నిరూపణ అయ్యేవరకూ యెవరూ నేరస్థులు కాలేరు, మిసెస్ సరళ. నిర్భయంగా ఉండండి! మేం వెంటనే వస్తున్నాం" అని రిసీవర్ పెట్టేసి లేచాడు.

"గెటప్! ఆమెని పోలీసులు అరెస్టు చెయ్యబోతున్నారట—బూటకపు నిందలతో! లెటజ్ రన్."

గ్లోబ్ ఫైనాన్సింగ్ కంపెనీ ఆఫీసులో ఇద్దరు అబిడ్స్ సబ్ యిన్‌స్పెక్టర్లు డిటెక్టివ్‌లను విష్ చేశాడు.

"గుడ్ మార్నింగ్. కానీ మిస్టర్ లాల్, ఆమె కిప్పుడు కావల్సింది మీరు కాదు, లాయర్. ఆమెని అరెస్టు చేసి తీసుకెళ్తున్నాం. బెయిల్ ప్రయత్నాలు చేసుకోవాలంటే—"

నాథ్ మాటలకి సరళ అడ్డుపడి అర్చింది, "మీరు నన్ను అరెస్టు చెయ్యలేరు! ఆయన మాటలు విని నన్నేమీ చేయలేరు! అంతా అబద్ధం! ఆ డబ్బు ముమ్మాటికీ నేను తీయలేదు. నేను తీసివుంటే ఆ షెల్ఫులో కన్పించేలా ధైర్యంగా పెడతానా?"

"మిస్టర్ లాల్! వీళ్ళు ఆలోచించకుండా ప్రవర్తిస్తున్నారు! బాస్ మాటల్లో ఏమాత్రం నిజం లేదు. వీళ్ళు ఆయన్ను ప్రశ్నించడంలేదు! అంతా ఆయన పలుకుబడి! మీరు నిలదీసి అడిగి అసలు నిజం బయటపెట్టండి! ఆ డబ్బు నేను తీయలేదు గాక తీయలేదు! అంతే!"

డిటెక్టివ్‌లు సాలోచనగా చూపులు మార్చుకొన్నారు.

జాన్ పెదవులు చప్పరించి అన్నాడు. "మిస్టర్ విష్ణుకాంత్, తొందరపడి మీ ఉద్యోగుల వ్యక్తిత్వాన్ని ఖూనీ చెయ్యకండి! మీకే నష్టం. ఏ సందర్భంలోనైనా యిదివరలో ఆమెపట్ల మీకు అపనమ్మక మేర్పడిందా? యెప్పుడైనా ఆమె అనుమానాస్పదంగా ప్రవర్తించిందా?...."

విష్ణుకాంత్ అడ్డంగా తలూపాడు. "లేదు, ఆమెని బాగా నమ్మాను. కానీ, యిప్పుడామె విశ్వాసఘాతం ఇలా కళ్ళముందు స్పష్టమవుతోంటే ఇంకా ఆత్మవంచన

చేసుకోమంటారా?"

"ఆమె డబ్బు తీసిందని మీకెలా తెలిసింది? ఎక్కడ నుంచి తీసింది?"

"నా సొరుగులోంచి.... రాత్రి ఈ డబ్బు ఆమె కళ్ళ ముందే సొరుగులో పెట్టి తాళం వేశాను. ఇప్పుడిక్కడికొచ్చి ఆ దృశ్యం చూసి కొయ్యబారి పోయాను. నా కుమారుడు—వినయ్—టేబిల్ మీద కూర్చొని వున్నాడు. అతని ముందు నోట్లు చిందరవందరగా పడి వున్నాయి. అతనితో సరళ వాదిస్తోంది. తేరుకొని నిలదీసి అడిగాను. తనకేమీ తెలియదంది. ఆ డబ్బు వినయ్ తీసినట్లు చెప్పింది. కానీ వినయ్ షెల్ఫులో ఆమె బ్యాగును చూపించి, అందులోంచి తీశానన్నాడు. వెంటనే నేను బ్యాగు తెరిచిచూశాను—అందులో సొరుగు తాళంచెవి దొరికింది!"

"కాబట్టి ఆమె తీసిందనుకుంటున్నారు...."

"నమ్మకంగా!"

"ఆ తాళంచెవి మీ రెప్పుడు పోగొట్టుకొన్నారు?"

"ఆమె బ్యాగులో చూసేవరకూ పోగొట్టుకొన్నట్టు తెలియలేదు!"

"అయితే రాత్రి యెవరో దొంగిలించి వుంటారు."

"ఎవరో కాదు—సరళ మాత్రమే."

"ఓహ్, అయితే ఆమె రాత్రి మీ ఇంటికి రహస్యంగా వచ్చిందంటారా?"

"ఆమెనే అడగండి!"

"అవసరం లేదు! రాత్రి ఆమె మీ యింటికి రాలేదు."

"మీకెలా తెలుసు?"

"నాకు తెలుసు. మీరొక మామూలు విషయం ఆలోచించలేరా? ఈ డబ్బు ఆమె దొంగిలించి వుంటే మీ ఆఫీసులోనే, మీ ముందు షెల్ఫులో ధైర్యంగా పెడుతుందా! నేరానికి పాల్పడ్డ వాళ్ళ అంతరంగమెలా వుంటుంది? తాళంచెవి రాత్రి దొంగిలించి వుంటే డబ్బు రిస్కు లేకుండా అప్పుడే తీయగలదు. ఆఫీసు తాళాలు ఆమె దగ్గరే వున్నట్టు మీకంటే ముందు ఆమె రాకనుబట్టి అర్ధమవుతోంది. మీ కుమారు డెక్కడ? అతనిక్కడెందు కొచ్చాడు? ఆమె బ్యాగు నెందుకు తెరిచాడు?"

విష్ణుకాంత్ చల్లబడ్డాడు. "అతన్నింటికి పంపేశాను. ఇక్కడ పోలీసుల ముందు జడుసుకుంటాడు—చిన్న పిల్లాడు. ఉదయం కొత్త బూట్లు కావాలని గొడవ చేస్తోంటే సుభాష్‌తో ఇక్కడికి పంపాను. వెనుక నేను వచ్చాను."

"సుభాష్ ఎవరు?"

"నా బావమరిది."

"వాళ్ళు వచ్చినప్పుడు ఈ గదిలో ఎవరున్నారు?"

"ఎవరూ లేరు," అంది సరళ. "నేను 9 గంటలకు ఆఫీసు తెరిచాను. బ్యాగు యెప్పటిలాగే షెల్ఫులో పెట్టి బయట అకౌంటెంట్‌తో మాట్లాడుతున్నాను—స్టాఫ్ రూంలో. ఇంతలో సుభాష్, వినయ్ వచ్చారు. ఇద్దరూ చాలాసేపు యీ గదిలో వున్నారు. సుమారు అరగంట తర్వాత సుభాష్ గాభరాగా బయిటి కొచ్చి వెళ్ళిపోయాడు—"

"ఎందుకు?"

"తెలియదు. నేను పట్టించుకోలేదు. అతనంటే నా కిష్టంలేదు. అతని మాటలు, చేతలు నాకు నచ్చవు. ఒక

సారి నా చెయ్యి పట్టుకుంటే చెంప వాయించాను. అప్పటి నుంచీ నామీద కసిగా ఉంటున్నాడు."

జాన్ తలతిప్పి లాల్‌ని చూశాడు. లాల్ హేండ్ బ్యాగును పరిశీలిస్తున్నాడు.

విష్ణుకాంత్ ముఖం ఎర్రబడింది.

"ఈ విషయం నా కెందుకు చెప్పలేదు?" అన్నాడతను.

"ఇతరులకి చెప్పుకునే అలవాటు నాకు లేదు. ఎవర్ని యెలా ఆపుచేయాలో నాకు తెలుసు" అంది సరళ.

"అయితే అతనెందుకలా వెళ్ళిపోయాడు?" జాన్ అడిగాడు.

"ఏమో, తెలియదు! మళ్ళీ రాలేదు. అతను వెళ్ళిన కాస్సేపటికి నే నిక్కడకొచ్చి చూస్తే— టేబిల్ మీద వినయ్—డబ్బుతో—"

"నెవర్ మైండ్" జాన్ ఇన్‌స్పెక్టర్ వేపు తిరిగాడు, "వెల్, యీ సుభాష్ వ్యవహారం గురించి చెప్పే అవకాశం మీరామెకు యివ్వలేదనుకుంటాను....యింతకంటే స్పష్టంగా యేం తెలియాలి? మీరు తక్షణం సుభాష్‌ని ఎందుకు గాలించకూడదు?"

ఇన్‌స్పెక్టరిద్దరూ మొఖాలు చూసుకున్నారు.

లాల్ చిన్నగా నవ్వి విష్ణుకాంత్‌ని చూశాడు.

"షటప్! మీరేమీ చెయ్యకండి! వెళ్ళండిక్కడ్నించి! ఈ పని వాడు చేసివుంటే వాడి సంగతి నేను చూస్తాను. ప్లీజ్! గెటవుట్! జరిగిందానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. అయాం సారీ, సరళా! ముందూ వెనుకా ఆలోచించలేదు నేను—అయాం వెరీ సారీ!"

"యూ డర్టీ చీట్! యెవర్నిరా దొంగ అంటు

న్నావు?"

ఒక లావుగా, పొట్టిగా వున్న యువకుడు బిగ్గరగా అరిచి లోనికొచ్చాడు విసురుగా.

## 3

అందరూ ఉలికిపడి అతన్ని చూశారు. అతనికి 30 యేళ్ళుంటాయి. తెల్లగా దృఢంగా వున్నాడు. దానికి తోడు కట్టలు తెంచుకొంటున్న ఆవేశం. అతని పిడికిళ్లు గట్టిగా బిగుసుకొని ఉద్రేకంతో విపరీతంగా కంపిస్తున్నాయి.

సరళ అతన్ని చూసి నోరు తెరిచి అరవబోయింది.

అతను విష్ణుకాంత్ దగ్గరకొచ్చి కళ్ళలో నిప్పులు కురిపిస్తూ మళ్ళీ అర్చాడు.

"ఎవర్నిరా దొంగ అంటున్నావు, యూ చీట్! నువ్వు దొంగవి! మోసగాడివి! నీ కంపెనీ ఫ్రాడ్! దగాకోరు! జనాన్ని నిలువునా దోచేస్తున్నావు! నువ్వు నా భార్యని దొంగంటావా? నిన్ను—నిన్నేం చేస్తానో చూడు!"

అతను ఛటుక్కున ముందుకు జరిగి విష్ణుకాంత్ కంఠం పుచ్చుకొన్నాడు.

సరళ కెవ్వుమనర్చింది. ఇన్స్పెక్టర్లు అతన్ని వెనక్కి లాగారు.

"నో! నిన్ను వదలను! నీ అంతు చూస్తాను! నీ కుటుంబంలో ఒక్కొక్కర్ని కౌబాయ్ హీరోలా నాశనం చేస్తాను! సవాల్! ఇదే సుధాకర్ శపథం!"

"షటప్! షటప్ ఐ సే!" జాన్ అర్చాడు, కల్పించుకొని, "మీ రెవరిముందు బెదిరిస్తున్నారో తెలుసా? ఇక్కడిద్దరిన్స్పెక్టర్లున్నారు!"

"ఓహ్, వీళ్ళేం చేస్తారు! నా శపథం నెరవేరాక నేనే వీళ్ళను పిలుస్తాను!"

"మీరు పిచ్చిగా అరుస్తున్నారు! నోర్మూసుకోండి!" సరళ వారించింది.

"ఇన్స్పెక్టర్! మీరతని బెదిరింపు విన్నారు. ఇంకా చూస్తారేమిటి? వెంటనే అరెస్టు చేయండి!"

ఇన్స్పెక్టర్లు తికమకపడి, సుధాకర్ రెక్కలు విరిచి పట్టుకొన్నారు.

"లాల్! ఆయన్ను విడిపించండి! ఆయన యేమీ చెయ్యడు! ఆయన ఆవేశం అలాటిది! ఉద్రేకం తప్ప ఆయనకే ఉద్దేశం లేదు! ప్లీజ్....విడిపించండి!" అంది సరళ ఆవేదనగా.

"అతన్ని వదలండి!" జాన్ ముందుకెళ్ళి అన్నాడు, "అతనేమీ చెయ్యడు. అతని అభిమాన హీరో నటించిన సన్నివేశాన్ని ప్రదర్శించి చూపుతున్నాడు. బడ్ స్పెన్సర్ యిలాగే చేస్తాడు....హాట్సాఫ్, మిస్టర్ సుధాకర్! మీ హీరో అతనేనా?"

"ఏమిటీ! నేను మరొకర్ని ఇమిటేట్ చేస్తున్నాన నుకుంటున్నారా? అయితే వేచిచూడండి! నా అడ్వెంచర్స్ మీ అంతుచిక్కవ్!" అర్చాడు గింజుకుంటూ.

"మిస్టర్! మీరింకేమీ చేయనవసరంలేదు. మీ బెదిరింపులకు సెక్షన్ 336 ఆహ్వానిస్తోంది. మూడు నెలలు జైల్లో మగ్గుదురుగాని- పదండి!" గుండూరావ్ గాండ్రించి అతన్ని ముందుకు తోశాడు.

సరళ ఈసారి బలహీనంగా అర్చింది.

అంతవరకూ సుధాకర్ ఉద్రేకాన్నీ, దుడుకుతనాన్నీ, అతని ప్రవర్తనలోని నాటకీయతనూ మౌనంగా గమని

స్టోన్న లాల్, అప్పుడు కల్పించుకొని అన్నాడు:

"ఇన్‌స్పెక్టర్, సుధాకర్‌ని వదిలిపెట్టండి. ఇలాటి పరిస్థితిలో యెవరైనా యిలాగే ప్రవర్తిస్తారు. కాకపోతే స్వభావాన్నిబట్టి ప్రవర్తన మారుతుంది. సుధాకర్‌కు ఉద్రేకం యెక్కువ. ఉద్రేకంలో అతనేం మాట్లాడుతున్నాడో తెలియదు. కానీ చల్లబడ్డాక యిలా ప్రవర్తించినందుకు విచారిస్తాడు. అంతేనా సుధాకర్?"

"నా భార్యను నిందించినవాడ్ని సహించను!"

"వెల్. మిస్టర్ వి. కాంత్ త్వరపడి మీ భార్యను నిందించారు. కానీ,తర్వాత క్షమాపణ చెప్పుకున్నారు...."

"క్షమాపణతో పరువు తిరిగిరాదు!"

"అలా అనుకొంటే పరువు నష్టం దావా వేయవచ్చు."

"పలుకుబడి, హోదా ఉన్న వాళ్ళమీద అది ఫలించదు!"

"అయితే ఏం చేస్తారు?"

"ఏం చేస్తానో ఆలోచిస్తాను!" అతను భార్య చెయ్యి పట్టిలాగాడు, "నడువ్!దగాకోరు కంపెనీల్లో ఉద్యోగాలిలాగే వుంటాయి!"

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక లాల్, వి. కాంత్‌తో అన్నాడు,"మీరు సుధాకర్‌గురించి భయపడుతున్నారా? ఇంతమందిలో—పోలీసుల ముందు బెదిరించిన వ్యక్తి ఏ అఘాయిత్యానికీ పూనుకోడు—మీరు నిశ్చింతగా ఉండండి. అతనిది వొట్టి బెదిరింపు మాత్రమే. యింటికెళ్ళాక అందుకతని భార్య అక్షింతలు వేస్తుంది. యేమంటారు?"

"కాని అతను నన్నూ, నా కంపెనీని ఎందుకలా దూషించాడు?"

"తమ కేదైనా నష్టం వాటిల్లితే మంచివాళ్ళు సైతం చెడ్డవాళ్ళుగా కన్పిస్తారు."

"సరే, సుధాకర్ గురించి నాకు తెలుసు. అతను పని చేసే ఆఫీసులో బాస్‌ని వొకసారి యిలాగే బెదిరించి ఉద్యోగం పోగొట్టుకున్నాడు. తర్వాత పశ్చాత్తాపంతో కాళ్ళు పట్టుకొని మళ్ళీ చేరాడు. మీ రతన్ని అరెస్టు కాకుండా కాపాడారనుకోకండి. మీరు లేకపోయినా అది జరిగేదికాదు. సుధాకర్ యెంత మొనగాడో నాకు బాగా తెలుసు!" అన్నాడు వి. కాంత్.

# 4

ఇంకే ఫిర్యాదులు రాకపోవడంతో గ్లోబ్ ఫైనాన్సింగ్ కంపెనీ వ్యవహారం యిక ముగిసినట్లేనని డిటెక్టివ్ లు మర్నాడుదయం పాత కేసుల్లో ముట్టవల్సిన ఫీజుల విషయమై ఆందోళనపడుతోండగా కృష్ణన్, క్రైమ్ బ్రాంచి ఇన్‌స్పెక్టర్, ఫోన్ చేసి వి. కాంత్ అనుకోని ప్రమాదానికి గురై మరణించాడని తెలియజేశాడు.

లాల్ కలవరం చెందాడు.

కృష్ణన్ వివరాలు చెపుతూ వి. కాంత్ సరిగ్గా 10 గంటలకు ఆఫీసు మెట్లెక్కుతూ జారి పడిపోయాడని అన్నాడు. స్టాఫ్ అతన్ని చూసి హార్టు ఫెయిల్యూర్ అనుకున్నారు. అతనికి కొన్ని నెలలుగా గుండె జబ్బు ఉంది.

అతను మెట్లెక్కుతున్నప్పుడు ఆ ప్రాంతాల ఎవరున్నారని ఆతృతగా అడిగాడు. అతను పూర్తిగా క్రిందికి పడ్డాక అప్పుడే వచ్చిన క్లర్కు ఆ ప్రాంతాల ఎవరినీ చూడలేదని కృష్ణన్ అన్నాడు.

లాల్ మళ్ళీ యెవరైనా గాభరాగా బయిటికొస్తుండగా చూశారా అనడిగాడు. లేదని కృష్ణన్ చెప్పాడు. అతను మెట్లెక్కుతున్నప్పు డక్కడెవరూ లేరు.... దాదాపు పూర్తిగా చేరుకొనే సమయంలో స్వయంగా దొర్లి పడ్డాడు.

క్రిందపడిన వెంటనే మూర్ఛపోయాడు-హాస్పిటల్‌లో చేర్చాక అరగంటలో ప్రాణం విడిచాడు. డాక్టర్ పరీక్షించి హార్టు ఫెయిల్యూర్ కాదనీ, విషప్రయోగం జరిగిందనీ అన్నాడు.

లాల్‌కు ఇదింకా ఆశ్చర్యం కలిగించింది. అతను ఉదయం యేం తిన్నాడు? టిఫిన్ చేశాడు. ఎన్నిగంటలకి? తొమ్మిది గంటలకి. ఇంటికి కబురు చేశారా?

ఇంట్లో యెవరూ లేరు. రను అనే అమ్మాయి మాత్రం రెస్పాన్సు యిచ్చింది. ఆమెకు వి. కాంత్ మరణం తెలియజేయలేదు. సీరియస్‌గా ఉన్నట్టు చెప్పారు. మృతుడి భార్య బయటికెళ్ళినట్టు ఆమె చెప్పింది.

లాల్ నిట్టూర్చి, ఇంటి అడ్రసు తెలుసుకొని ఫోను పెట్టేశాడు.

జాన్ వెంటనే సరళ యింటికి ఫోన్ చేసి సుధాకర్ ఎక్కడ వున్నాడని అడిగాడు. ఆఫీసులోనని చెప్పిందామె. ఆఫీసులో సుధాకర్ రెస్పాన్స్ ఇచ్చాడు.

"హలో, జాన్! ఏమిటి విషయం?"

"మీ శపథం—కాదు—మీ రనుకున్నట్టే జరిగింది!—"

"ఓహ్, ఏం జరిగింది?"

"మీకు తెలియదా? నిన్నటి బెదిరింపు—ఇవాళ వి. కాంత్‌కి విషం యిచ్చారు. అతను ఆఫీసు మెట్లెక్కుతూ

పడిపోయి చనిపోయాడు."

ఒక్క క్షణం నిశ్శబ్దం. "నో జాన్! పొరబడ్డారు! నే నతనికి విషం ఇవ్వలేదు! అతనికి గుండెజబ్బు ఉంది! అతను మెట్లెక్కి వస్తున్నప్పుడు నేనే గుండెలు మీద బాది నెట్టేశాను! అతను దొర్లిపడి చచ్చిపోయాడు! అలా చంపాను! నా శపథం అలా నెరవేరింది!"

"షటప్!విషప్రయోగం జరిగింది-డాక్టర్ అన్నాడు" జాన్ అరిచాడు.

సుధాకర్ పకపక నవ్వాడు. "యూ ఆరే ఫూల్, మిస్టర్ జాన్! అయాం ష్యూర్!"

జాన్ రెచ్చిపోయి రిసీవర్ విసిరికొట్టాడు.

# 5

రమ తలుపుతీసి ఆశ్చర్యంగా చూసింది:

"మీరు—మీరు—లాల్ అండ్ జాన్ కదూ?"

"అవును, పరిచయం చేసుకొనే శ్రమ తప్పింది!" అన్నాడు లాల్.

ఆమె అయోమయంగా దారికడ్డం తొలిగి, తలుపు విశాలంగా తెరిచింది.

"రండి!....రండి!....మీరిలా రావడం...."

"ఇన్‌స్పెక్టర్ నీకు ఫోన్ చేశాడు, వి. కాంత్ గురించి. ఆయన నీకేమవుతాడు?"

ఉలికిపడిందామె. "ఏమీకాడు! అంకుల్ అని పిలుస్తాను. నేను—ఆయన—ఆయన కుమారుడికి ఆయాగా వుంటున్నాను."

జాన్ నవ్వాడు: "చాలా చిన్నవయసులో, పాపం."

లాల్ లోని కడుగువేశాడు. ఆమె సోఫా చూపించి, "కూర్చోండి!" అని వెనక్కి తిరిగి గట్టిగా అర్చింది.

"అవ్వా! త్వరగా రెండు బోర్నవీటా కలుపు!"

డిటెక్టివ్‌లు కూర్చున్నారు. వాళ్ళు తదేకంగా మార్చిమార్చి చూస్తున్న ఆమె ముఖంలో రంగులు వేగంగా మారిపోతున్నాయి. ఆమెకు పదిహేడేళ్లుంటాయి. ఊదా రంగు లంగా, అదే రంగు జాకెట్, పసుపురంగు వోణీలో ఆకర్షణీయంగా; అపరంజి బొమ్మలా వుంది.

"చెప్పండి, ఆయనకెలా వుంది?" అడిగిందామె ఘటుక్కున, "ఇంట్లో ఎవరూ లేరు—అంటీ బయటికెళ్ళింది."

"ఆయనచనిపోయాడు" అనేసి వూరుకున్నాడు లాల్.

ఆమె బలహీనంగా అర్చి క్రింద కూలబడింది.

"ఆయన చనిపోయారా! చని....ఓహ్, అవ్వా—ఓ అవ్వా—"

ఆమె ముఖం చేతుల్లో దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

లాల్ ఆమెని కాసేపు ఏడ్వనిచ్చాడు. ఆమె ముఖం మీద చేతులు తీసేసి, తల పైకెత్తాడు. కన్నీళ్ళతో ఆమె చెంపలు తడిసిపోయాయి.

"ముఖం తుడుచుకో, లేచి సోఫాలో కూర్చో. నువ్విక్కడెంతకాలం నుంచి వుంటున్నావు?"

ఆమె దుఃఖాన్నాపుకుంది. అయినా వెక్కిళ్లు తగ్గలేదు. ముఖం తుడుచుకొంటూ లేచి సోఫాలో కూర్చుని అంది:

"ఆరునెలల నుంచీ వుంటున్నాను. అంకుల్ నన్నెంతో అభిమానంగా చూస్తాడు. నాకిక్కడెవరూ లేరు. ఇంటర్ చదువుతున్నప్పుడు అన్నయ్యకు జంషెడ్‌పూర్‌లో ఉద్యోగం వచ్చింది. వెళ్ళిపోయాడు. నాకు చదువుమీద శ్రద్ధలేక పరీక్ష తప్పాను. అన్నయ్య వెంటనే వచ్చేయమన్నాడు.

"కానీ, ఇక్కడ అనుకోనిది జరిగింది....ఒకరోజు సాయంత్రం బస్సుకడ్డంగా వెళ్ళిన ఆరేళ్ళ అబ్బాయిని కాపాడి ఇంటికి తెచ్చాను—ఇదే ఇల్లు-ఆ పిల్లాడు వినయ్ బాబు. అతని తండ్రి నన్ను అభినందించి వివరాలడిగారు. నా పరిసిలి తెలుసుకొని ఆయన ఇక్కడే వుండి పొమ్మన్నారు—వినయ్ బాగోగులు చూసుకుంటూ.

"నేను అన్నయ్యకు వ్రాశాను. మంచి వాతావరణంలో, మంచిమనుషుల మధ్య వున్నంతవరకూ తన కభ్యంతరం లేదని సమ్మతం తెలియజేశాడు. నాకిక్కడ బాగానే వుంది—ఒక్క సుభాష్ విషయంలో తప్ప. వినయ్‌ను నేను రక్షించిన రోజునుంచి నన్ను ద్వేషిస్తున్నాడు. ఆ రోజు వినయ్ కోసం స్కూలు కెళ్ళక షికార్లు తిరిగినందుకు అంకుల్ అతన్ని బాగా తిట్టాడు—"

లాల్ ముందుకు వంగాడు, "అలాగే నిన్న గానీ, ఇవాళ ఉదయంగానీ తిట్టాడా?"

రమ తలూపింది. "అవును, ఆఫీసులో ఏదో డబ్బు విషయంగురించి బాగా కోప్పడ్డాడు—నిన్న రాత్రి. ఆయనకు గుండెజబ్బు వుంది. చాలా బలహీనం. ఉద్రేక పడకూడదు. రాత్రి ఆయన అంత ఉద్రేకపడినా అంటీ కలుగజేసుకోలేదు. పైగా తమ్ముడ్ని సమర్థించింది. ఆ ఉద్రేకంతోనే ఆయన గుండె అలసిపోయి...."

ఆమె కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి.

"ఆయన చావుకా్కరణం గుండెజబ్బు కాదు—విష ప్రయోగం."

"ఓహ్, ఏమిటీ!" రమ ఛెంగున లేచింది, "ఆయనకు విషం ఇచ్చారా? ఎవరు! ఎలా! ఆయన్ను చంపాలను కున్నంత దుర్మార్గులెవరున్నారు?"

"అది తెలుసుకోవడానికే వచ్చాం. ఉదయం ఆయన టిఫిన్ చేశాడా?"

"చేశారు___"

"ఏం తీసుకున్నాడు?"

"గోధుమరొట్టె, ఆమ్లెట్, కాఫీ."

"ఎవరిచ్చారు?"

"అందరికోసం నేనే టేబిల్ మీద సర్దాను."

"ఆయనతోబాటు ఎవరెవరు కూర్చున్నారు?"

"ఆంటీ, సుభాష్, వినయ్, అంతే."

"ఆంటీ పేరేమిటి?"

"రేణుక."

"ఆ గోడమీద ఫోటో ఆమెదేనా?"

"కాదు___ఆమె మొదటి భార్య. చనిపోయింది."

"ఐసీ, రేణుక రెండవ భార్యన్నమాట."

"అవును, ఆమె అంటే నా కిష్టంలేదు."

"వినయ్ ఎవరిబిడ్డ?"

"మొదటి భార్యకు కలిగాడు."

"ఆయన రెండవపెళ్ళి ఎప్పుడు చేసుకున్నాడు?"

"రెండేళ్ళయిందనుకుంటాను...."

"రేణుక ఎలాంటిది?"

"అంకుల్ గురించి ఆమె పట్టించుకోదు! ఎప్పుడూ పైన గదిలో కూర్చుని చదువుకుంటూ వుంటుంది. ఆమె డబ్బు కోసం పెళ్ళి చేసుకుంది....ఆ డబ్బు చేతికందే సమయం కోసం నిరీక్షిస్తూ కాలక్షేపం చేస్తోంది."

కిచెన్‌లో వంటవ్వ కేకేయడంతో రమ వెళ్ళి రెండు కప్పులతో తిరిగివచ్చింది.

డిటెక్టివ్‌లు కప్పులందుకొని పీల్చసాగారు.

"ఆంటీ ఇప్పుడెక్కడికి వెళ్ళింది?" లాల్ అడిగాడు.

"ఆమెకో ఫ్రెండ్ వున్నాడు. అతనితో షాపింగ్ కెళ్ళింది. సుభాష్ వినయ్‌ని స్కూలుకు తీసికెళ్లాడు. రాత్రి నుంచీ అతను చాలా కోపంగా, కసిగా వున్నాడు. ఉదయం టిఫిన్ చేస్తున్నప్పుడుకూడా అంకుల్‌ని క్రూరంగా చూశాడు—"

"అతనేం చేస్తుంటాడు?"

"ఏమీ చెయ్యడు. తిని తిరుగుతుంటాడు."

"రేణుకకు ఫ్రెండ్ వున్నట్లు అంకుల్‌కు తెలుసా?"

"తెలుసు—అతనిక్కడికి కొస్తుంటాడు."

లాల్ లేచాడు. "ఒకసారి డైనింగ్ రూం చూడాలి, ఎక్కడుంది?"

రమ తటపటాయించింది: "సుభాష్ ఆయనకు విషం ఇచ్చాడనుకుంటున్నారా? అవును! నేనూ అదే అనుకుంటున్నాను. ఆ అక్కాతమ్ముళ్ళను చూస్తోంటే ఏదో రోజున ఏదో ఘోరం తలపెడతారనిపించేది....ఇప్పుడదే జరిగింది! అంకుల్‌తో నా మనసులో మాట చెప్పాను. కానీ ఆయనకు ఆంటీ అంటే చాలా ఇష్టం. నేనిప్పుడు సుభాష్‌ని అనుమానిస్తున్నాను....దుర్మార్గుడు! వాడాపని చేస్తున్నప్పుడు నేనుగనుక చూసి వుంటేనా...."

పేలవంగా, పటుత్వంలేని ఆమె మాటలు వింటూ డిటెక్టివ్‌లు డైనింగ్ రూంలోకి నడిచారు.

అక్కడ కిటికీ వారగా టేబిల్ చుట్టూ నాలుగు కుర్చీలున్నాయి. టేబిల్ మీద నీళ్ళజగ్గు, గ్లాసులు తప్ప ఏమీ లేవు.

"సుభాష్ విషం ఎప్పుడు కలిపాడో అర్థంగావడం లేదు" అంది రమ మళ్ళీ, "నేనిక్కడ ప్లేటు సర్దేసి వెళ్ళి

పోయాను. అంకుల్ చూడకుండా కలిపాడేమో....ఆంటీ చూసినా వూరుకుంటుంది. వినయ్‌కేం తెలుసు?"

"కానీ రొట్టెలో ఎలా కలుపుతాడు? కాఫీలో కలిపి వుండాలి" అన్నాడు జాన్.

"రొట్టెకు ఆమ్లెట్ కాంబినేషన్ కాదు. రొట్టెలో ఆయనేం తీసుకున్నాడు?" లాల్ అడిగాడు.

"జామ్....జామ్...." అంది రమ.

"సీసా ఎక్కడుంది?"

ఆమె ఛటుక్కున షెల్ఫులోంచి ఒక సీసా తీసి చూపించింది.

"టట్! టట్! దాన్నెందుకు ముట్టుకున్నావు? సీసా ఎక్కడుందని అడిగాను—తీసివ్వమన్నానా? వేలిముద్రలు చెడిపోతాయి, పెట్టేసెయ్!" అర్చాడు లాల్.

ఆమె గాభరాగా దాన్ని టేబిల్‌మీద పెట్టేసింది.

లాల్ దాన్ని కర్చీఫ్‌లో అందుకొని చూశాడు. పైనాపిల్ జామ్. సీసాలో సగం వుంది. మూత విప్పి చూశాడు. తీయటి వాసన వేసింది. అసహజంగా ఏమీ కన్పించలేదు.

"అంకుల్‌తోబాటు దీన్నెవరు తీసుకున్నారు?"

"అంకుల్ ఒక్కడే. పైనాపిల్ అంటే ఆయనకిష్టం. వినయ్ పంచదారతో వెన్న పూసుకున్నాడు. వాళ్ళిద్దరు ఆవకాయ వేసుకున్నారు—స్వీటు ముట్టుకోరు."

"గోధుమరొట్టెలో ఆవకాయా?" జాన్ అడిగాడు.

"అవును, తిండి విషయంలో వాళ్లు అడవిమనుషులు."

లాల్ బాటిల్ టేబిల్‌మీద వుంచి అన్నాడు, "ప్లేటు కడిగేశారా?"

"అవును,"

"వెల్, విషం జామ్‌లోనో, కాఫీలోనో కల్సింది. లేక, ఈ రెంటిలోగాక ఆమ్లెట్‌లోనో, రొట్టెలోనో, వంటగదిలో తయారుచేస్తున్నప్పుడు కలిసివుండాలి—"

"వంటగదిలోనా! అయితే వంటవ్వ—"

"ఆగండి! ఆదేమిటి?" జాన్ అన్నాడు కిటికీలోంచి బయటికి చూస్తూ.

లాల్ దగ్గరికెళ్ళి చూశాడు.

"అక్కడ .... చిక్కుడు పొదులో .... సీసాలా మెరుస్తూ—ఓహ్—అది జామ్ బాటిల్!" జాన్ కిటికీలోంచి అవతలకి గెంతి, చిక్కుడుపొదులో సీసాను ఛటుక్కున అందుకోబోయి, చెయ్యి కొరుక్కుని, కర్చిఫ్‌తో చుట్టి పట్టుకున్నాడు.

"పార్ట్‌నర్! ఇందులో జామ్‌వుంది! పైనాపిల్ జామ్!"

రమ కొయ్యబారిపోయింది.

లాల్ సూర్యకాంతికి చెయ్యి అడ్డంపెట్టి వింతగా చూశాడు.

ఇంతలో ఒక్కసారగా బయట కాలింగ్ బెల్ మ్రోగింది.

# 6

"అబ్బబ్బబ్బ! .... ఎంతసేపిలా బెల్ నొక్కాలి? నే నొస్తే నిలబెట్టొద్దని నీకెన్నిసార్లు చెప్పాలి!" రేణుక లోనికి వచ్చి కసిరింది.

రమ కలవరంగా చుట్టూ చూసింది.

రేణుక వెనుక మరొక యువకుడొచ్చాడు. రేణుకకు 30 ఏళ్ళుంటాయి. సన్నగా, పొడుగ్గా, అధునాతనంగా వుంది. ఆమె చేతిలో ఏవో ప్యాకెట్లున్నాయి.

ఆమె డిటెక్టివ్‌లను ఒక్కక్షణం తేరిపార చూసి,

వెంటనే ముఖంలో చిరాకు దూరం చేసుకొని, ఒక్క సారిగా అర్చింది:

"లాల్ అండ్ జాన్! ఏమిటిలా వచ్చారు?"

జాన్ నవ్వాడు: "రండి.... మీతో మాట్లాడాలి."

"ఏం మాట్లాడాలి, మిస్టర్ జాన్?"

"చాలా మాట్లాడాలి. ఇట్స్ సాడ్ బిజినెస్, మాడమ్. మీ భర్త పోయారు."

"పోయారా....ఎక్కడికి?"

"ఆఫీసు మెట్లెక్కుతూ ఆయన క్రింద పడిపోయారు. హాస్పిటల్‌లో చేర్చేలోగా ప్రాణం విడిచారు. విష ప్రయోగం జరిగింది—విషప్రయోగం."

"విషప్రయోగమా!" రేణుక కెవ్వుమంది, "ఓహ్! ఏమిటి మీరంటున్నది? ఆయన చనిపోయారా!...." ఆమె చేతిలో ప్యాకెట్లు క్రిందపడ్డాయి. హఠాత్తుగా ముందుకు తూలిందామె.

ఆమె కళ్ళు మూతబడి, ఒక్క కుదుపుతో లాల్ భుజంమీద పడింది.

లాల్ నిలదొక్కుకొని, ఆమెను పట్టుకొని సోఫా దగ్గ రికి నడిపించి కూర్చోబెట్టాడు. రమ లోనికురికి మంచినీళ్ళు తెచ్చింది. రేణుక రెండు నిమిషాల తర్వాత నీరసంగా కళ్ళు తెరిచి చూసి, నీళ్ళు తాగింది.

"కుదుటపడింది, మాడమ్.... నేను మిమ్మల్ని అప్ సెట్ చేశాను" అన్నాడు జాన్, "మీ మనసు సున్నితమైనది. ఫరవాలేదు, గట్టిగా ఊపిరిపీల్చి వదలండి! ఆల్ రైట్, ఇక కోలుకుంటారు!" తలతిప్పి ఆ యువకుడ్ని చూసి అడి గాడు, "యువర్ గుడ్ నేమ్ ప్లీజ్?"

"స్వరాజ్—స్వరాజ్ సక్సేనా!" అన్నాడతను

కంగారుగా. "ఓహ్, రేణూ! అయాం వెరీసారీ.... నాకు ఎంతో బాధగా వుంది! ఈ వాతావరణం భరించలేను! నువ్వు కోలుకున్నాక కన్పిస్తాను.... వెళ్ళిపోతాను!"

అతను రివ్వుమని తిరిగి వేగంగా వెళ్ళిపోయాడు.

జాన్ చిన్నగా నవ్వాడు. "మీకంటే సున్నితమైన వాడు! మగవాళ్ళలో ఇంత సౌకుమార్యం సహించను! అదెంత ఎబ్బెట్టుగా, వికారంగా వుంటుంది!"

"స్వరాజ్ నాకంటే చిన్నవాడు" అంది రేణుక.

"ఓహ్, మీరు కోలుకున్నారా, మాడమ్? అయితే మాట్లాడుకుందాం. మీకంటే చిన్నవాడ్ని 'ఫ్రెండ్'గా ఎన్నుకోవడం అసహజంగా వుంటుందేమో?"

"స్నేహానికి చిన్నా పెద్దా వ్యత్యాసం లేదండీ బాబూ!"

"మీదెలాంటి స్నేహం?"

"మీరేం పసిగట్టారు?"

"ఇంకా ఏమీ లేదు. పసిగట్టాలని కుతూహలం. మీది స్నేహమేనా?"

రేణుక సూటిగా చూసింది, "స్నేహమని చెప్పినా స్త్రీ పురుషులమధ్య దాన్నెవరైనా అపార్థం జేసుకుంటారనికూడా చెప్తున్నాను" అని ఒకక్షణం ఆగి "ఆయన చనిపోయారుకదూ? మీ చేతుల్లో ఆ బాటిల్స్ ఏమిటి? పైనాపిల్ మీ కిష్టమా? పట్టుకెళ్ళండి మిస్టర్ జాన్. అభ్యంతరం లేదు!"

"జాన్ చిన్నగా నవ్వుతూ కర్చీఫ్‌లో వున్న బాటిల్‌ని టీపాయ్‌మీద పెట్టాడు.

"ముట్టుకోకండి! ఈ 'J' మార్క్ వున్న బాటిల్ చూశారా—దీన్ని నేను చిక్కడుపాదులో కనిపెట్టాను.

ఇందులో విషం కలిపి మీవారికి పెట్టారు. ఆయన టిఫిన్ పూర్తయాక ఈ బాటిల్‌ని బయటికి విసిరి, ఈ 'L' మార్కు వున్న కొత్త బాటిల్‌లో ఇదే మేరకు జామ్ తొలిగించి, 'J' స్థానంలో పెట్టారు."

"ఎవరు? ఎవరు పెట్టారు?" రేణుక అడిగింది ఛటుక్కున.

"వూహించండి! రాత్రి జరిగిన సంఘటన ప్రకారం మీ తమ్ముడికి గట్టి మోటివ్ వుంది. ఏమంటారు?"

"మిస్టర్ జాన్!" రేణుక అంది, లేచి నిలబడి. "నేను రాకముందు మీరిక్కడ చాలా విషయాలు తెలుసుకొని వుంటారు—రమ చెప్పింది. అవన్నీ మళ్ళీ ప్రస్తావించ దలచలేదు. క్లుప్తంగా చెప్తాను. నిన్న రాత్రి మావారు సుభాష్‌ని కోప్పడ్డారు, లేనిపోని నిందలు ఆ అమాయకుడి మీద వేశారు—నిజమే. వాడిలో పౌరుషము లేదనను. కానీ, బావగారిమీద ఆ కసితో వాడాపనికి ఒడిగట్టడని నేను చెప్తున్నాను. మీరు పూర్తిగా నమ్మి ఇక వెళ్ళిపొండి!"

"అయితే ఆ పని ఎవరు చేశారంటారు?" అన్నాడు జాన్, ఆమెను ఆపే ప్రయత్నం చేస్తూ. ఆమె తలెగరేసి వెళ్ళబోయింది. కానీ కాలింగ్ బెల్ మ్రోగడంతో ఆగిపోయింది.

రమ పరిగెత్తివెళ్ళి తలుపు తోసింది.

పోస్టల్ మెసెంజర్ తొంగిచూసి, "టెలిగ్రాం—" అన్నాడు.

రమ వెనక్కి తొలగి నిలబడిపోయింది. అతను లోనికొచ్చి రేణుక దగ్గరికెళ్ళాడు. ఆమె ఆత్రుతగా సంతకం పెట్టి టెలిగ్రాం అందుకుంది. పేస్టింగ్ చింపి, మడత

విప్పి చదివింది. ఆమె ముఖం రంగులు మారాయి.

"ఉమేష్!" అందామె ఒక్కసారిగా.

"అతనెవరు?" జాన్ అడిగాడు.

"ఉమేష్ మావారి మొదటి కుమారుడు. నా పెళ్ళయాక నామీద అలిగి వెళ్ళిపోయాడు.... వయసు అలాటిది. అప్పుడతనికి పంధొమ్మిదేళ్ళు. రెండేళ్ళు గడిచాయి.... ఇంటి ముఖం చూళ్ళేదు! తండ్రితో అతనికెప్పుడూ పడేదికాదు! అతని పోరు భరించలేక ఆయనే వెళ్ళగొట్టారు!"

"ఇప్పుడెక్కడున్నాడు?"

"ఈ టెలిగ్రాం బెంగుళూరు నుంచి ఇచ్చాడు. సాయంత్రం వస్తున్నాడట."

జాన్ టెలిగ్రాం అందుకొని పరిశీలించాడు.

"ఎందుకొస్తున్నాడు? తండ్రి రమ్మన్నాడా?"

"ఏమో, నాకు తెలియదు! అతను వెళ్ళడానికి కారకురాల్ని నేనే! నన్ను కష్టపెట్టడం ఇష్టంలేక అతన్ని వెళ్ళగొట్టారు."

"సవతితల్లిని పిల్లలు—అందునా ఎదిగిన పిల్లలు—సహించరు!"

రేణుక ముఖం ఎర్రబడింది. విసురుగా కదిలి వెళ్ళబోయింది.

"ఆగండి, మాడమ్" లాల్ అన్నాడు చివరికి, "మేం పూర్తిగా మీ తమ్ముడి మోటివ్ మీదే ఆధారపడదలచలేదు. మరికొందరి మోటివ్స్ పరిశీలించాలి—"

"పరిశీలించండి! సుధాకర్ వున్నాడు—అతను మా కుటుంబం మీద కత్తిగట్టినాడు!" రేణుక అంది అడ్డుతగిలి.

లాల్ నవ్వాడు, "ఈ విషయంలో అతనికి మొదటి గుర్తింపు ఇచ్చాం. అతని విషయం వదలండి! మీ గురించి

చెప్పండి: మీకు మోటివ్ వుందా"

ఆమె అసహనంగా అంది: "మావారి లాయర్‌ని కలవండి. ఆయన వీలునామా వ్రాశారు. అందులో మీకేదేనా మోటివ్ దొరికిందంటే అది నా దురదృష్టం. కానీ, నేరం రుజువు చెయ్యడానికి మోటివ్ ఒకటే ఆధారం కాదని మరువకండి!"

లాల్ నవ్వాడు, "మీ లాయరెవరు?"

"మిస్టర్ సంఘర్షన్ రెడ్డి" అనేసి నిరాటంకంగా కదిలి వెళ్ళిపోయింది రేణుక.

# 7

లాయర్ సంఘర్షన్ రెడ్డి వి. కాంత్ మరణంపట్ల విచారం వెలిబుచ్చి చెంపలు రుద్దుకున్నాడు. అతని చావుకి బాధ్యులైనవారిని చట్టం దృష్టికి తేవడానికి డిటెక్టివ్‌లతో సహకరించేందుకు అతను యెంత మాత్రమూ సందేహించకుండా వీలునామాలో అంశాల్ని వెల్లడి చేశాడు.

ఆ వీలునామా రెండేళ్ళ క్రితం—అంటే వి. కాంత్ రెండో పెళ్ళి చేసుకొన్న రెండు నెలల తర్వాత రిజిస్టర్ చేయించబడింది.

అతను యావదాస్తిని నాలుగు భాగాలుగా విభజించాడు. మొదటి మూడుభాగాలూ అతని రెండవభార్యకూ, ఇద్దరు కుమారులకు సమానంగా పంచాడు. మిగిలిన పదో వంతు విలువచేసే భాగం పదిహేనేళ్ళుగా నమ్మకంగా పని చేస్తున్న వంటవ్వాకు వ్రాశాడు.

అందులో క్లాజులూ, సబ్ క్లాజులూ చాలావున్నాయి. వాటిలో ముఖ్యమైనవి: తన మరణానంతరం తన భార్య ఒక సంవత్సర కాలం వైధవ్యం పాటించిన పక్షంలోనే

ఆమెకు చెందవల్సిన ఆ స్తికి హక్కుదారవుతుంది. ఈలోపు మరో పెళ్ళి చేసుకొన్నా, లేదా శారీరక సంబంధా లేర్పరచుకొన్నా అందుకు అనర్హురాలవుతుంది.

ఆమె అర్హతను నిర్ణయించడానికి కొన్ని రహస్యమైన ఏర్పాట్లు జరిగాయి. అవి రహస్యంగానే వుంటాయి.

మొదటి కుమారుడు కంపెనీ వ్యవహారాలకు పూర్తి అధిపతి కావడమేగాక తమ్ముడికి గార్డియన్ గా వ్యవహరిస్తాడు.

అయితే ఉమేష్ యిల్లు విడిచి వెళ్ళాక విల్లును సవరించలేదు. అతనిమీద తన కెలాటి ద్వేషం లేదనీ, అతనలా వెళ్ళడం అతని మంచికేనని, లోకజ్ఞానం, బాధ్యతలు గ్రహించి ప్రయోజకుడవుతాడనీ, అప్పుడు తప్పక తిరిగివస్తాడనీ వి. శాంత్ చెప్పినట్లు లాయర్ వివరించాడు.

"సరే—అతను చనిపోయాడు. ఇప్పుడున్న ఆ స్తుల విలువెంత?"

"సిరచరాసులు కలిపి 20 లక్షలు."

"థాంక్యూ వెరీమచ్!"

లాయర్ తో ఇంటర్వ్యూ ముగిశాక డిటెక్టివ్ లు ఆఫీసుకు చేరుకున్నారు.

"వెల్, పార్టనర్. ఇప్పుడు మోటివ్ తోస్తోందా?" అడిగాడు జాన్.

"సుభాష్ మోటివ్ అంత బలంగాలేదు, జాన్. అతను వివేకం లేనివాడనుకోను. ఘర్షణలో బావమీద ఎంత కసి పుట్టినా తెల్లారి విషంపెట్టి చంపేస్తే సులభంగా అనుమానితుడవుతాడు. అతనీ మాత్రం ఆలోచించలేని మూర్ఖుడనుకోను."

"సరే, రేణుక గురించి చెప్పు."

"ఆమెకు మోటివ్ వుంది. కానీ, రంగంలో దిగడాని కిది అనువైన అవకాశమేనా? దాని ఫలితం తమ్ము డనుభ విస్తాడని ఆమెకు తెలియదా? ఆమె తమ్ముడ్ని ఇరికించా లనుకునేంత కారణం కన్పించడంలేదు. వెల్, రమ చెప్పి నట్లు ఆమె భర్త చావుకోసం నిరీక్షిస్తోంది. ఎప్పుడో వచ్చే ఆ చావు కోసం, ఆ తర్వాత సంవత్సరంపాటు త్యాగం చేయవల్సిన స్వేచ్ఛకోసం, ఆమె తొందరపడా లనుకుంటే యింత మూర్ఖంగా ప్రవర్తించదు! ఆమె తెలివిగలది, జాన్. చాలా తెలివిగలది!"

"అయితే మోటివ్‌తోబాటు అవకాశం ఎవరికుంది?" జాన్ కసిరాడు.

"సుధాకర్—అతని గురించి ఆలోచించావా?"

"అతనో సైకో! ఏమాలోచించాలి?"

"అక్కడే పొరబడ్డాం! అతను మనల్నెలా ఫూల్స్ని చేస్తున్నాడో గమనించావా? ఆలోచించు! అతను వి. కాంత్ మీద కక్ష బూనాడు. అతనికి గుండెజబ్బు వుందని తెలుసు. అయితే అతని అంతు యెలా చూస్తాడు? గుండె జబ్బు వున్న అతన్ని మెట్లమీంచి దొర్లించా? లేక టిఫిన్‌లో విషం కలిపా? మైడియర్ పార్ట్‌నర్, అతను మొదటిది చెయ్యడు! ఎందుకో తెలుసా? పట్టుబడే అవ కాశం వుంది! అందుకే విషం యిచ్చి పరిణామాల కోసం ఎదురుచూడసాగాడు. ఇంతలో నువ్వు ఫోన్ చేసి వి. కాంత్ మెట్లమీంచి దొర్లాడన్నావు. విషప్రయోగంవల్ల చనిపోయాడన్నావు. అందుకతనేమన్నాడు? కాదు, అత నికి గుండెజబ్బు వుంది— నేనే మెట్లమీంచి నెట్టేశాను, చచ్చాడన్నాడు!

అర్థమవుతోందా? అప్పుడతని మాట లెవరు నమ్ముతారు? పిచ్చివాడనుకొంటారు! కక్ష బూనిన వ్యక్తి మరొకరి చేతిలో దుర్గతిపాలవడంతో ఆ ఘనకార్యం తనదేనని చెప్పుకొని తృప్తిచెందుతున్నా డనుకుంటారు! కానీ, వాస్తవానికి అతనే ఈ హత్యను ఒక పద్ధతిలో చేసి, దాన్ని తప్పించుకోవడానికి మరో పద్ధతిని బుకాయిస్తున్నట్లు ఎవరు తెలుసుకుంటారు జాన్!"

"గాడ్! దిసీజ్ టూ మచ్! యిప్పుడేం చెయ్యాలి?"

"ఉదయంనుంచీ అతని కదలికల్ని ట్రేస్ చెయ్యాలి. అతన్ని షాడో చెయ్యాలి. అతను శపథం చేశాడు. దాన్ని తప్పకుండా నెరవేర్చుకొంటాడు! అతన్ని జాగ్రత్తగా కనిపెట్టి రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవాలి!"

"వెల్, లాల్. అతను కౌబాయ్ అడ్వెంచర్స్‌కి పూనుకొంటే అదెంత కష్టసాధ్యమో నేను తెలియజేస్తాను!" జాన్ లేచి బయటికి నడిచాడు.

అదే సమయంలో పోలీస్ కెమిస్టు నుంచి ఫోన్ వచ్చింది.

"హలో, మిష్టర్ లాల్. మీరిచ్చిన రెండు బాటిల్స్‌లో 'J' మార్కు చేసినదాంట్లో విషం కనుక్కున్నాను! పచ్చగన్నేరు విత్తనాల పొడి."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "ఆర్యూ ష్యూర్?"

"ష్యూర్. 'L' మార్కు బాటిల్ స్వచ్ఛంగా వుంది."

"వేలిముద్రలకి పంపారా?"

"పంపాను. 'J' మీద లేవు; 'L' మీద అయిదు వేళ్ళముద్రలున్నాయి."

"థాంక్స్!" లాల్ రిసీవర్ పెట్టేసి అసహనంగా

పచార్లు చేశాడు. ఇంతలో ఇన్‌స్పెక్టర్ కృష్ణన్ రివ్వుమని దూసుకొచ్చి కూర్చున్నాడు. లాల్ అతన్ని ఎగాదిగా చూశాడు.

"యస్? యేం జరిగింది? యేం తెలుసుకొన్నారు?"

కృష్ణన్ పెదవులు చప్పరించాడు. "ఏమీ లేదు. చావు విషంవల్ల సంభవించింది. ఏ విషమన్నది ఎనాలిసస్‌లో తెలుస్తుంది. ఇంకేం చెప్పాలి?"

"విషం పచ్చగన్నేరు విత్తనాలపొడి, ఇన్‌స్పెక్టర్. విషం కలిపిన పదార్థం మా కెమిస్టుకి పంపి తెలుసుకొన్నాను."

"ఓహో గన్నేరు విత్తనాలవల్ల చస్తారా?"

"మోతాదు మించితే తప్పదు! 8 నుండి 10 గింజల వరకు ప్రమాదకరం. తీసుకొన్న ఒకటి, రెండు గంటల్లోగా చావు సంభవిస్తుంది."

"అయితే ఆ విత్తనాలెక్కడ నుంచి వచ్చాయి?"

"హతుడి యింట్లో గన్నేరు మొక్కలున్నాయో లేవో తెలియదు. అతని సెక్రటరీ యింట్లో కూడా చూడాలి. ఆమె భర్త అనుమానస్పదంగా వున్నాడు. జాన్ అతనిమీద నిఘా వున్నాడు. ఫోన్ చేస్తే మొక్కల గురించి చెప్తాను."

కృష్ణన్ లేచి బయటికి నడిచాడు.

అరగంట తర్వాత జాన్ ఫోను చేశాడు. సుధాకర్ ఉదయం 8-9 మధ్య యింట్లో లేడని చెప్పాడు. ఎక్కడికెళ్ళాడో తెలియదు. రాత్రంతా యిల్లు కదల్లేదు. సరిగ్గా పది గంటలకి ఆఫీసులో ఉన్నాడు. యింత వరకూ కదల్లేదు.

"ఓ. కే. జాన్! జామ్‌లో విషం పచ్చ గన్నేరు

గింజల పొడి. వి. క్రాంత్ యింట్లో ఎక్కడైనా గన్నేరు చెట్లు చూశావా? సరే సుధాకర్ యింట్లో చూడు........ సాయంత్రం ఉమేష్ వస్తున్నాడు. నేనతన్ని కలుసు కోవడాని కెళ్తున్నాను."

లాల్ ఫోను పెట్టేసి లేచాడు.

# 8

రమ తలుపుతీసి మళ్ళీ ఆశ్చర్యంగా చూసింది.

"ఉష్! మాట్లాడకు!" లాల్ వారించాడు, "రేణుక ఎక్కడుంది?"

రమ బెదురుతూ చూసింది, "పైన గదిలో చదువుకుం టోంది."

"ఇంట్లో ఇంకెవరున్నారు?"

"ఎవరూ లేరు. సుభాష్ వినయ్ కోసం స్కూలు కెళ్ళాడు."

"నువ్విక్కడే ఉండు. నేను రేణుకను చూస్తాను—"

"వద్దు! మిమ్మల్నిలా పంపినందుకామె తిడుతుంది!"

"తిట్టే అవస్థ యెవరికీ ఎల్లప్పుడూ ఉండదు!"

"అంటే?"

ఇంతలో పైన యెక్కడో ఫోను మ్రోగిన శబ్దమైంది.

"అంటే—నీ కర్థంగాదు! నన్నడక్కు—టైంలేదు!" లాల్ చకచకా కదిలి మెట్లెక్కసాగాడు. బూట్ల చప్పుడు కాకుండా జాగ్రత్తగా పైన గదుల్ని చూస్తూ, ఒక గది ముందాగిపోయాడు.

ఆ గదిలో రేణుక బెడ్ మీద బోర్లాపడుకొని ఉంది. తల బాతులా యెత్తి వుంచి ఫోన్లో మాట్లాడు తోంది....లాల్ ద్వారం ప్రక్కన నక్కి చెవులు రిక్కిం చాడు.

"....నాన్సెన్స్, స్వరాజ్! ఎందుకలా భయపడ్తావ్! నువ్వు పిరికివాడివై పోతున్నావు! ఏమీ కాదంటున్నాను. అరమైందా? యేమీ జరుగదు! నిర్భయంగా ఉండు! అవును....అంతా సవ్యంగానే ఉంది. డిటెక్టివ్ లిప్పుడిక్కడ లేరు!....యేమిటీ! ఓహ్, యూ సిల్లీ! నువ్వెంత భయస్తుడివి, డార్లింగ్! ఆ ఉత్తరా లెవరికీ దొరకవు! అండర్‌స్టాండ్! వాటి గురించి బెంగపడకు!....నా టేబిల్‌కో రహస్య అర ఉంది. అందులో దాచాను....పోలీసులు కనుక్కోలేరు. అయినా వాళ్ళెందుకు గాలిస్తారు?

"ఓహ్....నీకు మతిపోయింది! ప్రేమలేఖల్ని యెవరైనా తగులబెడ్తారా డియర్! పిచ్చి భయాలతో బుర్ర పాడుచేసుకోకు!....అలాగే .... అలాగే .... అలాగే.... యేమిటీ! సాయంత్రం వస్తావా? యూ స్టుపిడ్! రాకు! ఈ ఛాయలకి రాకూడదు—ఇక మనం చాలా జాగ్రత్త పడాలి....ఇదివరకటిలా కలుసుకోనే వీల్లేదు! ఆ విషయాలన్నీ మనం ముందే చర్చించుకున్నాం కదా?....ఓ.కే, పెట్టేస్తున్నాను."

ఆమె ఫోను పెట్టేసి నిట్టూర్పు విడిచింది. కొన్ని క్షణాలు కళ్ళు మూసుకొని నిశ్చలంగా వుండి, తర్వాత నవల అందుకోబోయింది—కాని ద్వారం దగ్గర లాల్‌ని చూసి ఛెంగున ఎగిరి నిలబడింది.

"మిస్టర్ లాల్!" ఆమె ముఖం కోపంతో యెర్రబడింది. చరచర దగ్గరి కొచ్చి ఎగాదిగా చూసింది, "డామిట్! ఐ డోంట్ లైకిట్! మీరు నా గదిలో తొంగి చూడ్డం—రహస్యంగా నా మాటలు వినడం—మిమ్మల్ని అసలు లోని కెవరు రానిచ్చారు?"

"నేనే వచ్చాను. అఫ్‌కోర్స్, రమ అభ్యంతరం చెప్పింది—" అన్నాడు లాల్ ప్రశాంతంగా, "మీ ఫోన్ సంభాషణలో నాకేం ఆసక్తి లేదు—అది నేను వూహించిందే. ఇక మీ గదిలో చూడ్డమంటారా—దొంగచాటుగా అందాల్ని గమనించే అలవాటు నాకు లేదు!.... నేను విల్లు గురించి తెలుసుకున్నాను. మీకు మోటివ్ ఉంది. అంతేకాదు, దానితోబాటు అవకాశం కూడా ఉంది."

ఆమె చురచుర చూసింది. "ఏమిటి మీ రనేది?—నాన్సెన్సెక్కడో!"

"యూ సీ మాడమ్. ఈ హత్యలో ఇంతవరకూ మేం యిరువురినే అనుమానించాం. మీ తమ్ముడు—సుధాకర్. మిమ్మల్ని అనుమానించడానికి మనస్కరించలేదు. మీ ప్రయోజనాలకోసం స్వంత తమ్ముడ్ని ఇరకాటంలో పెట్టే పరిస్థితిని ఎన్నుకోరనుకున్నాం—"

"మరి యిప్పుడేమనుకుంటున్నారు?"

"మీలో వొకరు ఆ పని చేశారు!" అన్నాడు లాల్ నిశ్చయంగా, "మీరు లేదా, మీ తమ్ముడు. మీ తమ్ముడి కంటే అవకాశం మీకే చక్కగా ఉంది.

"మీరేనాడూ భర్తను ప్రేమించలేదు. అతని డబ్బుని ప్రేమించారు. అతని కళ్ళముందే మరొకరితో తిరుగుతున్నారు. అఫ్‌కోర్స్, మీ భర్త అభ్యంతరం పెట్టి ఉండవచ్చు. విల్లు గురించి హెచ్చరించి ఉండవచ్చు—మీ ప్రవర్తన మారని పక్షంలో ఆస్తికి మీ హక్కుల్ని మరింత కఠినతరం చేయగలనని. ఆ విల్లు గురించి మీకు తెలుసు. అక్కడికే అది మీ స్వేచ్ఛకు చాలా భంగం కల్గించింది, ఇప్పుడతను బెదిరిస్తున్నాడు....అయినా మీ

ప్రవర్తన మారలేదు. మీ చపల తత్వం అలాంటిది.

"అందుకే అతను విల్లును తిరిగి సవరించే లోపున ఏదో వొకటి చెయ్యాలనుకున్నారు—దానివల్ల మీరు త్యాగం చేయవల్సిన సేచ్ఛాకాలం కూడా కలిసివస్తుంది....

"వెల్, ఆ అవకాశం నిన్న లభించింది. సుధాకర్ శపథం చేశాడు. అది వొట్టి శపథమేనని మీకు తెలుసు. అతను ఉద్రిక్తస్థితిలో అలా బెదిరించాడుగానీ, వాస్తవానికి కతనికా ఉద్దేశం లేదు. పైగా అతను పోలీసుల ముందు శపథం చేశాడు. దీన్ని మీరు తెరగా ఉపయోగించి మీ ప్రయోజనాలు సాధించుకొని, అతన్ని బలిపశువుని చెయ్యాలనుకున్నారు—"

"నేనలా అనుకోలేదు!"

"అలా అనుకొని మీరు స్వరాజ్‌తో చర్చించారు. అతను వెంటనే అంగీకరించాడు....నిన్న సాయంత్రం అతను గన్నేరు గింజల పొడి తెచ్చి ఇచ్చాడు. ఉదయం మీరు జామ్‌లో కలిపి, మీ భర్త వెళ్ళాక సీసాలు మార్చేసారు. ఆ స్వాతంత్ర్యం మీకుంది."

ఆమె విస్తుపోయి చూసింది.

లాల్ విసురుగా కదిలి బయటికొచ్చేశాడు.

## 9

అప్పుడే సుభాష్ వినయ్‌తో లోనికొస్తూ కన్పించాడు. లాల్‌ని చూసి అతను తలవంచుకొని గబగబ పైకి పోయాడు.

హాల్లో ఫోను మ్రోగుతోంది. లాల్ వెళ్ళి రిసీవర్ ఎత్తాడు.

"హలో, లాల్!"

"యస్! జాన్!"

"సుధాకర్ యింట్లో గన్నేరు చెట్టు వుంది—పచ్చ గన్నేరు."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "అతని గురించి ఏం తెలుసుకున్నావు?"

"అతను నిన్న సాయంత్రంనుంచీ మర్నాడు ఉదయం ఎనిమిది గంటలవరకూ యిల్లు కదల్లేదు. ఎనిమిది నుండి తొమ్మిదిగంటలవరకు—"

"ఎక్కడ ఉన్నాడు?"

"బార్బర్ షాపులో—అతని క్రాఫు చూసి అనుమానంతో ఆరాతీశాను. రూఢి అయింది. తొమ్మిది గంటలకి క్షవరం చేయించుకొని యింటికి వచ్చాడు. పది గంటలకి ఆఫీసుకెళ్ళాడు—ఇంతవరకూ కదల్లేదు."

లాల్ టైము చూశాడు. సరిగ్గా 4-49.

"వెల్, అతన్ని కనిపెడతావా?"

"ఆఫీసు వదిలాక యెక్కడికెళ్తాడో చూస్తాను. ఉమేష్ వచ్చాడా?"

"ఇంకా లేదు—" అని లాల్ రేణుక యాంగిల్ వివరించి చెప్పాడు.

"ఓహ్! యూ ఆర్ డామ్ కరెక్టు! అయితే యేం చేస్తున్నావు?" అన్నాడు జాన్.

"మెటీరియల్ ఎవిడెన్స్ గురించీ ఆలోచిస్తున్నాను. ....ఇంకేవైనా క్లూస్ దొరుకుతాయేమో చూస్తున్నాను. ఇది పూర్తిగా లాజికల్ వ్యవహారం."

"అవును...."

"సుధాకర్ కోసం యింత సమయం వెచ్చిస్తున్నాం కాబట్టి అతని ఎలిబీని త్వరణ్నంగా చెక్ చెయ్యాలి. బార్బర్ షాపులో యెంత సమయం గడిపాడో, ఇంటికి

రాకపోక లెంత సమయం తీసుకున్నాయో తెలుసుకోవాలి."

"అలాగే....ఎలిబీ కోసం గ్రాఫు చేయించుకున్నాడంటావా?"

"అతను మనల్ని యే ఉద్దేశంతో పూల్స్ అన్నాడో తెలుసుకోవాలి."

లాల్ రిసీవర్ పెట్టేసి సిగరెట్ వెల్గించాడు.

రమ హాల్లోకి వచ్చి లాల్‌ని కాఫీకి రమ్మంది. లాల్ ఆమెతో డ్రాయింగ్ రూంలోకి అనుసరించాడు. అక్కడ అప్పటికే రేణుక వుంది. ఆమె ఎదురుగా వినయ్ వున్నాడు. సుభాష్ ఇంకా రాలేదు. రమ అతన్ని పిలువడానికెళ్ళింది.

లాల్, రేణుక ముఖంలోకి తదేకంగా చూశాడు.

ఆమె ముఖంలో ఎలాంటి భావాలూ లేవు. టీపాయ్ మీద కప్పుల్ని పరధ్యానంగా చూస్తూ కూర్చుంది. సుభాష్ వచ్చాక అతన్నిచూసి తేరుకొంది. ఇద్దరూ ఒకర్నొకరు చాటుగా చూసుకొని ముఖాలు తిప్పుకున్నారు. లాల్ కప్పు అందుకొని త్రాగడం ప్రారంభించాడు.

"మీరిద్దరూ ఎంత కృతజ్ఞతగలవారో తెలుస్తోంది! మార్చ్యురీలో మీ భర్త దిక్కులేకుండా పడివుంటే, మీరిక్కడ నవలలు చదువుతూ, ఫోన్‌లో సూచనలిస్తూ చాలా చక్కగా కాలక్షేపం చేస్తున్నారు" అన్నాడు లాల్ కప్పు క్రింద పెడుతూ.

రేణుక బాధగా నవ్వింది, "మీరర్థం జేసుకోలేరు, లాల్. ఈ రోజు ఉమేష్ వస్తున్నాడు. ఎన్నో ఆశలు పెట్టుకొని, ఎంతో ఉత్సాహంతో, చాలారోజుల తర్వాత వస్తున్నాడు....అవునా? ఆ క్షణాన అతనికి తండ్రి మృత

దేహంతో స్వాగతం చెప్పడం ఎంత ఘోరంగా వుంటుంది! ఆలోచించండి! నేనింకా అతన్ని గాయపర్చలేను! అతని బాధల్ని సహించలేను!"

"అవును, మీది చాలా సున్నిత మన స్తత్వం."

"నేను స్వప్నజీవిని. పుస్తకాలే నా ప్రపంచం. వాస్తవ జీవితంలోని చేదునిజాల్ని అంగీకరించలేను— ఎస్కేపిస్ట్‌ని. మనల్ని రాచి రంపాన పెట్టే కఠోర సమస్యల నుంచి దూరంగా పారిపోయి—తీయటి కలల్లో— అదో లోకంలో విహరించడం ఎంత హాయిగా వుంటుంది! మనసు ఎంత ఉల్లాసం పొందుతుంది!"

"అది ఉల్లాసం కాదు, మానసిక రుగ్మత. ఉల్లాసం వాస్తవానుభవాల్లోనే వుంది."

ఆమె నవ్వింది, "చేతినిండా పనులున్న వాళ్ళు చెప్పే మాటలివే. నాకేమీ పనిలేదు, కలలుగనడం తప్ప. కలలుగనడం తప్పుకాదు, వాటిని నిజం చేసుకొనే శక్తి లేకపోతే అది బలహీనత కింద మారుతుంది. నాకా శక్తి వుంది. నేను సాధిస్తాను. నా జీవితాశల్ని నెరవేర్చుకుంటాను. ఏమంటారు?"

"మీరు చాలా నిష్కపటంగా మాట్లాడతారు!"

"నాకు తెలుసు, మీరు నన్ను గాయపర్చాలని చూస్తున్నారు. ఉదయంనుంచీ చూస్తున్నాను, మీ గేలి చేసే ధోరణి మారడంలేదు!"

లాల్ నవ్వాడు, "స్వప్నజీవుల స్వభావం మీరు స్వానుభవంతో చెప్పారుగా — వాస్తవాన్నంగీకరించలేరని! కాఫీ తాగండి, చల్లారుతోంది."

ఆమె అదోలా నవ్వింది: ఆ నవ్వులో తన్ను అర్థంజేసుకొనే మేధావి లేడన్న భావం వుంది. ఆమె వంగి కప్పు

అందుకోబోయింది—అప్పుడే కాలింగ్ బెల్ మ్రోగింది.

"ఎవరు?" అంది రేణుక.

"ఉమేష్ కావచ్చు" అన్నాడు లాల్.

"రమా!" రేణుక పిల్చింది, "రమా! వెళ్ళి తలుపు తీయ్!"

లాల్ టైము చూశాడు: సరిగ్గా 5.00 గంటలైంది. ఇంకా తలుపుతీసిన చప్పుడు లేదు. మరోసారి బెల్ మ్రోగింది.

రేణుక మళ్ళీ రమను పిల్చింది: సమాధానం లేదు.

"ఓహ్, ఎక్కడికెళ్ళింది సుభాష్, నువ్వెళ్ళి తీయ్!"

సుభాష్ కాఫీ పూర్తిచేసి వెళ్ళాడు. కాస్సేపయ్యాక తలుపు తీసిన శబ్దమూ, మాటలూ విన్పించాయి. మరి కాసేపటికి డ్రాయింగ్ రూం ద్వారంలో ఒక యువకుడు ప్రత్యక్షమయ్యాడు.

అతను సన్నగా, పొడుగ్గా వున్నాడు. తెల్లటి వర్ణం. కోల మొఖం. చెవులమీదకి పడుతున్న జుత్తు. అతని నల్లటి కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి.

అతను సూట్ కేసు క్రింద పడేసి రెండు చేతులూ పైకెత్తాడు:

"హాయ్ పిన్నీ!"

"ఉమేష్!...." రేణుక గొంతు వొణికింది.

అతను ఒక్క మాకులో ఆమె దగ్గరికొచ్చాడు.

"ఓహ్, పిన్నీ! నన్ను క్షమించు!-నన్ను క్షమించవా?"

"నువ్వింక బాధపడకు, ఉమేష్! అంతా ఇక మర్చిపో! నువ్వు తిరిగి వచ్చినందుకు సంతోషంగా వుంది!"

"అప్పుడు నిన్నెంత బాధపెట్టాను, పిన్నీ!"

"అప్పుడు నువ్వు చిన్న పిల్లాడివి, బాబూ! ఇప్పుడు

పెద్దవాడివి, అన్నీ అర్థం జేసుకోగలవు!"

"నువ్వెంత మంచిదానివి పిన్నీ! నన్ను అసహ్యించుకొంటా వనుకొన్నాను!"

"లేదు, ఉమేష్! నిన్నింకా గాయపర్చను. బాధ పెట్టను!"

కొన్ని క్షణాలయ్యాక ఉమేష్ షర్టు అంచుతో కళ్ళు తుడుచుకొని అందర్నీ చూశాడు. లాల్ ప్రక్కన తమ్ముడ్ని చూసి ముందుకు దూకాడు.

"విన్నూ! ఎంత ఎదిగిపోయావురా! ఎలా వున్నావ్?"

వినయ్ లేచి నిలబడి రెండు చేతులూ జాపాడు. ఉమేష్ అతన్నెత్తుకొని ముద్దాడాడు.

"నన్ను మర్చిపోయావా?....నువ్వు జ్ఞాపకంరాని క్షణం లేదు! నిన్నుకూడా ఎత్తుకొచ్చేయాల్సిందనుకొనే వాడ్ని!"

రేణుక ఫకాలుమని నవ్వింది. ఉమేష్ తమ్ముడ్ని దింపి ఆమె పక్కన కూలబడ్డాడు.

"ఓహ్—కాఫీ తెప్పిస్తాను—" అంది రేణుక.

"డాడీ ఎలా వున్నాడు పిన్నీ?"

రేణుక ఉలికిపడింది. తటపటాయిస్తూ లాల్ని చూసింది. లాల్ తల త్రిప్పుకున్నాడు.

"నీ డాడీ....ఆయన గురించి భయపడ్తున్నావా?" జాగ్రత్తగా అడిగింది రేణుక.

"భయంకాదు—ఆరోగ్యం ఎలా వుంది?"

"దానికేం? బాగానే వుంది!"

"లేదు, గుండె ట్రబుల్ ఇస్తోందని లెటర్ వ్రాశాడు పిన్నీ!"

రేణుక ఆశ్చర్యంగా చూసింది, "లెటర్ వ్రాశారా? ఎప్పుడు?"

"నెలరోజులైంది.... అందుకే నే నిక్కడి కొచ్చాను. జరిగింది మర్చిపోయి యింటికి రమ్మన్నాడు. ఆయన జబ్బు తీవ్రమయేట్టుందిట—ఇహ బాధ్యతలు నన్ను తీసుకోమని వ్రాశాడు. ఆయన ఉత్తరం చదివాక ఆతృత ఆపుకో లేకపోయాను పిన్నీ! అలాగే వస్తానని వ్రాశాను.... అక్కడ ఉద్యోగం మధ్యలో వదల్లేను. జీతం తీసుకొని వస్తానని వ్రాశాను.... నిన్న మూడో తారీఖున టెలిగ్రాం యిచ్చాను. అందలేదా?"

"అందింది—" రేణుక మళ్ళీ రమను పిల్చి కాఫీ తెమ్మంది. "కానీ నువ్వక్కడ వున్నట్టు ఆయన కెలా తెలుసు?"

"ఇక్కడ నా ఫ్రెండ్‌కో ఉత్తరం వ్రాశాను. వాడు వెళ్ళి డాడీకి అడ్రసు ఇచ్చి వుంటాడు...."

"నువ్వక్కడేం చేసేవాడివి ఉమేష్?"

"చాలా వూళ్ళు తిరిగాను, పిన్నీ. ఎక్కడా సరైన ఉద్యోగం లేదు.... వెళ్ళిన మొదట్లో మూడు నెలలు తిండి లేదు. నిద్రలేదు. హోటల్‌లో పని చేశాను. కుదరలేదు. మిల్లులో బస్తాలు మోసాను. గ్యారేజిలో కార్లు బాగు చేశాను. బట్టలషాపులోనూ పని చేశాను. కానీ—వాళ్ళు చెయ్యని దొంగతనం మోపి తరిమేశారు—"

"ఉమేష్! చెప్పకు! ఇక చెప్పకు!"

రేణుక భారంగా నిట్టూర్చింది.

"ఈ రమ యెక్కడ చచ్చింది? ఎన్నిసార్లు పిల్చినా పలకదేం?"

"దాని సంగతి నేను చూస్తాను!" సుభాష్ లేచి వెళ్ళాడు.

"నా కాఫీ చల్లారింది—నా కూడా తెమ్మను!"

అంది రేణుక.

ఆ తర్వాత ఉలికిపడి ఉమేష్‌ని లాల్‌కు పరిచయం చేసింది.

"పోలీసులూ, డిటెక్టివ్‌లూ నాకు నచ్చరు! ఈ రెండేళ్ళూ అడుగడుగునా నేను వాళ్ళతో చాలా విసిగి పోయాను!" అన్నాడు ఉమేష్.

లాల్ నవ్వుతూ లేచాడు, "నువ్వు చాలా దూరం ప్రయాణించి వచ్చావు. నిన్ను విసిగించను. ఇప్పటికే యిక్కడ చాలామందిని విసిగించాను. డోంట్ బాదర్. రిలాక్స్ మైబాయ్!"

# 10

"రమ ఎక్కడికెళ్ళిందో తెలియడంలేదు!" అన్నాడు సుభాష్.

"ఎక్కడికెళ్ళింది?" లాల్ అడిగాడు.

"పదినిమిషాల క్రితంవరకూ కిచెన్‌లోనే వుందని అవ్వ చెప్పింది. యిల్లంతా గాలించాను....యెక్కడా లేదు!"

"బయటికెళ్ళిందా?"

"బయటికెళితే చెప్పకుండా వెళ్ళదు!"

"అయితే ఎక్కడికెళ్ళింది?"

"డామిట్! నాకెందుకు, బాస్?" సుభాష్ విసురుగా వెళ్ళిపోయాడు.

ఇంతలో వంటవ్వ కాఫీ కప్పులతో డ్రాయింగ్ రూంలో కెళుతూ కన్పించింది. లాల్ ఆమె నాపాడు. "రమ ఎక్కడికెళ్ళింది?"

"అదే తెలియడంలేదు! మొదటిసారి కాఫీ లందించి నా దగ్గరికొచ్చింది. ఏదో మాట్లాడుతూ హఠాత్తుగా బయటికెళ్ళిపోయింది" అందామె.

"ఎటు?"

"నేను చూడలేదు....ఇలా హాల్లోకి వచ్చింది."

"కంగారుగా వుందా?"

"నే నామె ముఖం చూడలేదు...."

ఆమె వెళ్ళిపోయాక లాల్ సాలోచనగా రమ గది దగ్గరికెళ్ళాడు. గడియపెట్టబడి ఉంది. లాగి లోనికెళ్ళాడు. ఓసారి చుట్టూ చూసి, ఆమె దుస్తులకోసం గాలించాడు. బీరువాలో అవి భద్రంగా ఉన్నాయి. బీరువా అరలన్నీ గబగబా సోదా చేశాడు. పై అరలో బట్టలు, రెండో అరలో టాయిలెట్ వస్తువులు, మూడో అరలో చిందర వందరగా కాయితాలూ ఉన్నాయి.

లాల్ ఆ కాయితాల్ని కెలుకుతూ చూడసాగాడు. వాటిలో వివిధ శాస్త్రీయ విషయాలకు చెందిన పేపర్ కటింగ్స్, కొందరు సినీతారల ఆటోగ్రాఫులు, కొన్ని కలం స్నేహితుల ఉత్తరాలు, మూడు ఆకర్షణీయమైన కవర్లు ఉన్నాయి....

లాల్ ఆ కవర్లని పరిశీలించాడు. మూడింటి మీదా రమ చిరునామా ఒకే దస్తూరీలో ఉంది. అన్నీ హిమాయత్ నగర్ నుంచి పోస్టు చేయబడ్డాయి. పంపినవారి అడ్రసు లేదు.

లాల్ కవర్లలోంచి కార్డుల్ని బయటికి లాగాడు. జపాన్ ఫ్లవర్స్ గ్రీటింగ్ కార్డులు. ఆకర్షణీయంగా వున్నాయి. అవి యే సందర్భంగా పంపబడ్డాయో లాల్ తేదీల్ని చూశాడు. పోస్టల్ ముద్రలు వారానికో కవరు పంపినట్టు తెలియజేస్తున్నాయి. చివరి కవరు మొన్న అందింది.

లాల్ కార్డుని తిప్పి చూశాడు. వెనుక అదే దస్తూ

రీలో అక్షరాలు కన్పించాయి. మొదటి కార్డుమీద బుధ వారం సాయంత్రం 5-30, పబ్లిక్ గార్డెన్స్ అని; రెండవ కార్డుమీద మంగళవారం మధ్యాహ్నం 3-00, సెల్లింగ్ అని; మూడవ కార్డుమీద సోమవారం సాయంత్రం6-00; కంపాలా అనీ ఉన్నాయి. ఈ చివరి కార్డు మొన్న శని వారం అందింది. నిన్న సోమవారం. కార్డులన్నిటిమీా వా జైపాల్ అని సంతకముంది.

లాల్ వాటిని మడిచి జేబులో పెట్టుకొని గదిలో మరోసారి చుట్టూ చూశాడు. ఈసారి మంచంక్రింద ఆమె చెప్పులు కన్పించాయి. ఇంతలో బయట పెద్దగా కేక విన్పించడంతో అదిరిపడి ఉరికాడు. అప్పుడే సుభాష్ డ్రాయింగ్ రూంలోంచి భూతాన్ని చూసినట్టు పరిగెత్తి వచ్చాడు.

లాల్ వెళ్ళి అతన్ని పట్టుకొన్నాడు, "ఏమిటి? ఏం జరిగింది?"

సుభాష్ విపరీతంగా వణికిపోతున్నాడు.

"లోపల—అక్కయ్య—"

"ఆమెకేమయింది?"

"ఓహ్, చనిపోయింది!"

లాల్ అతన్ని వదలి మెరుపులా లోనికెళ్ళాడు. అతని వెనుక ఉమేష్ ఉరికాడు. రేణుక సోఫాలో పడిపోయి ఉంది. ఆమె కళ్ళు విశాలంగా విచ్చుకొని, నిశ్చలంగా చూస్తున్నాయి. చెంపలు ఎర్రబడ్డాయి. దవడలు రెండూ గట్టిగా అతుక్కొని, పెదిమల మధ్యనించి నురుగు వస్తోంది. చూస్తూండగానే ఆమె దేహం వేగంగా ఎర్ర బడసాగింది....

ఉమేష్ ఒక కేక పెట్టి ఆమె మీద పడ్డాడు.

"పిన్నీ! ఓహ్ పిన్నీ! ఏమిటిది!"

లాల్ టీపాయ్‌మీద చూశాడు. రెండు ఖాళీకప్పులు, ఒక పింగాణీ పాత్రలో పంచదార, స్పూను వున్నాయి. రేణుక తాగిన కప్పులో అడుగున తెల్లటి పదార్థం స్ఫటికలుగా మెరుస్తోంది.

లాల్, ఉమేష్‌ని లేపి బయటికి తీసుకెళ్లాడు. తలుపు దగ్గరకు వేసి కృష్ణన్‌కు ఫోన్ చేశాడు.

"కృష్ణన్! వెంటనే బయలుదేరి రండి—వి.కాంత్ ఇంటికి. సూసైడ్ కేసు. సైనేడ్ అనుకుంటాను.... రేణుక తీసుకుంది. త్వరగా రండి!"

లాల్ ముక్కలు ముక్కలుగా చెప్పి ఫోను పెట్టేశాడు. సుభాష్, ఉమేష్‌లు గోడవారగా నిలబడి ఏడుస్తున్నారు. వినయ్ బయట జిమ్మీతో ఆడుకుంటున్నాడు. వంటవ్వ ఏమీ అర్థంగాక దిక్కులు చూడసాగింది.

లాల్ అసహనంగా పచార్లు చేస్తుండగా ఫోను మ్రోగింది. రిసీవరందుకొన్నాడు. అవతల జాన్ పలికాడు—

"లాల్! సుధాకర్ తప్పించుకున్నాడు!"

ఉలికిపడి, "ఎప్పుడు?" అన్నాడు లాల్.

"అరగంటయింది—అయిదు గంటలకు. ఆఫీసునుంచి బయలుదేరాక బస్సులో తికమకపెట్టి తప్పించుకున్నాడు. ఇంతవరకు జాడలేదు!"

లాల్ నిట్టూర్చి టైం చూశాడు—5-29.

"వెల్! ఇక్కడ మరొక ట్రాజెడీ! రేణుక ఆత్మహత్య చేసుకొంది...."

"ఓహ్! ఎప్పుడు?"

"ఇప్పుడే—చేసిన తప్పు తెలుసుకుంది. పశ్చాత్తా

పంతో ప్రాణాలు తీసుకుందనుకుంటాను—"

"గుడ్ గాడ్!"

"నువ్వు సుధాకర్ యింటి దగ్గర వుండు. అత నెప్పు డొస్తే అప్పుడు ఆఫీసుకు తీసుకెళ్ళు—నేను వచ్చి సంగ తేమిటో చూస్తాను!"

లాల్ ఫోను పెట్టేసి వంటవ్వ వేపు తిరిగాడు, "నువ్వు కాఫీ లిచ్చి గదిలో ఎంతసేపున్నావ్?"

"వెంటనే వచ్చేశాను."

"అప్పుడు లోపలెవరున్నారు?"

"నే నే.... నేనూ పిన్ని" ఉమేష్ అన్నాడు బలహీ నంగా, "ఆమె మాట్లాడుతూ నెమ్మదిగా తాగుతోంది. నేను త్వరగా తాగేశాను. నన్నిక వెళ్ళి స్నానం చెయ్య మని చెప్పింది. వెళ్ళిపోయాను—అంతే!"

"అప్పుడు టైం ఎంతయింది?"

"చూడలేదు....అయిదూ ఇరవై అనుకుంటాను."

"ఆమె నీతో ఏం మాట్లాడింది?"

"ఆమె—ఆమె—ఒక్కసారిగా అదోలా మారి పోయింది. ఏదో మాట చెప్పింది. అర్థంగాలేదు....తాను చాలా తప్పు చేశానని చెప్పి క్షమించమంది—"

"ఏమిటా తప్పు?"

"నే నడగలేదు—నా గురించే బాధపడుతోందను కున్నాను."

లాల్ నిట్టూర్చాడు. "నువ్వెక్కడున్నావు?"సుభాష్ నడిగాడు.

"వరండాలో నిలబడి ఆలోచిస్తున్నాను—"

"రమ ఇంకా రాలేదా?"

"లేదు."

"ఆమె యెవరైనా రహస్యంగా కలుసుకోం టోందా?...."

"అంటే?....ఎవర్ని?"

"ఆమె ఎవరైనా ప్రేమిస్తోందా?"

"తెలియదు! కానీ....అప్పుడప్పుడు సాయంత్రం బయటికెళ్ళి ఆలస్యంగా వస్తుంది" సుభాష్ ఉలికిపడ్డాడు, "బాస్! ఆమె నన్ను కాఫీకి పిలిచినప్పుడు అయిదు కావస్తోంది.... నేను పైన గదిలో కిటికీదగ్గర వున్నాను—అప్పుడు తోటలో యెవరో తచ్చాడుతుండగా చూశాను!"

"ఎవరు?"

"స్పష్టంగా చూడలేదు! రమ పిలవడంతో తిరిగివచ్చేశాను—"

# 11

పోలీసు సిబ్బంది వచ్చి డ్రాయింగ్ రూంలో పరిశోధన ప్రారంభించింది....

రేణుకని పరీక్షించి డాక్టర్ ఆమె పొటాషియం సైనేడ్ తీసుకుందని చెప్పాడు. ఆమెను ఫోటోలు తీసి, వేలిముద్రలు గాలించారు. కప్పుల్ని లాబ్ కు పంపేందుకు స్వాధీనం చేసుకున్నారు.

ఉమేష్ సోఫాలో తల పట్టుకొని కూర్చున్నాడు. అతని ప్రక్కన వినయ్ వొదిగి కూర్చొని అందర్నీ గమనిస్తున్నాడు—సుభాష్ ఇంకా దుఃఖాన్నాపుకోలేకపోతున్నాడు.

పైన రేణుక గదిలో లాల్ టేబిల్ చుట్టూ తిరుగుతూ పరిశీలిస్తున్నాడు. సొరుగులన్నీ లాగి చూశాడు. క్షుణ్ణంగా గమనించాడు.

క్రింది సొరుగులో రహస్య అర బయటపడింది. ఆ

సొరుగు మిగిలినవాటికంటే లోతు తక్కువ వుంది. క్రింద వెనుక భాగంనుంచి వొక బల్లపరుపు చెక్క స్లైడ్‌లా అమర్చి వుంది. లాల్ దాన్ని లాగి లోనికి చూశాడు. కొన్ని కాయితాలు కన్పించాయి. వాటిని తీసి చూశాడు. అవన్నీ స్వరాజ్ వ్రాసిన ప్రేమ లేఖలు.... స్వాధీనం చేసుకున్నాడు.

క్రిందికి తిరిగివచ్చాక కృష్ణన్ ఎదురుపడి అన్నాడు, "వెల్, లాల్! కేసు ముగిసింది. ఆమె చేసిన పాపానికి తనే శిక్ష విధించుకుంది. మనం చేయగల్గిందేమీ లేదు. సుభాష్‌నీ, సుధాకర్‌నీ వార్నింగ్ యిచ్చి వదిలి వేయాలి—"

లాల్ అడ్డంగ తలూపాడు, "అప్పుడే నిర్ణయానికి రాకండి! వి.కాంత్ హత్యలో స్వరాజ్ రేణుకకు తోడ్పడ్డాడు. బహుశ సుభాష్ కూడా ఆక్సెసరీ అయ్యే అవకాశం వుంది...."

"అయితే స్వరాజ్‌ని అరెస్టు చెయ్యాలా?"

"ష్యూర్—" లాల్ యింకేదో చెప్పబోయాడు—యింతలో వంటవ్వ భయంకరంగా అరుస్తూ హాల్లోకొచ్చింది. ఆమె నిలువునా కంపించిపోతూ నేలమీద కూలబడింది.

"ఏం జరిగింది? యెందుకలా వచ్చావు?" లాల్ అరిచాడు.

ఆమె నోరు పెగల్లేదు. విచిత్రంగా సైగలు చేస్తూ గుండెలు బాదుకుంటోంది.

"భయపడకు! ఏం జరిగిందో నిదానంగా చెప్పు!"

"రమ—కుప్పతొట్లో రమ—"

"ఏమయింది?"

"చచ్చిపడి వుంది!"

లాల్ మెరుపులా బయటికి పరుగుతీశాడు. అతని వెనక కృష్ణన్, సుభాష్, ఉమేష్ పరిగెత్తారు. పెరట్లో మూలగోడ దగ్గర నున్న కుప్పతొట్టి వద్దకు అందరూ చేరుకున్నారు. మసక చీకట్లో లోపల ఒక మానవాకారం అస్పష్టంగా కన్పిస్తోంది. కృష్ణన్ టార్చి వేశాడు. రమ కాళ్ళు చేతులూ మడిచి అందులో కుక్కబడి వుంది. ఆమె ముఖంమీద వంటవ్వ విసిరేసిన కూరగాయలపాట్లు వుంది- నోటినుంచి, ముక్కునుంచీ రక్తం కారి గడ్డకట్టింది....

క్షణాల్లో ఆమెను ఫోటోలు తీసి, వెలికి తీశారు. డాక్టర్ పరీక్షించి ఆమె నైలాన్ తాడుతో వురి తీయబడిందన్నాడు. ఆమె చనిపోయి యింకా గంట కూడా దాటలేదు....

పెరట్లో బట్టలారేసుకొనే నైలాన్ తాడు తెగిపోయి వుంది. పెరటితలుపు గడియతీసి, ఓరగా వేసివుంది.

"వెల్, లాల్! దీని కర్ధమేమిటి? ఇది కచ్చితంగా సుధాకర్ పగ సాధింపు చర్య! అంతకంటే ఈ హత్యకు మోటివ్ లేదు!" అన్నాడు కృష్ణన్.

"అయితే మిగిలిన సంఘటనలు? రేణుక భర్తను చంపలేదా? ఆమె ఆత్మహత్య చేసుకోలేదా?"

కృష్ణన్ అడ్డంగా తలూపాడు. "నో, లాల్. సుధాకర్ అయిదుగంటలకు తప్పించుకున్నాడన్నారు. ఇక్కడికొచ్చాడేమో?"

"ఆగండి! సుభాష్ అయిదుగంటలకి తోటలో ఎవరో తిరుగుతోంటే చూశాడట! అది స్వరాజ్ అనుకొంటాను. ....అతను రేణుక దగ్గర ప్రేమలేఖలు గురించి భయపడు

తున్నాడు. వాటికోసం రహస్యంగా వచ్చాడనుకొంటాను. కానీ, రమ కంట పడ్డాడు. భయపడి, ఆమెని బయటకు పిల్చి చంపేసి పారిపోయాడేమో?"

"అది సుధాకర్ ఎందుక్కాకూడదు?"

"ఎందుకంటే ఆ సమయానికతను ఆఫీసులోనే వున్నాడు. అయిదుగంటలకి ఆఫీసు వదిలాడు. అదే సమయంలో యిక్కడ ప్రత్యక్షం గావడం అసంభవం! సుభాష్ సరిగ్గా అయిదు గంటలకి తోటలో ఆకారాన్ని చూశాడు."

"సుభాష్ కూడా వి.కాంత్ హాత్యలో అక్కసరీ అన్నారు. ఒకవేళ ఆ ఆకారం గురించి అతనే కల్పించి రమను చంపాడేమో?"

"ఆమె నెందుకు చంపుతాడు?"

"భద్రతకోసం—అతని గురించి ఆమెకు తెలిసి వుండ వచ్చు."

"నో, నో, యిందులో మరొక అదృశ్య వ్యక్తి ఉన్నాడు."

"ఎవరు?"

"రమ ప్రేమికుడు—అతని గురించికూడా ఆలోచించాలి. పెరటి తలుపు తీసివుంది....మీ మనుషులెక్కడ? బయటికి వెళ్ళి ఆగంతకుడి గురించి దర్యాప్తు చేయమనండి!"

కృష్ణన్ వెళ్ళిపోయాక లాల్ చీకట్లో సిగరెట్ తాగుతూ కుప్పతొట్టికేసి చూస్తూ నిలబడ్డాడు. ఆమె యింకా అక్కడే కన్పిస్తోంది....అలాగే, అదేసితిలో, అదే భంగిమలో, మరో లోకంలో. హాఠాత్తుగా ఆమె యీ లోకానికి దిగివచ్చి రెండు చేతులు జోడించి అరి

స్తున్నట్లు అనిపించింది లాల్ కి.

మాంతకుడిమీద కసిగా లోని కడుగులేశాడు.

హాల్లో సోఫాలో ఉమేష్, సుభాష్, వినయ్ విచార వదనాలతో కూర్చొని వున్నారు. క్రింద వంటవ్వ వెక్కి వెక్కి ఏడుస్తోంది. వాళ్ళని చూస్తున్నవాడల్లా లాల్ తక్కున ఆగిపోయి, ఏదో జ్ఞప్తికి వచ్చి, వాళ్ళు గమనించకుండా గిరుక్కున తిరిగి వి. కాంత్ గదిలో కెళ్ళాడు.

సిగరెట్ పారేసి వేగంగా బీరువానీ, షెల్ఫుల్నీ, సొరుగుల్నీ గాలించాడు. చివరికి సొరుగులో దొరికిన ఒక ఫోల్డర్ తో కుర్చీలో కూర్చున్నాడు. దాన్ని తెరిచి పరిశీలించాడు. అందులో అన్నీ వ్యక్తిగత లేఖలు తేదీలవారిగా పొందుపర్చబడి ఉన్నాయి.

కానీ—వాటిలో పైన ఫైలు చేయకుండా, పంచ్ రంధ్రాలేని ఉత్తరాన్ని చూసి ఆశ్చర్యంగా అందుకున్నాడు.

కొన్ని క్షణాల తర్వాత అతని పెదవులు చిరునవ్వుతో మెరిశాయి.

# 12

జాన్ నవ్వి, "మీ కౌబాయ్ అడ్వెంచర్ కాస్సేపట్లో ఓ కొలిక్కి వస్తుంది" అన్నాడు.

సుధాకర్ మిర్రి చూశాడు, "నన్నిలా నిర్బంధించడం చట్టవిరుద్ధం!"

జాన్ మళ్ళీ నవ్వాడు, "కౌబాయ్ ప్రపంచంలో చట్టం ఉండదు. నేను కూడా చాలా వెస్టర్న్ సినిమాలూ, నవలలు ఎంజాయ్ చేశాను."

సరళ అంది, "ప్లీజ్, జాన్! ఆయనతో మాట్లాడకండి! ఆయన మెదడు సరిగా లేదు!"

"నీ కోసం నేనింత రిస్కు తీసుకొని జైలుకెళ్ళడానికి సిద్ధపడుతున్నాను!"

"ధూరుకోండి. ఏమీ చెయ్యకుండానే యెలా వెళ్తారు?"

ఇంతలో లాల్, వెనుక పడుతూ లేస్తూ వస్తున్న కృష్ణన్‌తో ఆఫీసులో ప్రవేశించి నోరు పెద్దగా తెరిచి నవ్వాడు.

"వెల్! ఏమంటున్నాడు మిస్టర్ సుధాకర్?"

"రేణుకను కూడా చంపాడట!" జాన్ అన్నాడు.

"బ్రేవో మిస్టర్ సుధాకర్! మరి రమను?"

"నేనే! ఆమెను కూడా నేనే చంపాను!" సుధాకర్ బల్లమీద గుద్దాడు. "నేను ప్రతిజ్ఞ చేశాను. అవునా? ఇప్పుడు నెరవేర్చుకొంటున్నాను! నన్ను వదిలి చూడండి, మిగిలినవాళ్ళను కూడా అంతం చేసి స్వయంగా జడ్జీ దగ్గర చెప్పుకొని మరీ జైలు కెళ్తాను!"

"జడ్జీ కాదు గదా యముడి దగ్గర చెప్పుకున్నా గెట్ అవుట్ అంటాడు."

"ఇంతకీ మీ రిప్లై దేమంటారు?"

"మీ బడాయి నోరు మూసుకోమంటాను. మీరు చెయ్యని పనులకి చంకలు కొట్టుకోవద్దంటాను! మీలో పౌరుషం వుందిగానీ, అది ఆచరణలో పనికిరాదు. మీ వైఫల్యాలు అసంతృప్తి ఫలితంగానే ఇతరులు చేసే ఘనకార్యాల్లో మిమ్మల్ని వూహించుకుని మనశ్శాంతి పొందే అవలక్షణం వచ్చింది మీకు! అదెంత ప్రమాదకరమో మీరు తెలుసుకోలేరు. మీ బుకాయింపులతో మా మతులు పోగొట్టి తప్పుడు మార్గాలను పట్టించారు. జాన్ మిమ్మల్ని కనిపెడుతున్నాడని తెలిసి, ఆఫీసునుంచి

తెలివిగా అతని దృష్టినుంచి తప్పించుకొని, షికార్లుకొట్టి తిరిగివచ్చారు. ఖర్మకాలి ఆ సమయంలోనే రెండు హత్యలు జరిగాయి.

"కాబట్టి సుధాకర్ మీరు పిచ్చిగా మాట్లాడకండి! ఎర్రగడ్డకు పంపే యేర్పాటు చేయగలను....మీ మాటలు పిచ్చాసుపత్రి వాళ్ళకు బావుంటాయి.

"వెల్ ఫ్రెండ్! యిక యీ హత్యలు గురించి చెప్పు కుందాం. మొదటి హత్య వి. కాంతని రమ చంపిందని మనవి చేసుకొంటున్నాను."

"రమ చంపిందా!" దాదాపు అందరూ ఒకేసారి అరిచారు.

"అవును. రమ చంపింది!" మళ్ళీ అన్నాడు లాల్. "కానీ బుద్ధిపూర్వకంగా కాదు. అది ప్రమాదవశాత్తున జరిగింది. పూర్ గర్ల్! అమాయకంగా నమ్మి మోస పోయింది! ఆమెకు అంకుల్ని చంపుతున్నట్టు తెలియదు. ఆమె కలిపింది ప్రాణం తీసే విషమని అసలు తెలియదు!"

"మరి ఏమనుకొని కలిపింది?"

"కృష్ణన్, మీ రిటీవల 'ట్రూత్ డ్రగ్స్' గురించి వినే వుంటారు—నిజాన్ని కక్కించే మందు. ఇంకా వాడకం లోకి రాలేదుగానీ పరిశోధనలు సాగుతున్నాయి. ఏదో సైన్స్ మాగజైన్లో చదివినట్టు గుర్తు....టాక్సిన్ మూల పదార్థంగా మరికొన్ని రసాయనాల కలయికతో అలాటి మందును రూపొందించవచ్చునని శాస్త్రజ్ఞులు ప్రకటించారు.

"సైన్స్ కేదేనా సాధ్యమే. ఎవరైనా మాంత్రికుడు మిమ్మల్ని పట్టుకొని యింద్రజాల మహేంద్రజాలంతో కప్పగా మార్చేస్తానంటే మీరు నమ్మకపోగా, నవ్వి

పోషణ చేస్తారు. అలాంటి విద్యల్ని నమ్మే రోజులు పోయాయి. అదే ఎవరైనా సైంటిస్టు మీ దేహంలో కొన్ని ప్రత్యేక గ్రంథుల్ని ప్రవేశపెట్టి కప్ప లక్షణాలు సృష్టించగలనంటే తేలిగ్గా నమ్మేస్తారు. సైన్స్‌పట్ల ప్రజల్లో పెరుగుతున్న విశ్వాసం అలాంటిది.

"ఇక సైన్స్ రంగంలో కొత్తగా కనిపెడుతున్న విషయాల్ని ప్రత్యేకాసక్తితో గమనిస్తూ, పేపర్ కటింగ్స్‌ని పోగుచేసే రమలాంటి అమ్మాయికి ఏదో మందు చూపించి ఇదే 'ట్రూత్ డ్రగ్' అంటే గుడ్డిగా నమ్మేస్తుందని చెప్పనక్కర్లేదు."

"అంటే....ఆమెనలా ఎవరు నమ్మించారు?"

"జైపాల్—ఆమె ప్రేమికుడు. అది అతని సొంత పేరనుకోను. అతన్ని ఆమె కొంతకాలంగా రహస్యంగా కలుసుకుంటోంది. అతన్ని బాగా నమ్మింది. బహుశ అతను పెళ్ళికి కూడా నమ్మించి వుంటాడు. అంతేగాక తను చాలా మోసపోయినట్టూ, దగాపడినట్టు కూడా చెప్పుకొని వుంటాడు. రమ బాధపడి వుంటుంది.

అతను వి. కాంత్ కంపెనీలో చాలా డబ్బు నష్టపోయానని బుకాయించాడు. ఆ డబ్బు సంపాదిస్తే తప్ప తనకు జీవనాధారం లేదు. ఇది తెలిసి రమ అతనికి సహాయపడాలనుకుంది. ఇద్దరూ మార్గం ఆలోచించారు. అప్పుడతను యీ పథకం వేశాడు. ట్రూత్ డ్రగ్ గురించి ప్రస్తావించి వి. కాంత్ మీద దాన్ని ప్రయోగించి నిజం కక్కించాలని చెప్పాడు.

రమ వెంటనే ఒప్పుకొంది. ఆమెకా మందు గురించీ, దాని ప్రభావం గురించీ చాలా కుతూహలంగా వుంది. పథకం ప్రకారం నిన్న సాయంత్రం అతను దాన్ని ఆమె

కిచ్చి ఉదయం టిఫిన్‌లో కలపమన్నాడు. అప్పుడతను ఆఫీసుకొచ్చాక తను అక్కడికి వెళ్ళి నిజం చెప్పేస్తానని అన్నాడు—

"అంతే! రమ చెప్పినట్టు చేసేసింది. ఆ మందు ఉదయం జామ్‌లో కలిపింది. కానీ వి. కాంత్ ను సీరియస్‌గా వుందని మీరు ఫోన్ చేసినప్పుడు బెదిరిపోయింది. ఏదో పొరపాటు జరిగిందని కంగారుపడింది. అందుకే ఆ బాటిల్‌ని శుభ్రంగా తుడిచిపారేసి కొత్త బాటిల్‌ని అక్కడ వుంచింది."

"సరే, అయితే జైపాల్ అసలు పేరేమిటి?"

"ఉమేష్ బాబు, అఫ్‌కోర్స్."

"వాట్! నేను నమ్మను. అసంభం! అసాధ్యం!"

"సాధ్యమే! ఉమేష్‌బాబు యీ రెండేళ్ళు సమాజంలోని అట్టడుగు వర్గాల మధ్య, యింకా నిమ్నస్థాయి సంస్కృతికి అలవాటుపడ్డ కుర్రాడు. అతనికి కారెక్టర్ లేదు. ఇంకా మాట్లాడితే మానవత కూడా లేదు. అడుగడుగునా నేరాలతో పోలీసుల వేటకి గురయ్యాడు. ఆ బ్రతుకుతో విసిగిపోయాడు. ఇక అతని ఆలోచనలెలా వుంటాయో వూహించండి.

"అతనికి విశ్రాంతి, భద్రత, స్థిరత్వం కావాలి. అవెక్కడా కన్పించలేదు—తండ్రి దగ్గర తప్ప. కాని తండ్రి దగ్గర సంబంధాలు లేవు. పైగా పిన్నితో పడదు. ఆ యింటికి తిరిగి వెళ్ళాలంటే ఆమె అక్కడ వుండకూడదు. అయినా తండ్రి ఆదరిస్తాడని నమ్మకమేమిటి? అందుకే అతను బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. తను కోరుకొనే సౌఖ్యాల కోసం తిరిగి యింటికెళ్ళాలనుకొంటే అక్కడ పిన్ని, తండ్రీ కూడా

వుండకూడదు."

"చెప్పండి. మీ రేమీ ఆగనవసరం లేదు!"

"ఊపిరి పీల్చుకోనివ్వండి! ఆల్ రైట్, అందుకే అతను యిక్కడికొచ్చాడు. అంటే బెంగుళూరు విడిచి పెట్టాడు. చాలా కాలంగా యిక్కడే మసలుతున్నాడు. ఇక్కడి వాళ్ళను జాగ్రత్తగా గమనిస్తూ పథకం ఆలోచిస్తున్నాడు. ముందు రమను బయటకు లాగి ప్రేమలో దింపాడు. అత నెవరో ఆమెకు తెలియదు. తనంటే ఆమె పడిచచ్చేలా గుప్పిట్లో బిగించి, యిక రంగంలో దిగడానికి సిద్ధమయ్యాడు.

"అతని పథకంలో నాయకుడు మిస్టర్ సుధాకర్" సుధాకర్‌ని ఓరగా చూస్తూ మళ్ళీ అన్నాడు లాల్, "సుధాకర్ ఉద్దేశాన్ని, స్వభావాన్ని అతను బాగా స్టడీ చేశాడు. దాని ప్రకారం అంచనాతో సరళమీద దొంగతనాన్ని ఫేక్ చేశాడు—సుభాష్ ఏమీ చెయ్యలేదు. అతను శుద్ధ అమాయకుడు.

"ఉమేష్ మొన్న రాత్రి తాళాలు దొంగిలించి ఆఫీసులో ప్రవేశించి వెంట తెచ్చుకున్న బ్యాగ్‌లో డబ్బు నింపుకొని తిరిగి ఆఫీసుకు తాళాలు వేసుకొని వెళ్ళిపోయాడనీ, ఉదయం సరళ ఆఫీసు తెరిచాక అతను బాల్కనీలో కిటికీ దగ్గర పొంచివుండి సుభాష్ వినయ్‌తో రాకముందే లోనికి దూకి బ్యాగులో పడేసి వెళ్ళిపోయాడనీ సులభంగా వూహించవచ్చు.

"వెల్! వి. కాంత్ సరళ మీద దొంగతనం మోపాడు. అరెస్టు చేయడానికి పోలీసులొచ్చారు. ఇంతలో తుఫాను గాలిలా సుధాకర్ వచ్చి రభస చేశారు. ఆ వార్త మీకు నిమిషాలమీద ఎలా తెలిసిందో

నా కష్టదరిద్రం గాలేదు. ఇప్పుడదరిద్రమవుతోంది. మీకు యెవరో ఫోన్ చేసి చెప్పారు. అవునా?"

"అవును మిస్టర్ లాల్. ఎవరో నాకు ఫోన్ చేసి సరళమీద వి. కాంత్ దొంగతనం మోపి అరెస్టు చేయిస్తున్నట్టు చెప్పాడు. అంతేకాదు, వి. కాంత్ మోసగాడనీ, అతని కంపెనీ ఫ్రాడ్ అనీ, తను చాలా డబ్బు నష్టపోయాడనీ కూడా చెప్పాడు. అతనిమీద ఎలాగైనా పగతీర్చుకోమని నన్ను రెచ్చగొట్టాడు."

కృష్ణన్ విస్తుపోయాడు,

లాల్ నవ్వాడు. "చూశారా? ఉమేష్ సుధాకర్‌ని రెచ్చగొట్టి యెలా కత్తుబూనేలా పురిగొలిపాడో? అఫ్‌కోర్స్ సుధాకర్‌ది ఒట్టి ఉద్రేకమేనని అతనికి తెలుసు. దాన్ని తెరగా ఉపయోగించుకోవాలని అతని ఉద్దేశం. వెల్ సుధాకర్ ఛాలెంజ్ చేశారు. ఉమేష్ నడుం కట్టాడు.

"సుధాకర్ ఇంట్లోనే గన్నేరు విత్తనాల్ని సేకరించి వాటి పొడిని నిన్న సాయంత్రం రమకిచ్చి ట్రూత్ డ్రగ్స్ పథకం బుకాయించాడు. రమ అమాయకంగా నమ్మేసి తానూహించని పాపానికి ఒడిగట్టింది. ఇంతలో టెలిగ్రాం వచ్చింది. దాన్ని అతను బెంగుళూరులో ఫ్రెండ్‌తో ఏర్పాటు చేసుకున్నాడు. సాయంత్రం సూట్‌కేసుతో యింట్లో దిగాడు."

"ఆ తర్వాత. అప్పుడేం జరిగింది?"

"మరో రెండు హత్యలు జరిగాయి. రేణుక, రమ చనిపోయారు. ఎవరి చావు ముందో మీకు తెలుసా?"

"రేణుకది కాదా?"

"కాదు." లాల్ ముఖం కఠినంగా మారింది. "ముందు

రమ చనిపోయింది. సుభాష్ అయిదు గంటలకి తోటలో ఎవర్నో చూశాడనీ, అది స్వరాజ్ గా నేను భావించి నట్టు చెప్పాను గుర్తుందా? ఇప్పుడది స్వరాజ్ కాదు, ఉమేష్. అతనింటికొస్తే రమ ఆశ్చర్యపడి అనుమానించ వచ్చు. అవునా? ఆమెకు నిజం తెలిసి అతని భద్రతకు ముప్పు ఏర్పడుతుంది. ఏమంటారు? కాబట్టి ఆమెను చంపే శాడు. అతని ప్రేమా పెళ్ళి పథకంలో భాగం.

"అతను యింట్లోకి రాక ముందు పెరట్లో నిలబడి కిచెన్ లో రమను పిల్చాడు. అతన్ని చూసి ఆమె ఆశ్చర్య పడింది. గాభరాగా వెళ్ళింది. ఉదయంనించీ ఆమె అతన్ని కలుసుకోవాలని చాలా నెర్వస్ గా వుంది. అప్పు డతను మాట మాత్రం లేకుండా నైలాన్ తాడుతో ఉరి తీసి కుప్పతొట్లో కుక్కి పెరటితలుపు తీసివుంచి సూట్ కేసు పట్టుకొని చక్కా యింట్లో కొచ్చాడు."

"వాడు! వా డెంతటి దుర్మార్గుడు?" సరళ అంది పళ్ళు బిగించి.

"పరమ కిరాతకుడు. ప్రాణాల్ని మంచినీళ్ళ ప్రాయంగా తోడేశాడు. నా కే మాత్రం అనుమానం రాలేదు. నిజంగానే పూర్ణించి దిగాడనుకున్నాను. అతనిలో ఏ బెరుకూ లేదు! ఏ పాటి తొట్రుపాటూ లేదు! పిన్ని దగ్గర చాలా సహజంగా, అమోఘంగా నటించాడు!

"అప్పుడు—వాళ్ళిద్దరు కాఫీ తాగుతున్నప్పుడు గదిలో యెవరూ లేరు. ఆ అవకాశంతో ఆమె కాఫీలో విషం కలిపాడు. చాలా సులభం! ఆమె కనిపెట్టకుండా ప్రక్కనే కూర్చున్నాడు. జేబులోంచి సైనైడ్ తీసి, చెయ్యిని పింగాణి పాత్రలోకి పోనిచ్చి చక్కెర తీస్తు

న్నట్లు నటించి, సైనైడ్ ఆమె కప్పులోపోస్తూ 'చూడు పిన్నీ నీ కప్పులో నువ్వు తాగలేనంత తియ్యగా పంచదార నింపేశాను!' అని వుంటాడు. అతని చిలిపితనాని కామె నవ్వుతూ 'ఫరవాలేదులే ఉమేష్! నువ్వెళ్ళి స్నానం చెయ్యి!' అని చెప్పి వుంటుంది. అతను చేతులు దులుపు కొని చల్లగా లేచి వచ్చేశాడు."

"ఓహ్! అతన్ని కల్లోకూడా అనుమానించలేరు. ఈ హత్యలన్నీ సుధాకర్, సుభాష్, స్వరాజ్, రేణుక-వీళ్ళమధ్యే అల్లుకొని ఉన్నాయని భావిస్తూ వచ్చాం" అన్నాడు కృష్ణన్.

"అవును. ఉమేష్‌ని అనుమానించకపోతే ఈ హత్యలన్నీ మిక్స్‌డ్ ఫ్రూట్ జామ్‌లా తయారయ్యేవి."

"అతన్ని నువ్వేలా అనుమానించావు?" అడిగాడు జాన్.

"ఉమేష్ రాక నాకు తర్వాత అనుమానం కలిగించింది. వి. కాంత్ లాయర్‌కు ఉమేష్ వస్తున్నట్టు తెలియదు. వి. కాంత్ చెప్పలేదు. కాని తండ్రి ఉత్తరం వ్రాసి తనని రమ్మన్నట్లు ఉమేష్ చెప్పాడు. అలాగే వస్తున్నట్లు జవాబు కూడా యిచ్చానన్నాడు. నాకేదో అసహజంగా తోచింది. కుమారుడ్ని రమ్మని కోరివుంటే వి. కాంత్ లాయర్‌తో యెందుకు చెప్పలేదు? ఉమేష్ మాటల ప్రకారం అతని ఆరోగ్యం చెడి, బాధ్యతల్ని కుమారుడి కప్పగించాలనుకున్నప్పుడు లాయర్‌తో ఎందుకు సంప్రదించలేదు? సంప్రదించకుండా ఎవరైనా వుంటారా?

"వ్యవహారం ఏమిటో తెలుసుకుందామని ఉమేష్ వ్రాసిన ఉత్తరంకోసం వి.కాంత్ ఫోల్డర్ తిరగేశాను. అందులో అన్నీ పర్సనల్ లేఖలున్నాయి. వాటిపైన ఈ

ఉత్తరం దొరికింది—ఉమేష్ ఇరవై రోజుల క్రితం వ్రాసి నట్టు తేదీ చెప్తోంది. మామూలు కాయితం. కవరు, పోస్టల్ ముద్రలు లేవు. ఇది మిగతా ఉత్తరాల్లాగా వరుసక్రమంలో ఫైలు చేసి లేదు. పంచ్ రంధ్రాలు కూడా లేవు. కాబట్టి మీ కేమర్థమవుతోంది?"

"ఉమేష్ సాయంత్రం వచ్చినప్పుడు దీన్ని రహస్యంగా జారవిడిచాడా?"

"దటీజ్ రైట్! అతడు టైమింగ్‌ని చాలా నేర్పుతో అమలు జరిపాడు. ఏ సమయంలో యెక్కడేది జరగాలో అవి నిరాటంకంగా జరిగిపోయాయి. తండ్రి రమ్మని అతనికి వ్రాయలేదు."

"ఇప్పటికీ అతన్ని హంతకుడిగా ఎలా అనుమానిస్తు న్నావో అర్థంగావడంలేదు!"

లాల్ జేబులోంచి మూడు గ్రీటింగ్ కార్డుల్ని తీసి అందించాడు.

"ఇవి రమకు అందాయి—ఆమె ప్రేమికుడు జై పాల్ నుంచి. వెనుక అక్షరాల్ని చూడు—దస్తూరీ ఈ ఉమేష్ ఉత్తరంతో సరిపోతుంది."

జాన్ చూసి తలూపాడు.

"పార్ట్‌నర్! ఈ ఉత్తరం జారవిడచి ఉమేష్ ఘోర మైన పొరపాటు చేశాడు!

"దట్సాల్, ఇనస్పెక్టర్. విష్యూ గుడ్‌లక్!"

లాల్ లేచి నిలబడి చెయ్యి అందించాడు.

—:ఐపోయింది:—

# (ఎనిమిదవ భాగము)

"అవును. విష మేఘం పరిమాణం క్రమక్రమంగా పెరుగుతున్న సంగతి ప్రభుత్వం గ్రహించింది. ఏవో కెమికల్-విమానాల ద్వారా ఆ విష మేఘం మీద స్ప్రే చేస్తున్నారు, మేఘాన్ని విడగొట్టడంకోసం. కాని యెంతవరకూ ఫలితం సాధించారో తెలియదు. కొన్ని ప్రాంతాలను ఖాళీ చేయిస్తున్నారు ముందు జాగ్రత్తగా. మెటీరియాలజీ ఆఫీస్ నిర్విరామంగా పని చేస్తోంది, గాలి మార్పులు గురిస్తూ—"

"పబ్లిక్ రియాక్షన్ ఎలా ఉంది?"

"దారుణంగా వుంది. కొద్ది నెలల క్రితం స్కైలాబ్ గోడవ! యిప్పుడు....యిది!....భయాందోళనలు....తిట్లు....శాపనార్థాలు.... పేపర్ వాళ్ళు ప్రభుత్వాన్ని ఫుట్ బాల్ ఆడుతున్నారు."

"ఈ ఉదయం జరిగిన ఎయిర్ క్రాష్—ఎంతమంది మరణించారందులో?"

"నిర్ధారణగా యింకా తెలీదు. సుమారు 6(.0 మంది మరణించినట్లు అంచనా. 280 మంది విమానంలోనే వున్నారు. ఇంకా కార్పొరేషన్ టవర్ వుద్యోగులు, దాని చుట్టుప్రక్కల వున్న కార్యాలయాల వుద్యోగులు....కరెక్టుగా యెంతమంది ప్రాణం కోల్పోయారో దేవుడికే తెలియాలి."

హాస్పిటల్ వార్డులా వున్న ఆ గదిలో వాతావరణం అకస్మాత్తుగా వేడెక్కింది....

కాస్సేపు యిద్దరూ యెవరి ఆలోచనలో వారు మునిగిపోయారు, జరిగిన దుర్ఘటనల తాలూకు ప్రాధాన్యత అంచనా వేస్తూ.

ఇద్దరికీ జరిగిందంతా, అసహజంగా, నమ్మశక్యం కానిదిగా, పీడకలలా అగుపిస్తోంది....

"ఇప్పుడు ప్రజలందరికీ విష మేఘం గురించి తెల్సిందా?" నిశ్శబ్దాన్ని చీలుస్తూ పలికింది రాణా కంఠం.

"తెల్సింది. రహస్యంగా ఉంచదగ్గ వస్తువు కాదది. మైలు పొడవు.... మైలు వెడల్పు...."

"విష మేఘం ఉందని నమ్మేవాళ్ళ రియాక్షన్"

"జనరల్ హిస్టీరియా...."

అదే సమయంలో తలుపు తెర్చుకుని జులేఖా లోనికి వచ్చింది.

"హల్లో రాణా! హౌ ఆర్ యూ ఫీలింగ్?" ఆమె నవ్వులో ఈసారి అలసట కనబడింది.

"అయామ్ ఫైన్! లూసీ కండిషన్ చెప్పండి."

"ఆమె పరిస్థితి అంత బాగులేదు రాణా! హానెస్టుగా చెబుతున్నాను. ఇక్కడ ఈ రోజు చాలా అస్థిర వాతావరణం నెలకొంది" ఆమె రాణా బెడ్ మీద వారగా కూర్చుంటూ అంది. "బట్, లూసీ కోలుకుంటుందనే నా విశ్వాసం...."

అతను తలెత్తి ఆమెవైపు చూశాడు ఆశాజనకంగా.

...."చాలా విషయాలు మాకు రూఢిగా తెల్సాయి. దేశాంలోని మేధావులందరూ యిక్కడ పని చేస్తున్నారు. శవాలమీద జరిపిన అటాప్సీలు చాలా సమాధానాలు చెప్పాయి రాణా! కాని 'అసలు కారణం' తెల్సుకోనిదే మాకు ఏ విషయం నిర్ధారణ కాదు. ఇందాక 'అస్థిర వాతావరణం' అని అందుకే అన్నాను."

"దయచేసి విషయాన్ని సూటిగా చెప్పండి— జులేఖా!"

గాఢంగా నిట్టూర్చి చెప్పసాగింది జులేఖా. "డిఫెన్. మినిస్ట్రి తాలూకు, కెమికల్ అండ్ మైక్రో బయోలాజికల్ రిసెర్చి సైంటిస్టులు మా వద్ద ఏవో విషయాలు దాస్తున్నట్టు భావిస్తున్నాం. యు సీ, వారి పరిశోధనలలో 'ఒక జవాబు'కోసం ప్రయత్నిస్తున్నట్లు లేదు. ఒక జవాబుని 'నిర్ధారించుకోడం' కోసం ప్రయత్నిస్తున్నట్లు కనబడుతోంది."

"వారు చేస్తున్నదేమిటో, వారికి నిర్ధారణగా తెలుసు. అందుకే మేం వార్ని మధ్యలో అడ్డుకోలేదు. వారి పరీక్షలు పూర్తయిం తర్వాత కల్సుకున్నాం. కాని ఒక్క విషయం కూడా బైట పెట్టలేదు. వాళ్ళ మినిస్టర్‌ని కల్సుకొనేదాకా ఏ విషయం మాట్లాడకూడదని చెబుతున్నారు. వారు కనుక్కున్న నిజాన్ని లేదా నిర్ధారణ చేసుకొన్న అనుమానాన్ని అప్పటి దాకా చెప్పలేరట.

"బాస్టర్డ్స్....యిన్ని లక్షలమంది ప్రజలు చచ్చిపోతున్నా వాళ్ళు అసలు విషయాన్ని దాస్తున్నారు!" ఉద్రేకంగా పైకి లేచాడు రాణా, ఎర్రబడ్డ ముఖంతో "రైనా!—గెట్ మీ ప్రొఫెసర్ సన్యాల్! ఆయన సమాధానాలు కనుక్కుంటారు. ఆయన కూడా విఫలమైతే—ఈ విషయాన్ని నేను పేపర్లు నిండా హెడ్ లైన్స్ పబ్లిసిటీ చేయిస్తాను. ఐ డోంట్ గివ్ ఎ డామ్ ఇఫ్ ఐ లూస్ మై జాబ్!"

"ఆయన్ని కాంటాక్ట్ చేస్తాను రాణా! కాని నువ్వు వ్యక్తిగతంగా చేయగలిగేదేమీ ఉండదు. ప్రభుత్వ రహస్యాలకు సంబంధించిన విషయమిది. నిన్ను అజ్ఞాతంగా

లాకప్‌లో పడేస్తారు" అన్నాడు రైనా, రియలిస్టిక్‌గా.

"జస్టు గెట్ హిమ్! వుయ్ విల్ సీ!" అన్నాడు రాణా కోపాన్ని అణుచుకుంటూ.

"ఓ.కే, ఓ..కే., బట్ కీప్ కామ్."

"ఎస్ రాణా!" నొక్కి పలికింది జులేఖా. "ఉద్రేక పడ్డంవల్ల ప్రయోజనంలేదు. అది యెవరికీ సహాయపడలేదు. మీరు యిప్పుడు చేయవల్సింది—ఆహారం తీసుకోడం. మీ మీమీద జరిపిన పరీక్షల ఫలితాలు కొంత సేపటికి తెలుస్తాయి. నా లెట్ మీ ఆర్డర్ సమ్ ఫుడ్ వైల్ ఇన్‌స్పెక్టర్ రైనా గెట్స్ ఇన్ టచ్ విత్ ప్రొఫెసర్ సన్యాల్! తర్వాత మీమీద జరిపిన పరిశోధనా ఫలితాలు పూర్తిగా చెప్తాను....నా రిలాక్స్!"....

* * *

మూడు గంటల తర్వాత....

రెండవ ఎమర్జన్సీ సమావేశం ఛత్రపతి భవన్‌లో ఏర్పాటు చేయబడింది.

ఈసారి కాన్ఫరెన్స్‌లో రక్షణశాఖ అధికారులు ఎక్కువగా హాజరయ్యారు.

మహారాణా—తన పైఅధికారి ప్రొఫెసర్ సన్యాల్-జులేఖాల మధ్య కూర్చున్నాడు.

తన ఉద్యోగి రాణా—సందేశాన్నందుకొని, డిపార్టుమెంట్ ఆఫ్ ఎన్విరాన్‌మెంట్, డైరెక్టర్ సన్యాల్, చాలా భీభత్సం చేశాడు.

తత్ఫలితంగా మొదటి సమావేశంలో హాజరైన అధికారులు బొంబాయిలోనే ఉండటంచేతా, రెండవ సమావేశం యేర్పాటుకు వెంటనే నిర్ణయం జరిగింది. ఢిల్లీనుండి మరి కొందరు అధికార్లు మిలటరీ హెలికాప్టర్‌లో రప్పించ

బడ్డారు.

పరిస్థితి ఉద్రిక్తమవడంచేత, డిఫెన్స్ మినిస్ట్రీ ఈ సారి నిజాయితీగా, ముక్కుసూటిగా సమాధానాలు యివ్వడానికి అంగీకరించింది. హోమ్ సెక్రటరీ పట్టుదల వల్ల కేంద్రమంత్రి ఆ మేరకు తన శాఖకు ఆర్డర్స్ జారీ చేసాడు.

ఓక్ చెక్కతో చెయ్యబడ్డ ఆ విశాలమైన రౌండ్ టేబుల్ చుట్టూ ఆశీనులై తమతమ ప్రక్కవారితో గుస గుస లాడుతున్న అధికార్ల ముఖాలు పరిశీలించాడు, రాణా.

అతను అక్కడికి రాగానే, చాలామంది అతనికి పరిచయం చేయబడ్డారు.

సమావేశం ప్రారంభం కావడానికి యెదురుచూస్తూ రాణా, ఆ అధికారుల్లో ఒక్కొక్కరి పేరు, హోదాలు గుర్తుతెచ్చుకోడానికి మరోసారి ప్రయత్నించాడు.

కేంద్ర హోం కార్యదర్శి, బల్వంత్ మిత్రా తన సహజ గంభీర ముద్రతో, యెదురుగా ఉన్న కాగితాలు పరిశీలిస్తున్నాడు....

రక్షణశాఖ స్టేట్ మినిస్టర్ గోకుల్ రామ్, ఆయన ప్రైవేట్ సెక్రటరీతో కల్సి—ఆర్మీ అండర్ సెక్రటరీ రణధావేతో వ్యక్తిగత సమాలోచనలు సాగిస్తున్నాడు....

చీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్—జనరల్ చావ్లా, వైస్—చీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్—లెఫ్టినెంట్ జనరల్ ప్రచండసేన్ కలిసి గుసగుసలాడుకుంటున్నారు....

కాన్ఫరెన్స్ టేబుల్—దూరంగా మరో యిద్దరు కూర్చొని ఉన్నారు. వారి ఉనికికి కారణమేమిటో అర్థం కాలేదు రాణాకి. కాని, వారిద్దరూ మిలటరీ యూని

ఫోంస్‌లో వున్నారు.

హోమ్ సెక్రటరీ చిన్నగా దగ్గుతూ, టేబుల్ మీద పెన్‌తో టకటక చప్పుడు చేసాడు, సమావేశ ప్రారంభానికి సూచనగా.

"జంటిల్మెన్!" ప్రారంభించాడు బల్వంత్ మిత్రా, "అండ్ లేడీ!" చిన్నగా నవ్వాడు జులేఖావైపు చూసి. "ఈ సమావేశం విషమేఘం యెలా "పుట్టిందీ", దాని ప్రభావం నుండి ప్రజల్ని యెలా "రక్షించవొచ్చు" అన్న విషయాలు చర్చించడంకోసమని మీకు తెలుసు. అయామ్ అండర్ కాన్‌స్టంట్ టచ్ విత్ అవర్ ప్రైమ్ మినిస్టర్. ఈ నిముషంలో, ఆయన ఇండియాకు తిరుగుప్రయాణంలో ఉన్నారని మీకు విన్నవించుకుంటున్నాను. ఇలాంటి విపత్కర పరిస్థితిలో మన మధ్య లేకపోయినందుకు ప్రధాని యెంతో బాధపడ్డారు. జరిగిన సంఘటనలపట్ల తీవ్ర ఆందోళన వెలిబుచ్చారు. ఆయన లేకపోయినంతమాత్రాన మనం ఎమర్జెన్సీగా తీసుకున్న నిర్ణయాలు అమలుజరుపబడకూడదని ఆయన ఉద్దేశం కాదు. వెనువెంటనే తగు చర్యలు తీసుకోమని పూర్తి అధికారాలు యిస్తూ నాకు సందేశం పంపారు.

"ప్రధాని తన రష్యా పర్యటన అర్ధాంతరంగా ముగించుకొని మధ్యలో తిరిగిరావడం విచారించవల్సిన విషయమే. కాని దేశప్రజల రక్షణ ముఖ్యావసరం కాబట్టి తప్పదు. ప్రధాని— ఈ సాయంకాలం సమావేశంలో పూర్తి యాక్షన్ ప్లాన్ మనం రూపొందిస్తే తను మాతృభూమిలో అడుగుపెట్టగానే ఆమోదముద్ర వేస్తానని, ప్లాన్ ఆచరణలో ఆలస్యం కాకుండా ఈ విధంగా చేయమనీ ఆయన నన్ను కోరారు.

"ప్రధాని ముఖ్య ఆదేశం ప్రకారం, ప్రజల క్షేమం కోసం యే మంత్రిత్వశాఖ అయినాగానీ ఈ రోజు, ఈ రాత్రి యిక్కడి సమావేశంలో ఎలాంటి వివరాలు నొక్కి-పెట్టకూడదు. నేను ఈ రోజు రక్షణశాఖ సహాయ మంత్రి, ఆర్మీ అండర్ సెక్రటరీలతో వ్యక్తిగత సంభాషణలు జరిపాను.

"తత్ఫలితంగా వెలువడ్డ కొన్ని నిజాలు ప్రధాన మంత్రికి నివేదించాను. ఆయన మరోసారి స్పష్టంచేసారు మనలో మనం యెట్టి అనుమానాలకు తావు లేకుండా, ఏ విషయం దాచిపెట్టకుండా, ఐకమత్యంతో కృషి చేయాలని. ఈ రాత్రి సమావేశం పరస్పర నిందారోపణలతో, ఒకరొకరు విమర్శించుకుంటూ గడపడాన్కి నిర్దేశించబడలేదని మీరందరూ గ్రహించి సహకరించాలి.

"సో, మనం యిక్కడ "పరిష్కారం" కనుక్కోవడాన్కి సమావేశమయ్యాం. లక్షలాది పౌరుల రక్షణ బయట జూదంలో ఒడ్డబడింది. మనమంతా ఐకమత్యంతో ఈ విషమేఘం మహావిపత్తును యుద్ధ ప్రాతిపదికపై ఎదుర్కొందాం."

తన ఉపన్యాసం శ్రోతల్లో ఎఫెక్ట్ పుంజుకోడాన్కి అవకాశమిస్తూ ఒక్కక్షణం ఆగాడు హోం సెక్రటరీ.

తర్వాత రక్షణశాఖ సహాయమంత్రివైపు తిరిగాడు. "గోకుల్‌రామ్‌జీ! మీరు యింతకుముందు వెల్లడించిన వివరాలు వెల్లడి చేయగలరా?"

గోకుల్‌రామ్ ముందుకు వంగాడు, తన మోచేతులు టేబుల్ మీద ఆన్చి, ముఖం ముందుగా రెండు చేతులు కలిపి పట్టుకుంటూ.

"జంటిల్మేన్! రక్షణశాఖ యీ విషయంలో పౌర

బోటు....”

“ఈ రోజు యిక్కడ మనం కల్సుకొన్నది ఒకరిని నిందించుకోడానికి కాదు గోకుల్ రామ్‌జీ, వివరాలు చెప్పండం తే....” అసహనంగా పలికాడు హోం సెక్రెటరీ.

“అచ్ఛా!” తేలిగ్గా ఊపిరి వదిలాడు గోకుల్ రామ్. అతని ముఖంలో అపరాధ భావన యిప్పుడు మాయమైంది. “కథ మొదట్నుంచీ ప్రారంభించాలం టే మనం పదిసంవత్సరాల వెనక్కి వెళ్ళాలి. షేరా మైదాన్ లో మన మైక్రో బయోలాజికల్ (సూక్ష్మాంగజీవుల-జీవ శాస్త్రం) రీసెర్చి ఎస్టాబిష్ మెంట్స్ దగ్గరకి. అక్కడ ఒకనాడు పని చేసిన అపూర్వ మేధావి, సైంటిస్టు విశ్వామిత్ర విషయం దగ్గరకి.

“బాక్టీరియలాజికల్ వార్-ఫేర్ అంటే “సూక్ష్మ క్రిముల సహాయంతో శత్రువులను నాశనం చేయడం”. అంటే సూక్ష్మక్రిములను ఆయుధాలుగా ఉపయోగించడం అన్నమాట. ఈ రంగంలో చైనా దారుణమైన పరిశోధనలు చేసి, ఎన్నో ఫలితాలను సాధించింది. ఈ విషయం ఇండియాకు గాభరా కల్గించింది. ఫలితంగా మనం కూడా ఈ రంగంలో పరిశోధనలు చేయక తప్పలేదు. ఈ శాఖలో విశ్వామిత్ర ఆరితేరిన విజ్ఞాని.”

రాణా వెన్నెముక జలదరించింది.

తను మొదట్నించీ ఊహిస్తున్నది పచ్చి నిజం!

ఈ మూర్ఖుల పిచ్చి ప్రయోగాలే ఈ మారణహోమానికి పూర్తి కారణం।

“ప్రొఫెసర్ విశ్వామిత్ర జీవశాస్త్రంలో చాల విధాలుగా మేధాసంపత్తి గలవాడు. ఆయన మనిషి లేదా

జంతువు శరీరంలో విపరీతమయిన మార్పులు తీసుకువచ్చే ఒక ప్రక్రియను కనిపెట్టాడు. దీనిని 'ఆర్గానిజం' అంటారు."

"అంతకంటే స్పష్టంగా చెప్పాలి" ఓ కంఠం పలికింది గోకుల్ రామ్ మాటలకు అడ్డుతిగులూ.

అందరి కళ్ళు ఛీఫ్ సైంటిఫిక్ ఎడ్వైజర్ అశ్వత్థామ వైపు తిరిగాయి.

"ఎస్, ప్రొఫెసర్ అశ్వత్థామా?" అడిగాడు హోమ్ సెక్రెటరీ.

"సైంటిస్టు విశ్వామిత్ర ఆ ప్రక్రియను కొత్తగా కనుగొనలేదు. 'ఆర్గానిజం' అనేది సహజంగా వున్నదే. అయితే తీవ్రమయిన పరిశోధనలు చేసి విశ్వామిత్ర 'మైక్రోప్లాస్మ' అనబడే ఒక ఆర్గానిజాన్ని ఎన్నుకొని దాన్లో తీవ్రమైన మార్పులు తీసుకువచ్చాడు. 'మైక్రోప్లాస్మ' అంటే ఒక జంతువులోగానీ, మనిషిలోగానీ వ్యాధినుత్పత్తిచేసే ఒక జీవపదార్థం."అంటూ ఆగాడు అశ్వత్థామ.

"ఈ విషయం గురించి మీరే కొనసాగిస్తే మంచిది అశ్వత్థామగారూ! శాస్త్రీయంగా నాకంటే మీరు బాగా చెప్పగలుగుతారు" అన్నాడు రక్షణశాఖ సహాయమంత్రి.

"ఆల్ రైట్!" తలపంకించి ఆహూతులందర్నీ ఒకసారి పరికించి చూసాడు అశ్వత్థామ. "విశ్వామిత్ర మహామేధావి అనడంలో యెట్టి సందేహం లేదు. కొన్ని సంవత్సరాలు ఆయనవద్ద నేను పనిచేశాను కూడా. కాని విశ్వామిత్ర బాధ్యతారాహిత్యమయిన వ్యక్తి అని చెప్పక తప్పదు.

"రక్తప్రసరణలో కలిస్తే ఆరోగ్యవంతమయిన జీవ కణాల్ని పాడుచేసి, మెదడుకు ప్రయాణించే పరాన్నజీవి (పారసైట్)గా మార్పులు చేసాడు మైక్రోప్లాస్మాని.

ఈ 'అతిసూక్ష్మప్రక్రియ' (మైక్రో ఆర్గానిజం) మెద డులో పదార్థాన్ని వాపుకి గురిచేస్తుంది. దానిపై ఒక పొర లాంటిదాన్ని ఏర్పరుస్తుంది.

దీనివల్ల మెదడులో వున్న జీవకణాలు నిర్వీర్యమై పోయి వాటి స్థానంలో పరాన్నజీవకణాలు (పారసైటి కల్ సెల్స్) ఉత్పత్తి చేయబడ్డాయి.

ఈ పారసైట్స్ బలం పుంజుకొనే కొద్దీ క్రమ క్రమంగా ఆరోగ్య జీవకణాలన్నీ వాటిచే మింగివేయ బడతాయ్."

"అప్పుడు యీ వ్యాధి సోకిన మనిషిలో ఉన్మాదం బయలుదేరుతుంది! మెదడులో ఈ పరభుక్త జీవుల ప్రాబల్యం పెరిగేకొద్దీ మనిషి మానసికతుల్యస్థితిని కోల్పోతాడు. భౌతికంగా యే లోపమూ కనబడక పోయినా, క్రమంగా జీవచ్ఛవంలా మారతాడు."

"నే నెందుకు అలా మారలేదు?" ఆశ్చర్యంగా అడి గాడు రాణా ఉండబట్టలేక.

చిరునవ్వుతో రాణా వైపు చూసాడు అశ్వత్థామ. "నువ్వు చాలా అదృష్టవంతుడివి మిస్టర్ రాణా!" అంటూ తలతిప్పి దృష్టి జులేఖామీద కేంద్రీకరిస్తూ "నువ్వు ఎలా రక్షింపబడ్డావో జులేఖా యిప్పుడు చెప్పగలదని భావిస్తు న్నాను. కాని చెప్పవలసింది యింకా వుంటుంది" అన్నాడు.

జులేఖా చెప్పింది. "భూకంప సంఘటనలో రాణాకు పెద్ద గాయం యేర్పడింది. అందువల్ల కాంబే మిషనరీ

హాస్పిటల్‌లో అతనికి రక్తశుద్ధ చికిత్స జరిగింది. దీనివల్ల అతని రక్తనాళాల్లోని విదేశీకణాలు తొలిగించబడ్డాయి."

"కష్టంగా అదే మిస్ జులేఖా!" ప్రొఫెసర్ అశ్వత్థామ తల వూపాడు. "పరిశుద్ధమైన కొత్తరక్తం ఎక్కించడంవల్ల ఆరోగ్యంగా వున్న జీవకణాలు — పరాన్న జీవుల్ని (పారసైట్స్)ని నాశనం చేసాయి, బలహీనంగా ఉన్న సైనికదళాలకు తోడుగా కొత్తదళాలు పంపినట్లు యీ ఫలితం వచ్చింది. రాణాకు అదృష్టవశాత్తూ పరాన్న జీవకణాలు ఉధృతం కాకముందే ఈ రక్తచికిత్స చేయబడింది. మరో విషయంలో కూడా రాణా అదృష్టవంతుడు.

"జెర్మ్‌వార్‌ఫేర్‌లో చాలా ప్రక్రియల్లాగా సైంటిస్టు విశ్వామిత్ర ప్రక్రియలో కూడా ప్రమాదకరమైన యీ పారసైట్స్ వాటి కవే ఉత్పత్తిని చేసుకోగలవు. ఈ పరాన్నజీవులు శరవేగంగా సంతానోత్పత్తిచేసుకోడానికి కావల్సింది కార్బన్-డై-ఆక్సైడ్ మాత్రమే. మనం పీల్చే గాలిలో వుండే యీ కార్బన్-డై-ఆక్సైడ్ వాటికి అమృతం లాంటిది. దాని సహాయంతో యీ పారసైట్స్ అయిదు-పది-పదియిరవై-యిరవై నలభై....యీ రేషియోలో ఉత్పత్తి అవుతాయి. ఈ ప్రక్రియ మొదటి దశలో వుండగా రాణా దానికి ఎక్స్‌పోజ్ అయ్యాడు. అందుచేత అవి అప్పటికింకా బలహీనంగా ఉన్నాయ్.

"ఈ సంవిధానం—మీరు చెప్పే ఆవిరి, పొగమంచు లేక మేఘానికి అనుబంధ ఉత్పత్తి. ఆ సంవిధానం కొనసాగుతుండగా గాలిలో వున్న కార్బన్-డై-ఆక్సైడ్‌ని అది పీల్చుకుంటూ బలం పుంజుకుంటూ వుంటుంది. ఈ ఆర్గానిజానికి ఫొటోసింథసిస్ లక్షణం కూడా

వుంది. అంటే యిది జీవిస్తూ రెట్టింపు అవుతుండడానికి సూర్యరశ్మి అవసరం! సూర్యరశ్మిలో దానికి కదిలివెళ్ళే లక్షణం కూడా వుంది.

"వ్యాధి సుత్పత్తిచేసే యీ జీవపదార్థానికి (మైకో ప్లాస్మా) కణకవచం వుండదు. అందుచేత తనకు సరిపడని వాతావరణంలో ప్రవేశించినపుడు యీ పారసైట్స్ తమను తాము రక్షించుకోనడానికి గుంపులు గుంపులుగా నివశిస్తాయి, లోపలి భాగంలో వున్న మైకోప్లాస్మాను కాపాడుతూ. సూర్యరశ్మిలో మాత్రమే యివి క్షేమంగా వుండగలవు. ఇందులో ఒక తిరకాసు ఉంది. ఇవి బ్రతుకుతూ బలం పుంజుకోడానికి సూర్యరశ్మి కావాలి. కానీ యే పరిస్థితులోనైనా యివి పొగమంచులాంటిదాన్ని చుట్టూ కప్పుకొని రక్షించుకోగలవు. ఈ రహస్యాన్ని యింకా వివరంగా చెప్పాలంటే సైంటిస్టు విశ్వామిత్ర మాత్రమే చెప్పగలడు. కాని దురదృష్టవశాత్తూ అతను మరణించాడు.

"నేను యింతకు ముందు చెప్పినట్లుగా విశ్వామిత్ర బాధ్యత తెలీని మనిషి. ఇటువంటి ప్రమాదకరమైన ప్రయోగం తలపెట్టడమే బాధ్యతలేనితనంగా నేను మొదట గుర్తించాను. కాని అతను చేసిన అవివేకపు పనులు యింకా ఉన్నాయ్. తన అశ్రద్ధవల్ల అతను పరిశోధిస్తున్న మైకోప్లాస్మా (వ్యాధిని పుట్టించే జీవ పదార్థం)కే బహిరంగంగా ఎక్స్‌పోజ్ అయ్యాడు. తత్ఫలితంగా పిచ్చివాడయ్యాడు. అతను ఉన్మాదస్థితిలో తన కాగితాలనీ, నోట్సులనీ, సంవత్సరాలపాటు చేసిన కృషిని నాశనం చేసాడు. 'మార్పులు చేసిన మైకో ప్లాస్మా' రహస్యాలనే కాదు యితర పరిశోధనాంశాలనీ,

మానవాళికి యెంతగానో ఉపయోగపడే తదితర పరిశోధనల డాక్యుమెంట్లనీ కూడా నాశనం చేసుకున్నాడు.

“అతను పిచ్చివాడుగా....మరణించాడు. తన సృష్టికి తనే బలి అయిపోయాడు. తనతోపాటు అనేక రహస్యాలు తీసుకుపోయాడు.

“జెర్మ్‌వార్ ఫేస్‌లో యితర ప్రయోగాల్లాగే యీ ప్రయోగం కూడా ఆచరణలో బహు ప్రమాదకరమైంది. ఇక యీ మైకోప్లాస్మా తర్వాతి కథను లెఫ్ట్‌నెంట్ జనరల్ ప్రచండసేన వివరిస్తే బావుంటుంది” అంటూ ఆగాడు అశ్వత్థామ వైస్ ఛీఫ్ ఆఫ్ ఆర్మీ స్టాఫ్ వైపు కనుబొమ ఎగరేసి చూస్తూ.

“ఉయ్ కెన్ హార్డ్లీ వెయిట్ టు హియర్” అన్నాడు సన్యాల్ యెత్తిపొడుపుగా.

“ప్రొఫెసర్ సన్యాల్!” హెచ్చరికగా పలికాడు హోమ్ సెక్రెటరీ.

“ఎక్స్‌క్యూజ్ మీ!” ఆరాటంతో జులేఖా కలగజేసుకుంది. “శ్రీ ప్రచండసేన్ మాట్లాడబోయే ముందు అశ్వత్థామగార్ని నేను ఓ ప్రశ్న అడగవొచ్చా? యిఫ్ యు ప్లీజ్! ‘వ్యాధి నివారణ’ గురించి....ప్రస్తుతం ఇది చాల ముఖ్య విషయంగా నేను భావిస్తున్నాను.”

హోమ్ సెక్రెటరీ తల వూపి అన్నాడు “కారీ ఆన్!”

“అయితే బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్ చికిత్స వ్యాధి నివారణ మార్గంగా మీరు భావిస్తున్నారు. ఈజ్ దట్ రైట్ ప్రొఫెసర్?” అశ్వత్థామను అడిగింది.

“అవును” నొక్కి పలికాడు అశ్వత్థామ. “సరియైన టైంలో యివ్వగల్గితే. పారసైట్ కణాలు మెదడులో

బలమైన హార్మోన్ని సంపాదించిన తర్వాత కొత్త రకం ఎక్కించినా ఉపయోగం వుండదు. ఈ పరాన్న జీవ కణాలు అభివృద్ధి చెందే అవకాశం యివ్వబడలేదు రాణా కేసులో. అందుకే బలంగా పనిచేస్తున్న మెదడులోని జీవకణాలు వాటిని శక్తిహీనం చేసాయి. కానీ అప్పటికే పారసైట్ కణాలు అనువు సంపాదించి స్థిరపడి వుంటే రాణా"........చేతులు చాచి భుజా లెగరేశాడు అశ్వత్థామ నిర్లిప్తంగా.

"ఆ చెడుకణాలని రేడియోలజీ ద్వారా కాల్చివేస్తే?"

"ఎ....ఎస్....ఎస్...." తత్తరపడుతూ అన్నాడు అశ్వత్థామ ఆ కొత్త ఆలోచనపై మెదడుని కేంద్రీకరిస్తూ "దటీజ్ ఎ పాసిబిలిటీ జులేఖా! కాని యెప్పటికైనా ప్రమాదకరమైనదే. ఆ పద్ధతిలో చెడుకణాలతోపాటు మిగతా మంచికణాలు కూడా పాడైపోయే అవకాశం వుంది. చాల చాల జాగ్రత్త తీసుకోవాలి. ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో. ఎక్స్-రే వల్లగానీ, పారసైట్స్ వల్లగానీ ఒకసారి పాడైపోయిన ఆరోగ్యకణాల గురించి యేమీ చెయ్యలేం. అవి యిక యెన్నటికీ పెంపొందవు."

"నో ప్రొఫెసర్! బట్ యిటీజ్ ఎ ఛాన్స్ వర్త్ టేకింగ్" అన్నదామె.

"అఫ్కోర్స్. కాని యీ వ్యాధికి గురైన ప్రతి వ్యక్తికీ యీ విధమైన ట్రీట్మెంట్ యివ్వలేం జులేఖా. అంతటి వనరులు మనకు లేవ్" తల విదిలించాడు అశ్వత్థామ నిరాశగా.

"లేదు. ఈ పద్ధతిలో అందరికీ చికిత్స యివ్వలేం"

చుట్టూ చూసింది జులేఖా. "కాని ఆ అవసరం ఏర్పడకుండా చెయ్యాల్సిన బాధ్యత మీ అందరి మీదా ఉంది. యు హావ్ టు డిస్ట్రాయ్ ది మైకోప్లాస్మా!"

తన ఆఖరిమాటపై యెవరూ వ్యాఖ్యానం చెయ్యడానికి అవకాశం యివ్వకుండా చటుక్కున రాణావైపు తిరిగింది జులేఖా. "రాణా! నేను యిప్పుడు తిరిగి రీసెర్చి సెంటర్‌కి వెళ్ళిపోతున్నాను. లూసీకి వెంటనే రక్తశుద్ధి చికిత్స చేద్దామనుకుంటున్నాను. అవసరమైతే రేడియోలజీ ట్రీట్‌మెంట్ కూడా. ఆమె తండ్రి కండిషన్ బాగోలేని కారణంగా నీ నుండి పర్మిషన్ కావాలి యివి చెయ్యాలంటే."

"గో యెహెడ్ జులేఖా!" చెప్పాడు రాణా. "ఆమెకి యేది అవసరమనిపిస్తే, యెన్ని అవసరమనిపిస్తే అన్నీ నిరభ్యంతరంగా చెయ్యి. ఐ ట్రస్ట్ యువర్ టాలెంట్."

"థాంక్యూ" అని భుజం తట్టి పైకి లేచింది జులేఖా. "జంటిల్మెన్! నన్ను క్షమించాలి. నేను కొన్ని ప్రాణాలు బ్రతికించాలి. అందుకు చాల యేర్పాట్లు చేసుకోవాలి. ఈ సమావేశంలోని మిగతా వివరాలు తర్వాత నాకు అందేట్టు చూస్తారని ఆశిస్తాను."

చకచకా నడిచిపోతున్న జులేఖాను మెచ్చుకోలుగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు అశ్వత్థామ.

హోం సెక్రెటరీ గొంతు సవరించుకున్నాడు. "మిస్టర్ అశ్వత్థామా! ఒకసారి సంతృప్తికరంగా యీ ఉన్మాదవ్యాధి నుండి కోలుకున్న మనిషికి తిరిగి మళ్ళీ సంక్రమించే అవకాశం వుందా?"

ప్రొఫెసర్ రెండు క్షణాలు ఆలోచించి బదులు

చెప్పాడు. "సాధారణంగా శరీర నిర్మాణం తనలోంచి ఒక వ్యాధిని త్రోసిపుచ్చ గలిగినపుడు పూర్తి వ్యాధి నిరోధక శక్తి అది పెంపొందించుకొంటుంది. ప్రస్తుతం రాణా కేసులోలాగానే త్వరితంగానే చెడు జీవకణాలని చంపి, శరీరంనుంచి బయటికి గెంటించడం జరిగితే నా ఉద్దేశం ప్రకారం మళ్ళీ యీ వ్యాధి అతనికి యెటాక్ అయ్యే అవకాశం లేదు. ఈ సిద్ధాంతాన్ని యింకా టెస్టు చేయవల్సి వుందనుకోండి....అయితే మీకు తెలిసే వుండాలి. శరీరానికి సెల్ఫ్ ప్రిజర్వేషన్ అనే శక్తి ఉంటుంది. శరీరం దాని రక్షణలు దాని కదే ఏర్పాటు చేసుకొంటుంది."

"ఈ వ్యాధి ఒకరికి ప్రబలినపుడు అది మరొకరికి సోకే ప్రమాదముందా? ఈజ్ దిస్ యిన్ఫెక్టివ్?" అడిగాడు సన్యాల్.

"నో. అలాంటి ప్రమాదం లేదు. పోతే సమస్య యేమిటంటే, సాదారణ స్థితిలో వున్న మైకోప్లాస్మా గురించే మనకు కావలసినంత తెలియదు. ఇక దాన్ని కొన్ని మార్పులకు గురిచేస్తే జరిగేదేమిటో బొత్తిగా తెలియదు. ఫిజియోలజీ, బయోకెమిస్ట్రి ప్రకారం మైకోప్లాస్మా, బాక్టీరియాల లక్షణాలు ఒక్కటే. కానీ మైకోప్లాస్మాకు కణకవచం వుండదు. అందుచేత దానికి ఒక యిబ్బంది లేదు. తన ఆకారాన్ని మార్చుకుని ఎంత చిన్న రంధ్రంలోనైనా అది ప్రవేశిస్తుంది."

గొంతు సవరించుకుంటూ అన్నాడు సన్యాల్ "అయితే దీనికి నివారణ లేదా?"

"నో....నో....మనం తప్పక పరిష్కారం కనుక్కోవచ్చు. కాని దీనికి విరుగుడు మందు....ఐ మీన్....సెరమ్

కనుక్కోబోయే ముందు మైకోప్లాస్మా అసలు ఏ విధంగా మార్పులు చేయబడిందో తెలుసుకోవాలి."

"దాన్ని గురించి మీ కీ పాటికి ఓ అభిప్రాయం ఉండి వుండాలి మిస్టర్ అశ్వత్థామా?"

"ఓహ్, నా కో అభిప్రాయం వుంది. కాని పరిశోధనలు చేసి నా అభిప్రాయాల్ని డెవలప్ చేసుకోనేందుకు సమయం వుందా? లేదు. కాని బ్రతికున్న వ్యాధిపీడితుల ఆర్గానిజం పరిశీలించి దాని కంటెంట్స్ తెల్సుకుని విరుగుడు మందు తయారుచేయొచ్చు. కాని ఈ సెరమ్‌ని భారీ యెత్తున ఉత్పత్తి చేయాలంటే చాలా కాలం పడుతుంది. అంత టైం తీసుకునే అవకాశం మనకు లేదు. కాబట్టి యీ మార్పులు చేయబడ్డ మైకోప్లాస్మాని పరిశుద్ధ స్థితిలో మనం శాంపిల్ తీసుకోగలిగితే అది చాల చాల ఉపయోగకరం."

"వెల్. ఆ పొగమంచులో కొంతభాగాన్ని తీసుకు రావడం అంత కష్టమేముంది?" డిఫెన్స్ అండర్ సెక్రెటరీ అడిగాడు అసహనంగా.

"నేను చెప్పింది 'పరిశుద్ధమైన దశలో వున్న మైకోప్లాస్మా శాంపిల్' కావాలని. ఈ పొగమంచు లేదా విషమేఘంలో కార్బన్-డై-ఆక్సైడ్, ఇంకా అనేక కల్మష వాయువులు వుంటాయి. ఈ పొగమంచుకు పసుపు రంగు రావడం, గాలిలోని వాతావరణ కాలుష్యం వల్లనే. ఈ అక్కర్లేని యెలిమెంట్స్‌ని వేరుచేసి ఆ మైకోప్లాస్మాని గ్రహించడానికి టైం పడుతుంది."

"డిసీజ్ లీడింగ్ అవుట్ టు అవర్ నెక్స్ట్ పాయింట్ జంటిల్మెన్!" అన్నాడు హోం సెక్రెటరీ. "ఈ వైరస్ వ్యాధి ప్రబలడానికి కారణాలు వివరించవల్సిందిగా లెప్టి

సెంట్ జనరల్ ప్రచండ సేనని కోరుతున్నాను."

"అది ప్రజల్ని నాశనం చేసేముందు, ఏ విధంగా తప్పించుకుని బైటపడ్డదో కూడా చెప్పాలి," అన్నాడు సన్యాల్ వెటకారంగా.

ప్రచండ సేన్ లేచి నిలబడ్డాడు, సైనికుల ముందు మాట్లాడబోయే అధికారిలా.

"సైంటిస్టు విశ్వామిత్ర అనేక సాంకేతిక మార్పులకు గురిచేసి తయారుచేసిన ఈ మైకోప్లాస్మా—గాలి చొరవని గదిలో, స్టీలుతో చేయబడి అన్నివైపులా సీలు చేయబడ్డ ఒక పరీక్షనాళికలాంటి పరికరంలో బిగించబడ్డది. విశ్వామిత్ర పొరబాటున దాని మూత పడవేశాడు, ఒక జంతువుపై పరిశోధన జరుపుతుండగా—కుందేలు అనుకుంటాను.

"ఎనీవే, విశ్వామిత్ర తన పొరపాటు గుర్తించి తిరిగి మూత బిగించి సీలు చేయబడిన ఆ గదిని వదిలిపెట్టాడు. అతను పిచ్చివాడుగా మారడానికి కొంత టైం పట్టింది. ప్రొఫెసర్ అశ్వత్థామ చెప్పినట్లుగా అప్పటికి మైకోప్లాస్మా పరిశుద్ధ దశలో వుంది. కొద్ది క్షణాలు మాత్రమే దానికి ఎక్స్‌పోజ్ అయ్యాడు విశ్వామిత్ర. బయటగాలీ, సూర్యరశ్మి సోకగానే అతని శరీరంలో చోటుచేసుకున్న మైకోప్లాస్మా తన విషప్రభావాన్ని చూపించసాగింది.

"ఉన్మాదస్థితిలో విశ్వామిత్ర కాగితాల మీద పెట్టిన తన కృషినంతా నాశనం చేసాడు. అంతేకాదు, తోటి సైంటిస్టు నొకడ్ని చంపేశాడు. తర్వాత అతను పని చేయలేని బొమ్మలా, డమ్మీలా మారాడు. అతని కళ్ళు దేనినీ చూసేవికావు. అతని చెవులు ఏ శబ్దాన్నీ వినేవికావు. కొద్దిరోజుల తర్వాత తనను తానే పొడుచుకుని మరణించాడు. (ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులుకాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో గోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో నవ్వులు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## దొంగల నాయకుడు

"సార్, చాలా ఆకలిగా వుంది."

బస్‌స్టాండులో ఒక నిస్సత్తువ గొంతు విని వులిక్కిపడి తల పైకెత్తి చూశాను. ఎవరో యిరవై ఏళ్ళ యువకుడు దీన మొహంతో నిలుచున్నాడు. అతని వంటిమీద దుస్తులు మురికిగా వున్నా ముష్టివాడిలా లేడు.

"మూడు రోజుల నుంచి తినడానికి ఏం దొరకలేదు సార్. ఇక భరించలేను ఈ ఆకలిని."

"అయితే నేనేం చెయ్యాలి? ఏదైనా పని చెయ్యి. దున్నపోతులా వున్నావు. అడుక్కు తినడానికి సిగ్గేయడంలేదూ?"

"ఇది తప్పనిసరి పరిస్థితి సార్! ఎన్నో రోజులుగా ప్రయత్నిస్తున్నాను. ఎక్కడ ఏ పని దొరకడం లేదు."

"బొంబాయికి కొత్తా?"

"అవును."

"ఎక్కడ నుంచి వచ్చావు?"

"హైదరాబాద్."

"ఎందుకు?"

"ఇంట్లో పోట్లాడి. మీరే ఏదైనా ఇప్పించండి సార్!"

"నేనా? నేను కూడా ఇక్కడివాణ్ని కాదు. బొంబాయి చూడ్డానికి వచ్చాను. ఏదయినా ట్రాన్స్‌పోర్టు వాళ్ళని

అడక్కపోయావు. ట్రక్‌లని లోడింగ్, అన్ లోడింగ్ చేస్తూ వేలమంది కూలీలు జీవిస్తున్నారు. అందుకు ఎవరి సహాయం కూడా అక్కరలేదు"

"అక్కడ కూడా ప్రయత్నించాను. కానీ, ఇతర కూలీలు తరిమి కొట్టారు."

"దెబ్బలకు దడిసావా? చూడు, నువ్వెంత భయపడు తావో, అంత భయపెడుతుందీ లోకం. ఇది కూడా గుర్తుంచుకో! ఎప్పటివరకు నువ్వు దెబ్బతినవో, ఇంకొకరిని దెబ్బ తీయలేవు. దెబ్బతీయడం నేర్చుకోకపోతే, లోకం నిన్ను బ్రతకనివ్వదు. బ్రతకాలన్న ఆశ నిన్ను చావనీయదు."

అంతలోనే నా దృష్టి, యెదురుగా రోడ్డు దాటుతున్న ఓ జంటపై పడింది. ఆ యువకుడి కుడిచేతిలో ఒక బ్రీఫ్‌కేస్ వుంది. ఎడమచెయ్యి యువతి నడుముచుట్టూ వుంది. ఆయువతి చాలా అందంగా వుంది. బొడ్డు క్రిందగా చీర కట్టడంవల్ల సుళ్లు తిరిగిన నడుము స్పష్టంగా కనిపిస్తోంది. ప్రక్కనున్న యెవడికయినా అక్కడ చెయ్యి వెయ్యాలనిపించక మానదు. ఆ యువకుడి అదృష్టానికి ఈర్ష్య కలిగింది నాకు.

నేను మళ్ళీ చేరువలో నిల్చున్న యువకుడి వైపు చూసాను. వాడు చాలా ఆశ్చర్యంగా చూడసాగాడు నన్ను.

"నీ పేరేమిటి?" అడిగాను.

"జీవన్."

"నా పేరు సుదర్శన్" కరచలనం చేయడానికి నేను చెయ్యి ముందుకు చాచుతూ అన్నాను. వాడింకా ఆశ్చర్య పోతూ చెయ్యి కలిపాడు.

"ఆఁ జీవన్...." నేను మళ్ళీ అన్నాను. "ఇవ్వాల్టి నుంచి నువ్వు నేను స్నేహితులం. ఇప్పుడు నీ కో ఉపాయం చెబుతాను.. ఆ అందమైన జంటను చూస్తున్నావుగా?"

"అఁ....."

"అతని పట్టు ఆ యువతి నడుముపై నున్నంతగా బ్రీఫ్‌కేస్‌పైన లేదు. అతని దృష్టి కూడా ఆమెపైనే వుంది ఎక్కువగా. బ్రీఫ్‌కేస్‌పైన లేదు. ఏమంటావ్?"

నా ఉద్దేశాన్ని అర్థం చేసుకున్నాడు.

"కానీ సార్, యిప్పుడు నేను చాలా బలహీనంగా వున్నాను. కొద్ది దూరం కూడా పరుగెత్తలేను."

"సరే నువ్వే చెప్పు. నీకోసం నన్నేం చేయమంటావు?"

"ఓ పావలా ఇవ్వండి. ఒక బన్ తెచ్చుకుని తింటాను. ఆ తర్వాత ఆలోచిస్తాను."

నా జేబులో నుంచి ఓ అయిదు రూపాయల నోటువుంటే, అది తీసి వాడి చేతిలో పెట్టాను. పీక్కుపోయిన మొహం ఒక్కసారిగా వికసించింది. చటుక్కున వంగి నా కాళ్ళకి దణ్ణం పెట్టబోయాడు! నేను వద్దని వారించాను.

"మీరు మహాత్ములు సార్. మీ మేలు మరచిపోలేను" ఆ తర్వాత వాడు వెళ్ళిపోయాడు. సంతోషంతో హోటల్ వైపు పరుగుదీస్తున్న వాడికేసి చూస్తూ జాలిగా నవ్వుతున్నాను.

* * *

రెండు నెలల తర్వాత మళ్ళీ బొంబాయికి వెళ్ళవలసి వచ్చింది. ఓ రోజు సాయంత్రం బస్‌స్టాప్‌లో నిల్చుని దాదర్‌లో వున్న నా స్నేహితుడి ఇంటికి వెళ్ళాలని ఆలోచిస్తున్నాను. చాలాసేపయింది, బస్సు రాలేదు.

హఠాత్తుగా నామీద మెరుపు తాకిడి సంభవించింది. ఎవడో పరిగెత్తుకుంటూ వచ్చి ఢీ కొన్నాడు. ఆ తాకిడికి నేను గిర్రున తిరిగాను. నేను నిలదొక్కుకున్నాక చూస్తే నా జేబులో పర్సు లేదు. ఖరీదయిన దుస్తులు వేసుకున్న ఒక యువకుడు బస్‌స్టాప్ బయటికి పరుగెత్తుతున్నాడు.

నేను అరుస్తూ వాడివెంట బడ్డాను.

"పట్టుకోండి....పట్టుకోండి, దొంగ....దొంగ!"

అప్పుడే ఓ దృఢకాయుడు అతన్ని పట్టుకున్నాడు.

అతన్ని చూడగానే గుర్తుపట్టాను.

"అరె, జీవన్ నువ్వా!"

"సుదర్శన్‌గారు మీరు!" వాడు కూడా ఆశ్చర్య పోయాడు. "క్షమించండి. నా చూపులు కేవలం పర్సు పైకే వెళ్ళాయి. మిమ్మల్ని చూడలేదు."

"ఫర్వాలేదు. యెలాగయితేనేం, నీలో చెప్పుకోతగ్గ మార్పు వచ్చింది" అన్నాను వ్యంగ్యంగా.

"మీ చలవే సార్!" అన్నాడు నవ్వుతూ. "ఇప్పుడు నాకు బ్రతుకుతెరువు దొరికింది. మీరు నిజం చెప్పారు. మనిషి దెబ్బతింటేనే, దెబ్బ తీయగలుగుతాడు."

అంతలోనే వాడికి హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చింది.

వాడు తన జేబులోంచి ఓ నోట్లకట్ట బయటకు తీసి, అందులోంచి ఓ ఐదురూపాయల నోటు వేరుచేసి, మిగతా కట్టను తిరిగి జేబులో పెట్టుకున్నాడు.

ఆ ఐదు రూపాయల నోటు నా వైపు చూపుతూ అన్నాడు: "ఇదిగోండి మీ ఐదు రూపాయలు...."

ఇంకా వాడి మాట పూర్తవకుండానే హఠాత్తుగా నా దవడ అదిరిపోయింది. తర్వాత మెడ, వళ్ళు, కడుపు. తన్నుల గుద్దుల వర్షం నా వంటిమీద కురిసింది. బస్‌స్టాప్ లోని జనమంతా నాపై విరుచుకుపడి అరుస్తున్నారు.

"పట్టుకోండి!"

"తన్నండి వెధవను!!"

"వీడు దొంగల నాయకుడు."

—కర్నాటి నాగభూషణం, హైదరాబాదు.

